# స్వయంకృతాపరాధం

రాష్ట్రపతికి ప్రధాన మంత్రికి మధ్య జరుగుతున్నటువంటి ఘర్షణ పైపైన చూస్తే స్వల్ప మయినదిగానే కనబడుతుంది రాష్ట్రపతికి ప్రభుత్వ నిర్ణయాలన్నిటినీ సక్రమంగానే తెలుపుతూ వస్తున్నానని ప్రధానమంత్రి అంటున్నారు అలా జరగడం లేదని రాష్ట్రపతి అంటున్నారు సాంకేతికంగా చూస్తే, రాష్ట్రపతి చెపుతున్నదే నిజం ఎందువల్లనంటే ప్రధాని రాష్ట్రపతిని కేవలం రెండుసార్లు మాత్రమే కలిశారు 28 నెలలలో రెండుసార్లు మాత్రం కలిసి "పరిపాలనకు సంబంధించి నటువంటి మంత్రివర్గ నిర్ణయాలన్నిటినీ తెలియజేయడం" అనే రాజ్యాంగబద్ధమైనటువంటి విధికి ప్రధానమంత్రి న్యాయం చేకూర్చజాలరు ప్రధానమంత్రి స్వయంగా అనకపోయి నప్పటికీ అయన మనుషులు రాష్ట్రపతి కార్యాలయంలో బైటికి చేరవేసే "తూము ఉన్నదని రైసినా కొండ మీద ఆ భవనంలో ఏ రహస్యమూ ఎక్కువ కాలం రహస్యంగా ఉండజాలదని చెవులు కొరుకుతూ తిరుగుతున్నారు బహుశా ఈ కారణం వల్లనే రాజీవ్‌గాంధీ 1985లో - రెండు ఒప్పందాల (అస్సాం పంజాబ్ ఒప్పందాలు) సంవత్సరం అది రాష్ట్రపతిని ఒక్కసారి అయినా కలిసి ఉండరు ఐతే ఒప్పందాల మీద సంతకాలు అయిపోయిన తర్వాత అంటే చర్చలు పూర్తయిన చాలా కాలం తర్వాతనయినా రాష్ట్రపతికి ఎందుకు చెప్పి ఉండకూడదో అర్థం కావడంలేదు

రాష్ట్రపతితో సమావేశమయిన వారి జాబితా గనుక చూస్తే - ఆ జాబితా బహిరంగ జాబితానే కేంద్ర కాబినెట్ మంత్రులు కూడా అయనను కలవ వలసినంత ఎక్కువగా కలవడం లేదని తెలిసి పోతుంది ఉదాహరణకు అర్జున్‌సింగ్ పంజాబ్ గవర్నర్‌గా పనిచేసిన కాలంలో రాష్ట్రపతిని ఒక్కసారయినా కలవలేదు అయనకు కలవ గూడదనే ఆదేశమైనా వచ్చి ఉండాలి లేదా తన నాయకుని నుంచి అయన ఆ సూచనలైనా గ్రహించి ఉండాలి ఈ రకమైనటువంటి ఉద్దేశ్యపూర్వకమైన నిరాదరణ అపసవ్యం మాత్రమే కాదు మన బాల్యారిష్టాల దశలోని ప్రజాస్వామ్య సాంప్రదాయాన్ని పెద్ద ఎత్తున దెబ్బతీస్తుంది కూడా లాటిన్ అమెరికాలోని బనానా రిపబ్లిక్ లలాంటి కీలు బొమ్మల దేశంగా ఈ దేశాన్ని మార్చడానికి ఇంక ఒక్క అడుగు మాత్రమే ఉన్నటువంటి స్థితికి ఈ చర్య మనను తీసుకుపోతుంది

ప్రభుత్వాధినేతలకు దేశాధినేతలకు మధ్య ఘర్షణలు ఇతర దేశాలలో కూడా కొత్తవేమీ కావు బ్రిటన్‌లో మార్గరెట్ థాచర్ పట్ల బ్రిటిష్ రాణికి అంత సదభిప్రాయమేమీ లేదని వింటూనే ఉన్నాము కాని ఆ ఇద్దరూ ప్రతి శుక్రవారం బకింగ్‌హాం పాలెస్‌లో కలుసుకుంటారు కలిసి తేనీరు ప్రముఖమయిన రుచీ పచీ లేని కకంబర్ సాండ్‌విచ్‌లు అతిథులందరికీ ఆ భవనంలో వడ్డించేవి అవే సేవిస్తారు థాచర్ అంత సులభంగా కలిసి గడపగలిగిన వ్యక్తేమీ కాదు అమాటకొస్తే రాణి కూడ అంతే కాని అటువంటి సమయాలలో వ్యక్తిత్వాలు ద్వితీయ స్థానానికి చేరుతాయి ఆ ఇద్దరు మహిళలూ ప్రతి వారమూ ఒకరితో మరొకరు గంటో రెండు గంటలో సుహృద్భావంతో గడుపుతారు

బ్రిటన్‌లాగ కాకుండా లిఖిత రాజ్యాంగం దాని మూడు విభాగాలయినటువంటి కార్య నిర్వాహక వర్గం శాసనసభ న్యాయ విభాగం విడి విడిగా కర్తవ్యాలు నిర్దేశించుకున్న అమెరికా సంయుక్త

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

రాష్ట్రాలలో విషయాలు మరింత క్లిష్టంగా ఉంటున్నాయి అక్కడ అధ్యక్షుడు ప్రధాన కార్య నిర్వాహకుడు కావచ్చు కాని అయన చర్యలు కొన్ని నిర్దిష్ట నియమాలను పాటించాల్సి ఉంది ప్రత్యక్షంగా కాకపోయినా అంతిమంగా అయన కాంగ్రెస్‌కు జవాబుదారీగా ఉంటారు అక్కడ అంత సులభంగాఉల్లంఘించడానికి వీలులేని నియమాలున్నాయి రిచర్డ్ నిక్సన్ చట్టాన్ని ఉల్లంఘించారు వాటర్‌గేట్‌లో మర్యాద పరిమితుల్ని ఉల్లంఘించారు రాజకీయ వ్యవస్థ నుంచే పూర్తిగా బహిష్కరించబడ్డారు రోనాల్డ్ రీగన్ నిర్వహణా లోపాల పరిమితిని దాటారు ఇప్పుడు జవాబు కోసం బోనెక్కనున్నారు వైటహౌస్‌లో రీగన్ ప్రవర్తనను తీవ్రంగా అభిశంసించిన టవర్ నివేదిక తర్వాత రీగన్ ప్రజలకు

వివరంగా కాకపోయినప్పటికీ - తన అరాచకాల గురించి క్షమాపణ చెప్పుకున్నాడు అయనను కాంగ్రెస్‌గానీ ప్రజలు గానీ క్షమిస్తారా లేదా అనేది వేరే విషయం కాని అయన మన ప్రభుత్వాధినేతల లాగా తన ఇష్టానుసారం తాను ప్రవర్తిస్తాననీ విమర్శకులందరూ ఏ గంగలో దూకినా తన కభ్యంతరం లేదనీ అనలేదు సందర్భ వశాత్తూ టవర్ కమిషన్‌ను నియమించినది స్వయంగా అధ్యక్షుడే కాంగ్రెస్ కాదు

రాజ్యాంగ పరమైనటువంటి అవకతవకలను అలా ఉంచి రాజీవ్‌గాంధీ ప్రభుత్వపు స్వభావం ఏమిటనేది ఇప్పుడు ప్రధాన ప్రశ్న ఖచ్చితంగా అది బహిరంగ ప్రభుత్వం కాదు చాల రహస్య పూరితమయినటువంటి ప్రభుత్వం ఏ రకంగా చూసినా అది పూర్తిగా ఎవరికీ జవాబుదారీ కానీ ఒక ముఠాకో హింసా బృందానికో గల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే స్వంత వ్యవహారం లాగ నడుస్తున్నది ఈ మధ్య కాలంలో జరిగిన అనేక దురదృష్టకరమైన సంఘటనల ద్వారా ఇది స్పష్ట మవుతున్నది విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్‌ను ఆర్థిక శాఖనుంచి రక్షణ శాఖకు మార్చినప్పుడు మనకేం

( 70 వ పేజీ చూడండి)







"షీలా... వికసించిన ఛాయతో వెలిగిపోతూం
నీ ముఖ సొగసు... చూసిచూసి
మతితప్పి పారేసుకున్నా నా మనసు!"

# ఇతర్లు గుర్తించేలాంటి మెరుగైన వంటి ఛాయను షీలాకి సహజంగా, మృదువుగా సమకూర్చింది ఫెయిర్ అండ్ లవ్లీ... అదెలాగో చదవండి.

పెళ్లి కూతురయ్యేది ఒక్క రోజే కాని భార్యగా వుండేది జీవితాంతం! ఇది అర్థం చేసుకునే షీలా పెళ్లయ్యాక కూడా ఫెయిర్ అండ్ లవ్లీ ప్రతి ఉదయం రాత్రీ ఉపయోగిస్తూనే వుంది ఎందుకంటే వికసించిన వంటి ఛాయ అనే ఓ అమూల్య కానుకని షీలాకి ఇచ్చింది ఫెయిర్ అండ్ లవ్లీ—దాన్ని జీవితాంతం శాశ్వతంగా ఉంచుకోవాలని ఆమె కోరిక పెళ్లయి ఎన్నో పౌర్ణమి రోజులు గడిచినా మీ ఆయన ఇప్పటికీ హనీమూన్ మోహంలోనే మునిగి వుంటే మీరు మాత్రం ఆ సౌందర్య నిధిని వదులుకుంటారా? షీలా లాగే మీరు కూడా తెల్లని వంటి ఛాయ అనే కలని నిజం చేసుకోవచ్చు—ఫెయిర్ అండ్ లవ్లీతో

## ఓ ముఖ్యమైన వైజ్ఞానిక విజయం

ఫెయిర్ అండ్ లవ్లీ మీ వంటికి సహజమైన రీతిలో మెరుగైన ఛాయ నివ్వడానికి దీనిలో వుంది ఓ సాటిలేని ఫార్ములా—ఇది ముఖ్యంగా రెండు విధాల పనిచేస్తుంది ఒకటి ఇది చర్మం అడుగున పనిచేసి శరీరం స్వతహాగా లోలోనే నల్లబడటాన్ని


ఫెయిర్ అండ్ లవ్లీ వాడక ముందు


ఫెయిర్ అండ్ లవ్లీ వాడిన తర్వాత

అరికడుతుంది— ఇంకే క్రీమూ చెయ్యలేని తీరులో



రెండు దీని డబల్ సన్‌స్క్రీన్ చర్మ లోనికి చొచ్చుకుపోయి నల్లబరిచే సూర్య కిరణాల నుంచి చర్మాన్ని కాపాడుతుంది అంచేత 6 నుంచి 8 వారాల్లో పైకొచ్చే కొత్తచర్మ పొరలు మరింత మెరుగైన ఛాయ కలిగి వుంటాయి మీరు ఫెయిర్ అండ్ లవ్లీని నియమానుసారంగా రోజుకు రెండుసార్లు ఉపయోగిస్తూంటే మీ వంటి ఛాయ ఎంతో అందంగా మృదువుగా తెల్లగా అలాగే నిలిచి వుండటం ఖాయం

## ఉపయోగించే పద్ధతి

ముఖం మెడ చేతులు కడుక్కున్నాక వాటి మీద ఫెయిర్ అండ్ లవ్లీ క్రీము చుక్కచుక్కలుగా రాయండి ఇప్పుడు వేళ్లను ఎగువకు రుద్దుతూ నెమ్మదిగా మాలిష్ చేయండి ఫెయిర్ అండ్ లవ్లీ పనిచేయడం ప్రారంభించగానే మీకు కొద్దిగా జిమజిమలాడవచ్చు భయపడకండి అది తొందరగా తగ్గిపోతుంది

## సులభంగా లోనికి ఇంకుతుంది

ఫెయిర్ అండ్ లవ్లీ ఇంతకు ముందుకన్న ఇప్పుడు మృదువుగా నేవళంగా ఉంటుంది అది చర్మం అంతటా మరింత సమానంగా పరుచుకొని మరింత సులభంగా లోనికి ఇంకుతుంది త్వరలోనే ఆ తేడాని మీరు అనుభూతి చెందుతారు కంటితో చూస్తారు కూడా!

మీరు ఫెయిర్ అండ్ లవ్లీ గురించి ఇంకా ఏమైనా అడిగి తెలుసుకోవాలనుకుంటే ఈ చిరునామాకు వ్రాయండి శ్రీమతి కవితా కుమార్ ఫెయిర్ అండ్ లవ్లీ అడ్వయిజర్, పి ఓ బాక్స్ 758 బొంబాయి-400 021

కొత్తది! మరింత మృదువైన
**ఫెయిర్ అండ్ లవ్లీ**
వంటి ఛాయ మెరుగుపరిచే క్రీమ్




## వంటి ఛాయను మెరుగుపరుస్తుంది సహజంగా, మృదువుగా... ఇతర్లు గుర్తించేలాగ!

రూపురంగులనిచ్చే పసుపు బంగరు
యాత్రలకు కారణం ఆయుర్వేద మూలికలే.

# హిమానీ గోల్డ్

## టర్మరిక్ క్రీమ్ మరియు సబ్బు

ఎవరికి తెలియదు చర్మ సౌందర్యాలకు పసుపు ఎంత సహాయ కారిణి అని. కానీ యీ తొందర రోజులలో శనగపిండితో కలిపి ప్రతి దినం ఎవరు వాడతారు... శనగపిండి లేకుండా కేవలం పసుపు మాత్రం కలసి ఉన్న చర్మ సౌందర్య సాధనాలు ఎలా చర్మాన్ని కాపాడగలవు ?

సంవత్సరాల తరువాత యీ సమస్యకు సమాధానంగా కనిపెట్టారు భారత విఖ్యాత రవీంద్ర పురస్కార విజేత శ్రీ శివకాళీ భట్టాచార్యగారు సౌందర్య సాధనాలలో కలిపేందుకు గాను పసుపుతో సహా తులసీ, గోరింట వట్టి వేళ్ళు, చందనం మరియు పద్మకముతో వనమూలికల గుణములు కలిసినట్లయితే చర్మ సౌందర్యాలకు పసుపు ఇస్తుంది ఒక ప్రత్యేకతను. శనగపిండి లేదే అన్న సమస్య మరి లేదు. సంపూర్ణ బంగరు ఛాయలు అలా నిలుస్తాయి.

ఔను—ఆయుర్వేదపు యీ అమూల్య అన్వేషణా ఫలితం లభిస్తోంది పూర్తిగా హిమానీ గోల్డ్ టర్మరిక్ క్రీమ్ లేక హిమానీ గోల్డ్ టర్మరిక్ సబ్బులో సదా ఇదే భారత దేశంలో ప్రప్రథమం.

ఇప్పుడు మీ చర్మంలో క్రీమ్ మరియు సబ్బుల యొక్క ఆయుర్వేద గుణం అతి సహజ సౌందర్యాలతో మిళితమై శరీరం బంగరు ఛాయలతో మిరిమిట్లు గొలుస్తోంది.

ఔను —అందరు అందాలను రెప్ప వేయకుండా చూస్తారు.

శాస్త్రాలలో వర్ణించబడిన వన ఔషదాల శ్రేష్టగుణములు


పసుపు ముఖావికిస్తుంది అందాల ఆహ్లాదాలను


గోరింట : రంగురూపాలను అధిక కాంతివంతం చేస్తుంది


తులసి · చర్మంపైన మరకలను నిర్మూలిస్తుంది


చందనం : అరిష చర్మాలకు అందాల నిస్తుంది


పద్మకము. చర్మ రోగాలను నిర్మూలించి జీవాణువులను నాశనం చేస్తుంది


★కొబ్బరిమాని చర్మ కోమలత్వాన్నిచ్చి సహజ సౌందర్యాన్నందిస్తుంది


★వేపమాని జీవాణువులను నష్టపరచి చర్మరోగాలను నిర్మూలించేందుకు దోహదాన్నిస్తుంది.
★సబ్బులో మాత్రమే




## హిమానీ గోల్డ్ టర్మరిక్ క్రీమ్ మరియు సబ్బు

ప్రతీ స్త్రీ సౌందర్య అందాలు స్వప్న సౌందర్య భ్రాంతులు

HG/2 TEL (R)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు · (1938-1972)

24-30 ఏప్రిల్, '87

శ్రీ ప్రభవ నామ సం చైత్ర బ ఏకాదశి

సంపుటము 79 : సంచిక 34

ముఖ్య సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు :

మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు 2 75 |
| పోస్టులో 6నెలల చందా | రు 80 60 |
| పోస్టులో 12నెలల చందా | రు 161 20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నటి భానుప్రియ

(ఫొటో ఈశ్వరి)

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :






## ముఖచిత్రం

27 మార్చి – 2 ఏప్రిల్, '87 ఆంధ్రసచిత్ర వారపత్రిక ఖుష్బూ ముఖచిత్రం అత్యంత ఆకర్షణీయంగా ఉంది – ఇనుగంటి శ్రీను, బొబ్బిలి

★ ★ ★

ముఖచిత్రం ఖుష్బూ చాల ఆకర్షణీయంగా వున్నది – నక్క రామకృష్ణ, కొండపల్లి

## సీరియల్స్

'మీరు వేయిపడగలు నవలని సీరియల్‌గా ప్రచురించ దలచినందుకు అభినందనలు నేడు ఎంతో విలువైన ఈ నవలను పాఠకు లందరకు అందిస్తున్నందుకు మేము ఆనందిస్తున్నాము

– కె మిత్రవింద, రమ, రామచంద్రాపురం

★ ★ ★

విశ్వనాథ వారి "వేయిపడగలు" సీరియల్‌గా ప్రచురించు తున్నందులకు చాలా కృతజ్ఞతలు మరియు సంతోషము

– కె భాస్కరరావు, విశాఖపట్నం

★ ★ ★

ఒడిలో చెలి మోహనరాగం సీరియల్ ముగింపు చాలా బాగుంది ప్రతిస్పందన సీరియల్ మమ్మల్ని చాలా బాగా ఆకట్టుకుంటోంది

– జి రాజేశ్వరి, గోదావరి

★ ★ ★

ప్రతిస్పందన' సీరియల్ మధురముగా ఉంది ప్రత్యూషపవనాలు సీరియల్ ప్రారంభములోనే మమ్మల్ని ఆకట్టుకుంది

– కె లక్ష్మి, శృంగవరపుకోట

★ ★ ★

శ్రీమతి జి భవానీ కృష్ణమూర్తి గారి ప్రత్యూష పవనాలు సీరియల్ ప్రారంభం బాగుంది

– కె జగన్నాధసింగ్, సుధారాణిరతో, ఇచ్ఛాపురం

★ ★ ★

ప్రత్యూష పవనాలు – టైటిల్‌తోనే సరికొత్తదనంతో వెరైటీగా ప్రారంభమైన జి భవానీకృష్ణమూర్తిగారి సీరియల్ ఆసక్తి పవనాలు మమ్మల్ని వెంటాడాయి ప్రతిస్పందన, రాగలత సీరియల్స్ ఊహించని మలుపులతో ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి

– హేమసుందర్‌రావు, ప్రియబిందు, ఉమామనోహరి, దోర్నకల్

★ ★ ★

ఆంధ్రసచిత్ర వారపత్రికలో సీరియల్స్ అన్నీ ఒకదాని కొకటి పోటీ పడుతూ మాకెంతో అహ్లాదాన్ని, ఆనందాన్ని కలిగిస్తున్నాయి వెరైటీ సీరియల్ ప్రతిస్పందన అద్భుతంగా వుంది అన్నపూర్ణ గారికి ప్రత్యేక అభినందనలు!

– బందిగి బాలరాజు, ప్రేమకుమార్, మహబూబ్‌నగర్

★ ★ ★

క్రొత్త సీరియల్ ప్రత్యూష పవనాలు' మమ్ములను ఆదిలోనే ఆకట్టుకుంది

– పి అరుణ, కాకినాడ

★ ★ ★

అన్నపూర్ణ గారి ప్రతిస్పందన' సీరియల్ ఆసక్తికరంగా సాగుతోంది రవికిరణ్, సౌందర్య పాత్రల చిత్రణ అత్యద్భుతం సీరియల్ చదువు తున్నంతసేపూ మా హృదయాలు ప్రతిస్పందిస్తున్నాయి

– ఇందిరా రమేష్, బొబ్బిలి

## వ్యక్తిగతం

'వ్యక్తిగతం' శీర్షికలో మీరు శ్రీ వెంకటేశ్వరన్‌గారిని గురించి ప్రచురించిన విషయం చాలా బాగుంది కాని మనకు సంబంధించిన ఒక విషయాన్ని మీరు మరిచారు అదేమిటంటే శ్రీ వెంకటేశ్వరన్ ఐ సి ఎస్ ఆఫీసరుగా ఉండిన శ్రీ ఏ ఎస్ పి అయ్యర్ కుమారుడు శ్రీ ఏ ఎస్ పి అయ్యర్ మహా విద్వాంసుడు ఆంధ్రదేశంలో కలెక్టరుగాను, జిల్లా జడ్జిగాను ఉన్నారు చాలా సందర్భాలలో న్యాయం కోసం పై బ్రిటిషు అధికారులను, ప్రభుత్వాన్ని ఎదిరించిన ధైర్యశాలి వివిధ విషయాలపై పెక్కు గ్రంథాలు రచించిన మహామేధావి

అటువంటి గొప్పవ్యక్తి కుమారుడు శ్రీ వెంకటేశ్వరన్ తండ్రికీ, తనకూ తగినట్లుగా అవమానాన్ని సహించక రాజీనామా చేశారు

–తిరుమల శేషశాయి, తిరుచ్చిరాపల్లి

## కథలు

ఈ వారం కథల్లో నిజమైన దీపావళి నిజంగా మంచి కథ తమ కోరికల కొండవీటి చేంతాడుతో అత్తమామల కుత్తుకలకు ఉరి బిగించే మనోహర్ లాంటి మహానుభావులు ఎందరో వున్నారు నేటి సమాజంలో ఇట్లాంటి మానవాధములను సంస్కరించటానికి నీతిబోధలు ఎంత మాత్రమూ సహకరించవు వీరిని దారిలోకి తేవటానికి దండన తప్ప మరో మార్గం లేదు భర్తను కొట్టడం భార్యకు తప్పయినా, ఈ కథలో మల్లిక తీసుకున్న నిర్ణయాన్ని మహిళా లోకమంతా సమర్థించ గలగాలి అప్పుడే మనోహర్ వంటి పురుష పుంగవులలో మార్పు కలిగి మల్లిక" వంటి వారి బ్రతుకులలో మల్లెలు విరుస్తాయి

– పక్కలంక రామారావు, మానేపల్లి

★ ★ ★

నటి ఖుష్బూ ముఖచిత్ర పత్రికలో "మైడియర్ ట్వింకిల్' కథ బాగుంది "ఈ సమాజం ఏం చేస్తోందీ కథ కడు ఆలోచించేదిగా వున్నది

– కాజ హనిత, ఏలూరు

( 70 వ పేజి చూడండి)

## నిత్య నూతన సీరియల్

### కవిసమ్రాట్

# విశ్వనాథ సత్యనారాయణ

# వేయిపడగలు

(గత సంచిక తరువాయి)

ఆ నాడు ధర్మారావు కన్ను తెరచెను అతని కప్పటికి పదు నారేండ్లు తండ్రి చనిపోవుట తనకు లాభమో, నష్టమో, అతనికి తెలియలేదు సంస్కారము జరుగవలసి యున్నది కాలు కదిపినచో ధనముతో పని, తల్లి యీ సంగతి విచారించకుండ భర్తృశవముపైబడి రోదించుచునే యున్నది వచ్చిన బంధువులు శుష్కప్రియులు", శూన్యహస్తములు నని- వివార ముఖములుగాక యింకొక భావము లేనివారుగా నుండిరి పసివాడయినను సర్వ విషయములు తెలిసిన ధర్మారావునకు ముందు చూచిన నూయియు, వెనుక జూచిన గోయియుగా నున్నది

కొంచెము ప్రొద్దెక్కినది ఈ నిరాధార స్థితిలో ధర్మారావునకు బట్టుగొయ్య యొకడు దొరికెను

శాస్త్రిగారి మరణ వార్త కృష్ణమ నాయనికి దెలిసెను ఆ ముసలివాడు కూర్చున్నవాడు కూర్చున్నట్టు క్రుంగి పోయెను ఒక్కసారిగా నాయనకు శాస్త్రిగారి యుచ్చ దినములు, ఆయన మహావ్యక్తిత్వము, అతని యౌదార్యము గోచరించెను జమీందారు బయలుదేరి శాస్త్రిగారింటికి వచ్చెను శాస్త్రిగారి శవము జూచి సమాదరించి, కొంతసేపయిన తరువాత కర్మ జరుగుటకు ప్రయత్నములు చేయరేమని బంధువులను మందలించెను వారును భారము తమమీద లేదని తెలిసికొని నంతనే సర్వకార్యములు నిర్వర్తించుటకు ముందంజ వేసిరి

దారిద్ర్యము శాస్త్రిగారితోనే పోయినట్లయ్యెను దేవిడీలో నుండి బియ్యము, పప్పు, ఉప్పు మొదలుగా సర్వ సంభారములు వచ్చెను నాయడు రెండు వందలరూపాయలు కూడ పంపించెను ధర్మారావు మేనమామయు, మామగారు అయిన గంగాధర సోమయాజులుగారు పెత్తనము వహించిరి

సోమయాజులుగారు ఆత్మగుణముల కన్న చత్వారింశత్సంస్కారములకే యెక్కువ ప్రాధాన్యమిచ్చెడివాడు, దయాదాక్షిణ్యములకు, ఆయనకు మిక్కిలి దూరము కర్మ యథావిధిగ జరుగ వలయుననుటలో మొదటివాడు అందుచేత సర్వసమృద్ధి గల శాస్త్రిగారి యింట సోమయాజులు గారి యాజమాన్యము క్రింద అపర కర్మ సుష్ఠుగా జరిగెను పదునొకండు పదిరెండు దినములలో శాస్త్రిగారి కర్మ స్వయముగా జరిపించిరి గోదానము, వృషోత్సర్జనము, షోడశదానములు, బ్రాహ్మణ సంతర్పణము, సంభావనయు జమీందారుగారి దయవలన లోపము లేకుండ జరిగిపోయెను కడుపునిండ తిని గబ్బున త్రేచిన బ్రాహ్మణులు అయనకేమి! మహారాజు! చివరి రోజులలో నేదో కొంచెము లోపము జరిగెనే గాని, యాయనకేమి! బ్రతికినప్పుడు మహారాజే చచ్చియు మహారాజే!" యని దీవించిరి

ధర్మారావు బంధువు లీ పదుమూడు దినములు జమీందారు పంపించిన సంభారములు విచ్చలవిడిగా తిని ఖర్చుపెట్టిరి తిననంత తినిరి పారవేసినంత పారవేసిరి దేనికిపడిన దానికి సామగ్రి యథేచ్ఛముగా వాడిరి కర్మకుదెచ్చిన వస్తువులు మిగులరాదని కాబోలు బంధువులయిన కొందరు



ముసలమ్మలు కొంత సామగ్రి తమ యింటికి చాటుగా వప్పించుకొని పోయిరి కర్మలో మునిగియున్న ధర్మారావుగాని దుఃఖములో మునిగియున్న అతని తల్లిగాని యీ సంగతి గుర్తించలేదు. ధర్మారాయని అప్పగార్లు కూడ తల్లి వెంటనే యుండిరి

పదుమూడవనా డెవరిదారిని వారు పోయిరి

# వేయిపడగలు

సావిత్రమ్మ గారింటిలో జూచుకొనెను. మిగిలిన బియ్యము పదిరోజులకు వచ్చును. నెయ్యి మొదలైన వేమియు లేవు. చివరి దినములలో కష్టము లనుభవించినను శాస్త్రిగారి కర్మ సరిగా జరిగి పోయినది. ఆ యదృష్టముగూడ నాయనదే. దురదృష్టవంతులు మిగిలిరి. బంధువు లెవరి దారిని వారు పోయినను ధర్మారావు అప్పగార్లిద్దరు, వారి పిల్లలు, బావమరదులు వెళ్ళలేదు. వారు తల్లి నోదార్చుటకు నిందే యుండిరి. తండ్రియాస్తి కొడుకునకు సంక్రమించుట న్యాయమే గనుక, ఆయన యాస్తి దారిద్ర్యమే గనుక నది ధర్మారావునకు వెంటనే సంక్రమించెను.

ధర్మారావు పడుచున్న యిబ్బందు లన్నియు ప్రతినిమేషము సువ్యక్త మగుచున్నను, అతని బావమరదులు గృహమునుండి నిష్క్రమించరు. రోజురోజిల్లు రామేశ్వరశాస్త్రిగారాస్తి పాడు చేసిరని సణుగుచుందురు. ఆ దోషమంతయు ధర్మారావుదే యన్నట్లతనిని నిందించుచుందురు. ఇంట తమకు సరిగా జరుగుటలేదని కూడ తగవులాడుచుందురు.

ధర్మారావు పెద్దక్కగారి పేరు హైమవతి. రెండవయామె పేరు నాంచారమ్మ. పెద్దబావగారి పేరు సూర్యనారాయణ. రెండవయాయన రాజేశ్వరుడు. పెద్దబావగారికి ముగ్గురు కూతుండ్రు. రెండవ యాయన కొక కుమారుడు. పెద్దాయన యన్న వస్త్రములు గలవాడు. అందుకని యింటిలో అల్లరియు ఆయనది. పైగా ఆయన మొనకసురు మనిసి.

ఒకనాడు కూరలేదని సూర్యనారాయణగారు "అములుధూములు" చేయుచుండగా ధర్మారావు నకు పట్టరానంత కోపము వచ్చి "ఏమిటి?ఎవరి అమ్మ మగని సొమ్మో యిచట నున్నట్లు పగులబడి పోయెదరు! తిండి లేక మా నాయనగారు "నానా యిబ్బందులు" పడుచుండగా తిరిగి చూచిన దిక్కులేదు. వీరందరు నిపుడు వచ్చి నా నెత్తిన ఎక్కిరి. వీరికెక్కడ నుండి తెచ్చి పెట్టవలె"నని రుంజుకొనెను. "తిండిలేని వెధవకింత యదురు పాటు ఏల?" యని యాయన విదలించెను."ఏ వెధవయు నాకు బెట్టలే"దని ధర్మారావనెను. దానితో సూర్యనారాయణ నిప్పులు త్రొక్కిన కోతియయి, నిలువెల్ల మండిపోయి, చచ్చినవారిని బ్రతికియున్న వారిని వందలు తిట్టి యా సాయంతనము పిల్లలతో సుబ్బన్నపేట వదలి వెళ్లెను.

రేపు త్రైపక్షికము పెట్టవలయును. అంతవరకు పినతండ్రి కొడుకుల వద్దను, నచ్చుటచ్చుటను బదులు తెచ్చిన వస్తువులతో నిల్లు గడచెను. తరువాత దమ్మిడీ పుట్టలేదు. త్రైపక్షిక మెట్లు జరుగునో ధర్మారావునకు తోచినదికాదు. కర్మకు పంపించినదేమో తప్ప జమీందారుగారు మరల మాటాడలేదు. ఋణదాతలు తండ్రిని వదలి కొడుకును పట్టిరి.

ధర్మారావు మరల జమీంధారును చూడవలె ననుకొనెను. అతనికి పదుమూడేండ్లు వచ్చు వరకు మహారాజావలె పెరిగెను. చిన్నప్పటి నుండి తాను ధనవంతుడ నను నూహతోనే పెరిగెను. తండ్రి స్వాతంత్ర్యము, గౌరవము, ఉదారత, వితరణము, కోపము, అహంకారము, సర్వ గుణములు, ధర్మారావులో నచ్చు గ్రుద్దినట్లు ప్రతిబింబించెను. ఒకరిని పోయి నోరు విడచి యడుగలేదు. ఇప్పటి తన యసమర్థత తలచుకొని తన్ను దానే నిందించు కొనును. ఇంట నవిలే వివిలే వను తల్లిమీద ఆగ్రహపడును.

చివరకు ప్రాణములు త్రెంచుకొని యానాడు సాయంవేళ జమీందారుగారి దర్శనము చేయుటకు వెళ్లెను. కోటలోనికి పోయినంతనే ముందుగల పెద్ద హాలులో రంగారావుగారు పెద్ద సోఫా మీద కూర్చుండియుండెను. ఆయన ధర్మారావును చూచినంతనే మొగము గంటు పెట్టుకొని మొగ మతనినుండి వేరు దిక్కునకు త్రిప్పెను. ధర్మారావునకు కొరడాతో చర్రున అంటించి నట్లయ్యెను. వెంటనే వెనుకకు దిరిగిపో బుద్ధి పుట్టెను.

కాని యింటికి పోయియేమి చేయును? ధనవంతులు తమ పిల్లలను చాల చెడ్డగా పెంచెదరు. చిన్నప్పుడు ధర్మారావు నెవరైనను "దరిద్రుడా!" యని తిట్టినచో నతడా పూట అన్నమే తినెడివాడు కాడు. అంత యాగర్భ శ్రీమంతుని బిడ్డ యట్టి మాట పడునా? రామేశ్వర శాస్త్రిగారికీ మాత్రమూహ యున్నచో ధర్మారావున కంతమిథ్యా గౌరవము ప్రబలెడిదికాదు. వారి సంపద చెడక పోయినచో అట్లు పెరుగుటవలన నష్టము గనబడెడిది గాదు. కాని యోడలు బండ్లై యసంభవమైనది సంభవమయ్యెను.

ధర్మారా వట్లే యచట నొకటి రెండు గడియలు నిలువబడి యుండెను. అతని నేపనిమీద వచ్చితి వని యడిగినవారు లేరు. ఇంతలో నతని యదృష్టము వలన గృష్ణమ నాయుడుగా రచటికేదో పనిమీద వచ్చెను. ధర్మారా వాయన కెదురుగా పోయెను. నాయుడు ధర్మారావునేమి పనిమీద వచ్చితి వని ప్రశ్నించెను. ఏమి పనిమీద వచ్చును! జమీందారునకు తెలియదా? ధనవంతులకు పేదవారి సంగతు లన్నియు తెలియును, కాని తెలియవు. ధర్మారావేమియు మాట్లాడలేదు. మరల కొంత యాగి నాయుడు "పని యేమిటి" అని అడిగెను. ధర్మారావు సగము చచ్చి "రేపు నాయనగారి మాసికము" అనెను. నాయుడు గుమాస్తాను బిలిచి ధర్మారావునకు బదిరూపాయ లిమ్మని చెప్పి తాను చనెను. రంగారావుగారిదియంతయు వినుచునే యూరకుండెను. గుమాస్తా పది రూపాయలు తెచ్చి యీబోగా రంగారావుగారు "ఏమయ్యా! మాసికానికి పదిరూపాయల ఖర్చున్నదా" యనెను. గుమస్తా "అక్కఱ లేదండీ!" యని జవాబు చెప్పెను. ధర్మారావు చేతిలోనికి చివరకు వచ్చినది యాఱు రూపాయలు. అవి కూడ పుచ్చుకొనకుండ పోవలెనని ధర్మారావు అనుకొనెను తానైన మాడును. తండ్రి మాసికము చెడిపోవును. కొడుకై పుట్టినందుకు తా నిదా తండ్రికి చేసిన ఉపకారము! తన అభిమానము నష్టమైనను తండ్రి కర్మకు లోపము జరుగరాదని ఆఱు రూపాయలు గ్రహించి గంటకు ముందు వచ్చిన తనలో తాను సగమై యింటికి నడచెను.

త్రైపక్షికము గడిచినది. మాసికము గడచినది. ఇల్లు గడచుటలేదు. ఋణబాధ ఎక్కువైనది. తెగబడి యేమి చేయుటకును చిన్నతనము. ఒకనాడు కూర్చుండి వలపోసి, వలపోసి ధర్మారావు తన కథ యంతయు నొక పెద్ద యుత్తరము వ్రాసి కృష్ణమనాయనికి బంపించెను.

"మహారాజశ్రీ మన్నె సుల్తాన్ సుబ్బన్నపేట పరగణా జమీందారులు, 'మహా ప్రభువులు, కృష్ణమనాయనింగారు జమీందారుగారి సముఖమునకు రామేశ్వరశాస్త్రిగారి కుమారుడు ధర్మారావు వ్రాసికొన్న విన్నపములు.

అయ్యా!

మా నాయనగారికిని తమకును గల స్నేహము, ప్రేమయు బ్రత్యక్షముగా గాకపోయినను కథారూపముగా నైన నేను వినియుండుటచే మాయందు మీకు బక్షపాతము తప్పక యుండునని తలచి యిది వ్రాయుచుంటిని. మా నాయనగారు

**జరిగిన కథ–2.** సుబ్బన్న పేటలో ఒక యువతి వేయి పడగల పాము విప్పారుకొనివచ్చి కాటందు కున్నది కలలోన రాజును' అని పాడుకుంటూ వీథిలో తిరుగుతూ ఉంటుంది. ఆమెను గురించి నలుగురూ నాలుగు విధాలుగా అనుకుంటారు. ఆమె గణాచారి. సుమారు మూడువందల ఏళ్ల క్రిందట ఒకకాపు యొక్క ఆవు ప్రతిరోజూ అడవిలో ఒకపెద్ద పాముకు పాలు ఇస్తూ ఉండేదిట. ఒకనాడు అదృశ్యాన్ని కాపు చూస్తాడు. ఆ రాత్రి కాపునకు సుబ్రహ్మణ్యేశ్వర స్వామి కలలో కనపడి తనకు గుడి కట్టించమని చెబుతాడు. ఆవిధంగా అక్కడ గుడితో పాటు కోట కూడా నిర్మాణం అవుతుంది. కాపు కూతురు గణాచారి అవుతుంది. బ్రాహ్మణుడు వీరన్న ఊరిని నిర్మిస్తారు. ఆవూరికి సుబ్బన్న పేటని పేరు వస్తుంది. తరాలు మారినా ఆచారం మారలేదు. ఇప్పటి గణాచారి ఒక చెట్టు నీడన నుంచుంటుంది. అప్పుడే అక్కడకు వస్తున్న ఒక యువకుని చూచి గణాచారి వికృతంగా నవ్వుతూ పాట పాడుతూ ఎదురుగా పరిగెత్తుతుంది. ఆ యువకుని పేరు ధర్మారావు. ఇప్పటికి ఐదవతరం వాడయిన రామేశ్వర శాస్త్రికి ఏకైక కుమారుడు ధర్మారావు. రామేశ్వర శాస్త్రికి జమీందారు కృష్ణమనాయనికి మంచి స్నేహము. శాస్త్రి గారు అడిగిన వారికి కాదనకుండా ఇచ్చేవాడు. క్రమంగా ఆస్తి తరిగి ఇల్లు గడవడం కూడా కష్టమై పోతుంది. ముసలి జమీందారు పెత్తనం అంతా కొడుకు రంగారావునకు అప్పగిస్తాడు. దరిద్రంతో బాధ పడుతున్న రామేశ్వర శాస్త్రిగారు. నాగేశ్వర స్వామి ఆలయానికి వెళ్లి అక్కడ మండపంలో తుది శ్వాస విడుస్తాడు.

# ప్రముఖుల సందేశాలు



"వేయిపడగలు" సీరియల్‌గా ప్రచురించడం చాలా మంచి ప్రయత్నం. ఆ ప్రచురణతో బాటు– నాదో చిన్న సలహా! శ్రీ విశ్వనాథ వారికి సన్నిహితులుగా వున్న వారి (ఆయన గారితో పని చేసిన వారు, ఆయన శిష్యులు, లేదా వారి బంధువులు) చేతగాని, ప్రతి సంచికలో ఒక చిన్న ఆసక్తికరమైన సంఘటనని ఆయన జీవిత విశేషాల్లోంచి– ప్రచురిస్తే చాలా బాగా వుంటుంది. ఎప్పుడో కొన్ని సంవత్సరాల క్రితం శ్రీ వేటూరి సుందర రామ్మూర్తి గారు కూడా మాటల సందర్భంలో శ్రీ విశ్వనాథ వారి చమత్కారం– మాట దురుసు గురించి చెబుతూ వుండేవారు...

– కె. విశ్వనాథ్, మదరాసు

★ ★ ★



కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి 'వేయిపడగలు" తమ పత్రికలో సీరియల్‌గా రాబోతున్నందుకు నా ఆనందాన్ని తెలుపుకుంటున్నాను.

శ్రీ విశ్వనాథ గారు యగపురుషులు. పుంభావ భారతి వారి "వేయి పడగలు" ఆలోచనామృతము. చదివిన కొద్దీ తిరిగి చదవవలెననిపించును. చదివి తెలిసి కొన్నకొద్దీ యింకా తెలియును. అది యొక సుధావాహిని ప్రపంచ జ్ఞానవర్ధని. "వేయి పడగలు" వేయి సార్లు చదివిననూ యింకా చదివి గ్రహించవలసినది మిగిలియే యుండును. మరొక్కసారి చదివే సదవకాశము తమ పత్రిక ద్వారా లభించనున్నందుకు నా అభినందనములు తెలియచేయుచున్నాను.

మంగళంపల్లి బాలమురళీకృష్ణ,
మదరాసు

## వేయిపడగలు

మరణించినపుడు తమరు చేసిన సాహాయ్యమును, తమరి ఔదార్యమును నేనెన్నటికిని మరువజాలను. మా నాయనగారి యశస్సుగాని, వారి దివ్య గుణములుగాని నేనిచ్చట వ్రాసి యేమియు లాభములేదు. అది యంతయు గతజల సేతు బంధనము. అట్టి వారే వారి చివరి దినములలో నెన్నో కష్టములు పడగా నేను పడుటలో నాశ్చర్యము లేదు. ఆయన చేసిన ఋణము వలన నే నేల బాధపడ వలయునో తెలియరాదు. అవును. వారు ధనము సంపాదించి పోయినచో నేనది యనుభవించి యుండనా? అట్లే ఋణములు ననుభవించ వలయును. కాని నేను చిన్నవాడను. వారు వారనుకొనిన మాటలనుండి చూచినను, మాకు గల యాస్తికిని, అప్పునకును సరిపోవునట్లు తోచుచున్నది. ఋణదాత లొక దేటికి దీసిన నొకడు కోటికి దీయు చున్నారేగాని నన్నీ ఋణము నుండి బయటపడనిచ్చునట్లు లేదు.

ఒకవేళ బయటపడినను తరువాత బ్రతుకు తెరువేదియు గాన్పించుటలేదు. బ్రతికినన్నాళ్లు మహాసంపద ననుభవించి యీ రోజులలో నిర్దయ విధిచే కష్టజలధి ముంచబడిన మజ్జననీ దుఃఖము కనులార చూచి భరించుటకు నాది రాతి గుండెయేమో! ఈ కష్టములకు తుది యెప్పుడో!

ఈ యూరికి మీరును, మేమును పూర్వులమని చెప్పుదురు. మా పూర్వులే మిమ్ము దెచ్చి యిచట నిలిపిరని కూడ పలుకుదురు. అది ఎంతవరకు నిజమో తెలియదు. అది నిజమేయయిన యెడల మీ వంశమునకు మా వంశమునకు త్రెంచరాని బంధ మొకటు కలదు. అందుచేత నయినను మీరు నాయందు దయ చూపించ వచ్చును.

నాకు తెలిసినంత వరకు మా పూర్వులు మిమ్ము యాచించలేదు. ఆ దుర్దశ నాకు పట్టినది. ఇది కూడ మీకు దయా హేతువు కావచ్చునని మనవి".

ఈ యుత్తరము వ్రాసి కోటలో నొక కాసావాని కిచ్చిపంపించెను. కాని నాటి రాత్రియంతయు ధర్మారావు చెప్పరానంత చిత్త సంక్షోభము పడెను. "ఛీ! వారి యంతవారు వారు, మాయంతవారము మేము. వారిని నేనేల ప్రాధేయపడవలె? రానున్న కష్టములు రాకమానవు. చచ్చినచో చత్తుము. సాటివారికడ నీ నైచ్యమున కేల చొరబడ వలయు" అని యొకసారి, "కాని రోజులలో గర్వపడరాదు. పడి యెవరిని సాధింతుము? ఒకవేళ తిండి లేక చచ్చి యేమి చేయుదుము? శరీరమున్న గదా యేదైనను చేయుట?" అని యొకసారి, "కృష్ణమనాయని యొద్ద తాను మనవి చేసికొనుట కిది మొదటి సారియా? మొన్న నాలుు రూపాయలు తేలేదా? తండ్రి కర్మకు ధన మాయన వద్ద పుచ్చుకొనలేదా?" అనియు; "తండ్రి కర్మ కాయనయే యిచ్చెను. నేను యాచించలేదు. మాసికమునకు యాచించితినా? లేదు. పోయి యూరకే చెప్పితిని. ఆయనయే యిచ్చెను" అనియు పరి పరి విధముల నాలోచించెను. చివరకెట్లయినను తాను యుత్తరము వ్రాయుట చేయరాదనియే నిర్ణయించి, తన యట్టి యుత్తరము వలన తన పూర్వుల గౌరవము పోవుననియే నిశ్చయించెను. ఎప్పుడు తెల్లవాఱునా యెప్పుడు పోయి యా కాసావాని నడిగి యా యుత్తరము తీసుకొందునా యని మిగిలిన రాత్రి గడిపెను. ఆ రాత్రియే యతడుత్తరము రాజున కిచ్చునేమో యని దిగులుపడెను.

ఈ యాలోచనా పరంపరలో కోళ్లు కూసెను. మెడలు నిక్కించి దేహములు దీర్ఘీకరించి కనులలో ధార్ష్ట్యము గోచరించగా గర్వోక్తి వోని

కూతలు కుక్కుటములు కూసెను. ఎందుకులే యింత గర్వమని తమలో దామె యవియు ననుకొన్నట్లు తిక్కలు తపతప కొట్టుకొనెను. గర్వము లహంకారములు, సుఖములు దుఃఖములు, సంపదలు లేములు -సర్వమునకు యుగములుగా సాక్షీభూతురాలు సనాతని యుషస్సు ప్రజ్వలించెను.

ధర్మారావు లేచి కాలకృత్యములు నిర్వర్తించి యా కాసావాని యింటికిబోయి "ఉత్తరమిచ్చితివా?" యని యడిగెను. వాడీయలేదనెను. ఒకసారి యిటు తెమ్మని యడిగి పుచ్చుకొని ధర్మారావది వాడు చూచుచుండగనే చింపివేసెను. కాసావాడు నివ్వెరపడెను. "ఏల యట్లు చింపివేస్తి"రని యడిగెను. ధర్మారావు "గోపా! కృష్ణమనాయడుగారు చాల యుదారులు, నిజమే. నా పూర్వులెవరు నాయనను యాచించలేదు. నేనేల యాచించ వలయును?" అనెను. గోపన్న మాట్లాడలేదు. తిరిగి యింటికి బోవు ధర్మారావు తన్ను జూచి ప్రతివారు నవ్వుచున్నా రనుకొనెను.

ఆనాడంతయు ధర్మారాయని ప్రవర్తన చిత్ర విచిత్రముగా నుండెను. తన యాపద గట్టెక్క బోయినట్లును, దానిని దానే వలదన్నట్లును, దానికి తాను చాల చింతించుచున్నట్లును, కాదు తాను చేసినది బాగుగనే యున్నదని సమాధానము చెప్పు కొనుచున్నట్లును పరిపరి విధముల తనలో దాను గుడుసుళ్లు పడుచున్నతని తల్లి చూచి కారణము తెలియక గగ్గోలుపడెను.

మఱల పది రోజులు గడచెను. ఇంటికి వచ్చును. తల్లి "నాయనా బియ్యము లేవురా!" యనును. దారిద్ర్య దేవత యతని యభిమానమును జూచి పరిహసించినట్లుండును. ఎవరినో పోయి రెండు రూక లప్పుడుగును. వారు రేపు మాపని త్రిప్పి చివరకు లేదందురు. దారిద్ర్యదేవత యతనిని జూచి వికృతహాసము చేసినట్లుండును. తల్లి యీ బాధపడలేక "తండ్రీ! పోయి జమీందారుగారి నడుగుము. ఏదైన నిచ్చునేమో!" యనును. దారిద్ర్యదేవత పకాలున పగులబడి నవ్వును. ధర్మారావునకు దన గుండెలో బెద్ద యేదువు వినబడును. అది యెవరికి వినబడలేదని తెలిసికొని సంతోషించును.

గోపన్న కలువదియేండ్లు. ముప్పదియేండ్లకు పూర్వ మొకసారి రాణిగారు స్నానము చేయుచు

గోద్రెజ్

కొత్త

# మేగా

నీలి డిటర్జెంట్ బిళ్ల
ఎఓఎస్*కల్గినది




భారతదేశపు ప్రముఖ అధికార-రక్షకురాలు రజని ఇప్పుడు ఉపయోగించేది కేవలం మేగా.

*ఎఓఎస్ – మరింత నురుగు,మరింత శుభ్రపరిచే శక్తి ఇచ్చే ఒక అద్భుత దినుసు.

# వేయిపడగలు

మెడలో చంద్రహారము స్నానపు గది గోడ వంకెకు తగిలించెను. గోపన్న దానిని బోవుచు ఆశ చేత దొంగిలించి యది సంగ్రహించెను. వస్తువు పోయినదని దాసీవాండ్రను, కాసావాండ్రను విచారించగా గోపన్న పట్టుబడెను. కృష్ణమ నాయడు గోపన్నను కోట వెడల నడచెను. వాడు వచ్చి రామేశ్వరశాస్త్రిగారిని ఆశ్రయించగా శాస్త్రిగారు వానిని మరల కోటలో ప్రవేశపెట్టిరి. వాడప్పటి నుండియు శాస్త్రిగారి యెడల కృతజ్ఞత కలిగియుండెను. అప్పుడప్పుడు శాస్త్రిగారి వద్దకు వెళ్లి కొన్ని కొన్ని మంచి సంగతులు నేర్చుకొని పోవుచుండును. మనిషి సహజముగా మంచి వాడగుటచేత క్రమముగా వానికి భక్తి ప్రపత్తులు బలిసినవి. వాడు నిత్యము రెండు దేవాలయము లకును బోయి భగవద్దర్శనము చేయును. కృష్ణమ నాయడు పెద్దవాడయిన తరువాత నాయనకు గోపన్నమీద ననురాగము మెండయ్యెను. వాడెప్పుడును పురాణకథలు, భక్తి మాటలు చెప్పుచుండును.

ఒక రోజున ముసలి జమీందారు స్నానము చేసిన తరువాత, గోపన్న ఆయనకు తిలకము దిద్దుచు, ధర్మారావుత్తరము దెచ్చుట, మరునాడు వచ్చి తానే యది చింపివేయుట, యేల చింపితిరనగా నతడు చెప్పిన సమాధానము లన్నియు జమీందారుతో జెప్పి "యింతవారి కింత యిక్కట్టు వచ్చినది! ఇంగువ కట్టిన గుడ్డ వాసన యెక్కడికి బోవును! పులి కడుపున మేక పుట్టునా! వారి వంశములో తక్కువవా డేల పుట్టును?" అని వ్యాఖ్యానము చేసెను.

జమీందారు భోజనము చేయుచుండెను. వడ్డన గోపన్న. ఆ రోజున పదార్థము లన్నియు మిక్కిలి రుచ్యములుగా నుండెను. రాజు అప్యాయముగా భోజనము చేయుచుండెను. గోపన్న జమీందారు నింగితము గ్రహించి వడ్డించుచు, మధ్య మధ్య ధర్మారాయని ప్రస్తావన చేయుచుండెను. "అవును. పాపము! రామేశ్వరశాస్త్రి గారేమి దుర్వ్యయము చేసిరా! అడుగనివానిది పాపము. అట్టిచ్చిరి. ఆయన సొమ్ము తినినవారే ఆయనకు చేదైరి. 'త్రాగిన రొమ్మే గ్రుద్దుమురా!' యన్నట్లున్నది. నాగన్న శెట్టి శాస్త్రిగారి సొమ్మెరుగడా! శ్రీరాము లసలే యెరుగడు పాపము! నేటి కందరును మొనగాండ్రయి యాయన సంసారమును కుదుట బడనీయుట లేదు".

జమీందారుగారి చేయి కడిగి, తన కట్టుబట్టతో తుడిచి వెనుక వసారాలో కుర్చీమీద జమీందారు గారు కూర్చుండగా తమలపాకు లందించుచు గోపన్న మరల సాగించెను. "తమరు ధర్మారావుగారి కేదో దారి చూపించక పోయినచో నా కుర్రాయన యేమగును? ఆయన చెడిపోవుట మనకు మాత్రము క్షేమమా? మీరు, వారు, సుబ్రహ్మణ్యేశ్వరస్వామి, గణాచారి మీరందరు నొకటేనని జనము చెప్పుకొందురు. మీలో మీకు తగాదాలు రాథాదు. ఇందులో కొందరకు చెడిపోయినచో తక్కినవారికి పొత్తు కలసి యుండునా? వారికి మీరు సాయపడుట భగవంతునకు గూడ నిష్టమైన సంగతి".

జమీందారుగారు తూగుటుయ్యేల మీద బండుకొనిరి. గోపన్న యూచుచుండెను. జమీందారు "గోపా! ధర్మయ్య చాల యందమైన వాడురా!" యనెను. గోపన్న మొదలిడెను. "అందమేమిటి బాబుగారు! ఆయన మొగము చూచినచో నిత్యమల్లెలు తిక్క విడిచి నట్లుండును. నాకు మాత్రము సుబ్రహ్మణ్యేశ్వర స్వామి యీయనగా నవతరించె ననిపించును. ఆ బక్కపలుచని మనిషి, నిగనిగలాడు శరీరము, కోసలైన కన్నులు తెలివి కొట్టవచ్చినట్లుండు మొగము! అందమనగా ఆయనదే అందము. ఏమయిన నేమి? సముద్రాలిండిపోయి చెఱువు లయినట్లు నేటికి పరిస్థితి యిట్లు వచ్చినది. ఒకరికి పెట్టినవారేగాని లేదన్నవారే కాదు."

అది మాఘమాసము. నాగన్న శెట్టి కుమారుని పెండ్లి తలపెట్టెను. 'సన్యాసివాని పెండ్లికి జుట్టువద్ద నుంచి యెరువే' యన్నట్లు నెల జీతము వాడును, వర్తకుడును సర్వము భూస్వామి నుండియే తెచ్చుకొనవలయును. పెండ్లి పందిరికి తాటియాకులు, ఊరేగుటకు ఏనుగు, ఇంకనెన్నో శెట్టి జమీందారుగారి నడిగి తెచ్చుకోవలసి వచ్చెను. దశమినాడు పెండ్లి. విదియనాడు శెట్టి ప్రభువు వద్దకు జనెను. సాయంతనము ప్రొద్దు వాటారిన వేళ కృష్ణమనాయడు లొట్టిపిట్టలను, నేనుగులను తనిఖీ చూచుచుండెను. శెట్టి వెళ్లి నమస్కరించి నాయడు తన్నేమి పనిమీద వచ్చితివని యడుగునేమో యని ఎదురు చూచుచుండెను. నాయడు "శెట్టిగారూ! చూచితిరా ఈ లొట్టిపిట్టలు! నాకెన్నాళ్లు చూచినను వింతగా నుండును. మృగములలో నివియును. పురుగులలో గడ్డి పురుగులును విచిత్రమైన సృష్టి. తలకు మొండెమునకు సంబంధము లేని జంతువులు. భూమికి మొండెమునకు సంబంధము లేనట్లు పొడుగైన కాళ్లు. మొండెమునకు, తలకు సంబంధము లేనట్లు పొడుగైన మెడ".

శెట్టి - చిత్తము, చిత్తము

ప్రభు వేమన్నాడో శెట్టికి తెలియలేదు. శెట్టికి నధిక మాసములు, తిరుగు వడ్డీలు, తిథిద్వయాలు తెలిసినంత యింక మఱేమియు దెలియవు. నాయని మనసులో నున్న సౌకుమార్యము సెట్టికి కొన్ని తరములుగా లేనిది యెచటనుండి వచ్చును? అందుకని "చిత్తము"తో సరిపెట్టెను.

నాయడు :- రామేశ్వరశాస్త్రిగారు నీకెంత బాకీ అయ్యా!

శెట్టి :- పాతిక వేలండి.

నాయడు :- వారి యిల్లు, దొడ్లు వెల యెంత చేయును?

శెట్టి :- చిత్తము, చిత్తము.

నాయడు :- శాస్త్రిగారికి మిగతా బాకీ లేమాత్రముండును?

శెట్టి :- ఇంకొక పాతిక వేలయిన నుండునండి.

నాయడు :- సరేగాని తక్కిన వారందరిను రేపు నా దగ్గరకు తీసికొనిరా. ఏదో విధముగా తీర్మానము చేయవలె. పాప మాకుఱ్ఱాయన చాలా బాధపడు చున్నాడు.

శెట్టి :- చిత్తము. చిత్తము.

జమీందారుగారు కొంత సేపు గుఱ్ఱాలసాల దగ్గర గూడ నిలుచుండి యంతఃపురము లోనికి ద్రోవదీసెను. ఇంక దొర మరల బయటకు రాడని శెట్టికి దెలియును. అందుచేత చేతులు నలుపు కొనుచు "తమతో పనియుండి వచ్చితి" నని మనవి చేసెను. రేపు వారిని దీసుకొని రండి. తరువాత బనియేమో చూడవచ్చు"ననెను. శెట్టికి కృష్ణమనాయని తత్త్వము బాగుగా దెలియును. ఆయన పట్టినపట్టు నెట్టినగాని వేఱే పని యాయనచేత చేయించరాదు. తన కుమారుని పెండ్లికి ఏనుగు మీద ఊరేగింపు తప్పకుండ జరుగవలెనని యింట నందరికి పట్టింపుగానున్నది. ఈ పని చేయకుండ రాజెట్లును ఏనుగునీయడు. పైగా బాధపెట్టినందు వలన శాస్త్రిగారి యాస్తి నుండి ఎక్కువ వచ్చునదియు నేమియు లేదు. అందుచేత నా మరునాడు తక్కిన ఋణదాతల నందరను పిలుచుకొని నాయని వద్దకు జనెను. తక్కినవారును నెక్కువ యప్పుపెట్టిన శెట్టియే యొప్పుకొనగా దమకేమనియు, జమీందారునకు గోపము రావచ్చుననియు నొప్పుకొనిరి.

(ఇంకా ఉంది)



కబీరు భావాలు :

ఆరుద్ర బట్వాడా





# మతాలూ – అభిమతాలూ

ఆదిలో ఆదాము యెరుగడు
హవ్వ వచ్చిన దేడనుండో
అపుడు హిందువు తురకలుండిరా?
అపుడు కులములు జాతులెంచిరా?

సర్వజనులను సమానముగా
ఉర్విలో పుట్టించు చుండెడి
సృష్టికర్తకు పక్షపాతము
సుంతకూడా లేదుకదరా

కర్రియావును కపిల గోవును
కడమ పసులను పిదికి చూడుము
పసులవన్నెలు భిన్నమైనా
పాలవర్ణము తేట తెల్లన

తురక మతమున పెరిగియుంటిని
మరియు హిందూజనుల నెరిగితి
వీరికైనను వారికైనను
కోరికల రుచి చాల తీయన

అన్ని రకముల వారివలె ఒక
అమ్మ కడుపునె పుట్టి కూడా
అగ్ర వర్ణము వాడినంటూ
ఎడిసి పడతావెందుకయ్యా

తురక మతమున పుట్టినందున
తురకడేయని చాటుకొనుటకు
కడుపులో నే శిశువు 'ఖత్నా
వడుగు' జరిగి జనించరాదా?

హిందూస్త్రీలకు జందె మేయరు
తురక స్త్రీలకు ఖత్న చేయరు
చానయే సంగోరు తనువని
సగమువలె మగవారు మెలగరు

కడుపు నిలచీ, నెలలు నిండీ
కనును నొప్పుల పిదప బిడ్డను
అధికుడవు నీవైనచో మరి
అన్య విధముగ పుట్టరాదా?

జిహ్వ చాపల్యమ్ము చేతను
జీవహింసకు దిగును మతములు
నరికి చంపెదరొకరు ప్రాణిని
పరపరా కోసెరు కొందరు

జనులు వానెడు పొట్టకోసము
జంతు జాలము గొంతుకోసిన
స్వర్గమేగతి దొరకు వారికి
సంశయించు కబీరుదాసుడు

— ఆరుద్ర



# పశు పోషణ లోనూ ఘనుడే శ్రీ చెరుకువాడ



పాలపళ్ల ఇంగ్లీషు పెయ్యతో శ్రీ చెరుకువాడ వెంకటరత్నం గారు

ఒక్కొక్కరు కొన్ని రంగాలలో సాటిలేని కీర్తి ప్రతిష్ఠలను నార్జించుకొని చరిత్ర పుటల్లో చిరస్థాయిగా నిలిచి మానవాళికి మార్గదర్శకులౌతారు. అటువంటి కోవకు చెందినవారు చెరుకువాడ వెంకటరత్నంగారు

తూర్పుగోదావరి జిల్లా, పిఠాపురం తాలూకా, పెదకొండెవరం వాస్తవ్యులు శ్రీ గోటేటి జోగిరాజు పంతులు- బాపనమ్మ దంపతులకు వెంకటరత్నం గారు అభిమాన పుత్రులు ఆయన రైతు కుటుంబంలో పుట్టి పెరిగినందున బాల్యం నుంచి పశువులంటే మక్కువ ఒంగోలు ఆబోతులు, ఆవులు, ముర్రా జాతి గేదెలు, విత్సం పోతులను పోషిస్తూ వుండేవారు రెండు పర్యాయములు సంపర నియోజక వర్గమునకు కాంగ్రెస్ తరఫున యం. యల్. ఎ గా ఎన్నికయి ప్రజా రంజకముగా పదవి నిర్వహించి ప్రఖ్యాతి గాంచిరి

తిరుమల తిరుపతి దేవస్థానం ట్రస్టుబోర్డు మాజీ సభ్యులు. వీరి దినచర్య వ్యవసాయం రంగంలోను. పశుపోషణ లోనూ పేరు ప్రఖ్యాతు లార్జించారు. ప్రస్తుతం ఇంగ్లీషు పశువుల్ని పోషిస్తున్నారు. ఒంగోలు జాతి పశు సంతతిని పెంపొందింప చేయాలనే తలంపుతో ఉన్నారు.

గాంధీ మార్గములో ఒకే సిద్ధాంతముపై రాజకీయ రంగమున మకుటం లేని మహారాజుగా సంపర నియోజక వర్గములోనూ, రాష్ట్రములోనూ శ్రీ వెంకటరత్నం గారు ఒక ప్రత్యేక స్థానం నార్జించుకున్నారు. ఆయనను అనుసరించిన నేటి రాజకీయ కల్మషం ఉండదు. సాహిత్య ప్రియులు. సాహిత్య సభలకు పాల్గొంటూ, కవులకు సత్కారాలు జరిపించడం. గ్రంధాలను ముద్రించటానికి కవులకు విరాళాలు యిస్తూ ఆనందంగా రోజులను వెళ్ళబుచ్చుతున్నారు శ్రీ వెంకటరత్నంగారు.

–బొజ్జా సత్యనారాయణ







అంతర్జాతీయ స్థాయి గల పత్రికలలో ప్రముఖ స్థానాలలో కొందరు ...్త్రీలు ఉన్నప్పటికీ అత్యున్నత స్థానంలో మాత్రం ఎవరూ లేరు ఈ అపూర్వమైన స్థానం దక్కింది కాథరిన్ ఫానింగ్ కి మాత్రమే ...మె 'ది క్రిస్టియన్ సైన్స్ మానిటర్' అనే ...తిష్ఠాత్మకమైన అంతర్జాతీయ వార్తా పత్రికకు ...ధాన సంపాదకురాలుగా ఉన్నారు ఆ పత్రికకు ...పంచ వ్యాప్తంగా 12 సమాచార కేంద్రా ...ఉన్నాయి ఒక లక్షా అరవై వేల ప్రతులు అచ్చవు ...తున్నాయి కాథరిన్ మసాచుసెట్స్‌లో ఇంగ్లీషు ...సాహిత్యంలో పట్టా పుచ్చుకుంది అలాస్కాలో చిన్న పత్రికలో గుమస్తాగా పని చేయడం ...మొదలెట్టింది క్రమంగా రచనలో ప్రవేశించి ... పత్రికలో రిపోర్టింగ్ శాఖకు ఎదిగింది ఆ తర్వాత ...ఫానింగ్‌ను పెళ్ళి చేసుకుంది వాళ్ళిద్దరూ 'ది ...ఏంకరేజ్ డెయిలీ న్యూస్' అనే పత్రికను కొని దాన్ని ...అభివృద్ధి చేయడానికి అష్టకష్టాలు పడ్డారు ...971లో లారీ ఫానింగ్ చనిపోయాక పత్రిక పూర్తి ...బాధ్యత కాథరిన్ మీదనే పడింది 1976లో ఆ ...పత్రికకు పులిట్జర్ జర్నలిజం బహుమతి లభించింది ...కాథరిన్ క్రిస్టియన్ సైన్స్ మానిటర్‌లో చేరే ...సమయానికి ఆ పత్రిక అలాస్కాలో పెద్ద పత్రికగా ...మారి పోయింది .. □



ప్రపంచంలోని ఒక ...ప్రముఖ మతానికి రెండు ...సంవత్సరాల శిశువు గురువు ...కానున్నాడు. చిన్నారి వయ...సులో బౌద్ధ లామాగా ...మారనున్న ఈ శిశువు పేరు ...ఒసెల్ టొరెస్. మేరియా, ...పకో టొరెస్ లకు 1985 ...మార్చిలో జన్మించిన ఒసె...ల్ ...గా 1984 లో మరణించిన లామా యెషె ...పునర్జన్మించాడని యెషె అను చరులు, ఒసెల్ ...తల్లి దండ్రులు నమ్ముతున్నారు లామా యెషె ...సన్నిహిత అనుచరుడు లామా రినపోచ్, గురువు ...మరణించిన రోజునే ఆయన మళ్ళీ ఎక్కడో ఒకచోట ...జన్మిస్తారని అన్నారు

లామా రినపోచ్ తన గురువు పునర్జన్మను ...అన్వేషిస్తూ ప్రపంచ వ్యాప్తంగా తిరిగారు చివరికి ...1985 సెప్టెంబర్‌లో స్పెయిన్‌లోని గ్రెనెడాలో ...అప్పటికి ఏడు నెలల శిశువుగా ఉన్న ఒసెల్‌ను లామా ...యెషె అవతారంగా గుర్తించారు ఒసెల్ తన తల్లి ...దండ్రులకు ఐదవ సంతానం మార్చి 12న ఒసెల్‌కు ...నేపాల్ లోని కోపన్ బౌద్ధారామంలో లామాగా దీక్ష ...ఇవ్వడానికి నిర్ణయం జరిగింది కాని ఒసెల్ తమ ...దేశంలోకి రావడానికి నేపాల్ ప్రభుత్వం అనుమతి ...నిరాకరించింది చివరికి భారతదేశంలో దలైలామా ...ఆశ్రమమైన ధర్మశాలలో మార్చి 15న లామా ఒసెల్‌కు ...పట్టాభిషేక పూజ జరిగింది... □

# వారఫలం

**24-4-1987 శుక్రవారం మొదలు**
**30-4-1987 గురువారం వరకు**

★ **మేషం** వ్యాపార సంబంధంగా కృషి చేస్తే మీకు లాభించే వారమే సభా గౌరవానికి కొందరకు అవకాశం ఇటీవల ప్రారంభించిన వ్యాపారం అనుకొన్నంత కంటె ఎక్కువ ఆనందాన్ని కలిగిస్తుంది స్త్రీలకు వస్తు సేకరణకు, నూతనోద్యోగ ప్రాప్తికి అనుకూల వారం

★ **వృషభం** మీ మాటకు గౌరవం, సభా గౌరవం, పత్రికా గౌరవం ఏర్పడనున్నది మిక్కిలి పట్టుదలతో ఒకానొక వ్యవహారాన, ఒకవేళ అది ధన సంబంధ విషయం కావచ్చు ప్రగతిని సాధించనున్నారు రాజకీయాలు మీకు అనుకూలములు గావు స్త్రీలకు చేసిన పనులే చేయవలసి రావచ్చు గ్రహించండి

★ **మిధునం** . మీరు పత్రికా రంగాన శ్రమించే వారైతే అనుకూలమే రాజకీయాలందు మేలు గాదని గ్రహించాలి వృత్తి యందు చెప్పదగిన ప్రగతికి అవకాశమున్నది వెనుక చేసిన చిన్న చిన్న అప్పుల బాధ బాధాకరమే స్త్రీలకు నూతన మార్గాన చక్కని ఆదాయముంటుంది, గ్రహించాలి

★ **కర్కాటకం** వ్యాపార సంబంధంగా లాభదాయకమే సులభంగా ఒకానొక వ్యవహారంలో మోస పోవటం జరుగుతుంది కొందరకు ఆరోగ్యంలో లోపం ఏర్పడవచ్చు గ్రహించి మెలగండి సాహిత్య రంగాన చేయి తిరిగిన వారికి అనుకూలం స్త్రీలకు అన్నిరంగాలలో సదవకాశాలు

★ **సింహం** ధన వసతికి లోపం లేదు ఒకవేళ వ్యాపార మార్గాన కావచ్చు, లేక కళా సాహితీ రంగాన కావచ్చు అధికోత్సాహంతో కొన్ని వ్యవహారాలు సానుకూలం చేసికోగలరు అపరిచితుల సాహచర్యం అనానుకూలతకు ఆస్కారం స్త్రీలకు రాజకీయంగా కలసి రాదని గ్రహించాలి

★ **కన్య** · వ్యాపారం హుషారుగా చేయాలని, సరుకులు కొనుగోలు చేస్తారు ఒడిదుడుకులు లేకుండా చూచుకోవాలి నల్ల వస్తువులు విక్రయించు వారికి అనుకూలమే భారీ వ్యాపారం చేయడానికి యిది సమయం గాదు వృత్తి యందు వికాసమున్నది మాటకు అధిక గౌరవం చేకూరగల సమయం స్త్రీలకు వృత్తి వికాసం, ఆదాయం మిత్రలాభం

★ **తుల** ఇటీవల ఒకానొక విషయంలో విజయం సాధించారుగా, చుట్టు పక్కాల వత్తిడికి తట్టుకోవలసి ఉంటుంది ఋణ బాధ కూడా అధికమే మిత్రుల వలన ఏదైనా యిబ్బంది జరుగుతుందేమో గ్రహించాలి స్త్రీలకు వృత్తి రీత్యా పెంపు, స్వల్పాదాయం

★ **వృశ్చికం** వారమంతా శ్రమకరంగా తోచవచ్చు ఇంట గూడా గొడవలు అధికం కావచ్చు చుట్టుపక్కాల సరేసరి వార మధ్యంలో ఎవరిని నమ్మటమో, ఎవరిని కూడదో తెలియక తికమక పడుతారు దూరపు మిత్రుల నమ్మటం శ్రేయం గాదు స్త్రీలకు ఉద్యోగ రీత్యా మంచి అనుకూల వారం

★ **ధనుస్సు** ధనాదాయ ముంటుంది కొందరు నూతన వ్యాపారం చేయాలని ఉబలాట పడుతారు, అలాంటి ఆలోచనలు యిప్పుడు అనవసరం స్థితి యందు పెంపు చేకూరుట నిశ్చయం దూరబారాల నుండి మిత్రుల్లో బంధువుల్లో యిల్లు చేరుతారు స్త్రీలకు 'కోర్టు' వ్యవహారాలుంటే తొందర యిస్తాయి

★ **మకరం** మీకు శుభ వర్తమానం అందుతుంది మీ మాటకు విలువ పెరుగుతుంది దరిదాపులలో మీకు ఏదో మేలు జరుగగలదని గ్రహించాలి ఆదాయమున్నది, కాని అధికవ్యయం అవకాశవాదులను దాపునకు రానీయకండి స్త్రీలకు అన్నిరంగాలలో సదవకాశాలుంటాయి స్థితి యందు అంతో యింతో పెంపు

★ **కుంభం** ఇంట శుభకార్యం జరుగవచ్చు కొందరకు తీర్థాటనం చెప్పదగిన అంశం కొందరకు విహార యాత్రానుకూలం ఆదాయమందు అభివృద్ధి చెప్పదగిన వారం ఏమయినా బంధు వర్గానికి ఏదో అనానుకూలతయని కొందరకు వర్తమానం కలవరం అనవసరం స్త్రీలకు ఉద్యోగ రీత్యా జాగ్రత్త అవసరం, గ్రహించండి

★ **మీనం** పత్రికా రంగాన పని చేయు వారికి, తెల్ల వస్తువుల వ్యాపారులకు, రాజకీయ రంగాన ప్రగతి సాధింప యత్నించు వారికి, దూరబారాలకు వెళ్లాలని యత్నించు వారికి, శుభకార్య యత్నాలు చేయు వారికి అనుకూలం స్త్రీలకు ఉద్యోగ మందు వికాసం, అనుకూల వార్తాశ్రవణం, ఆరోగ్య భాగ్యం

—విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# చౌకరకంవి కొనడానికీ, మంచి నాణ్యమైనవి కొనడానికీ మధ్య బోలెడు తేడా ఉంది...అందుకే కొనాలి నాణ్యమైన సర్ఫ్.

"తూచి చూస్తే మీకే తెలుస్తుంది—సర్ఫ్ యొక్క పవర్ ప్యాక్డ్ ఫార్ములా మీ డబ్బుకి మించిన విలువ ఇస్తుందని"

**డబ్బుకి మించిన విలువా? అసలే సర్ఫ్ ఖరీదైనది కూడా కదా?**

'చూడండి దీనివల్ల ఎంత ఎక్కువ లాభమో గ్రహించారా మీరు కేవలం సర్ఫ్ మాత్రమే నా బట్టల్ని అతి తెల్లగా ఉతుకుతుంది పైగా వాటిని సంరక్షిస్తుంది కూడా అంచేత అవి కొత్తవాటిలా కనిపిస్తూనే వుంటాయి అంటే ఇంక ఆదాయే అదా అందుకే డబ్బుకి మించిన విలువ ఇస్తుందని అన్నాను నేను"

**సరేగానీ, లలితగారూ, ఆ మాత్రమే చాలంటారా మీరు!**

"అబ్బే ఇంకా ఎంతో వుంది! ఒక కిలో చౌక రకం పౌడర్ ఎంత వుంటుందో అంత ½ కిలో సర్ఫ్ ప్యాక్‌లో ఉంటుంది. అంటే ఒక కిలో చౌక రకం పౌడర్ ఉతికేటన్ని బట్టల్ని అర కిలో సర్ఫ్ ఉతుకుతుందన్నమాట అంటే సర్ఫ్ నుంచి మీరు మరింత లాభం పొందుతున్నట్టేగా మరి?"



1 కిలో చౌక రకం పౌడర్

½ కిలో సర్ఫ్

**అంటే, కొనేందుకు సర్ఫ్‌ని మించినది లేదన్నమాట!**

అందులో సందేహం ఏముంది? సర్ఫ్ మరెంతో తెల్లగా ఉతుకుతుంది మరే మామూలు పౌడర్లకన్న రెట్టింపు బట్టల్ని చౌక రకంవి కొనడానికీ, మంచి నాణ్యమైనవి కొనడానికీ మధ్య బోలెడు తేడా ఉంది అందుకే సర్ఫ్ కొనడంలో మరింత వివేకం ఉంది"






# ఆ కొండకోనల గుండెలోతుల్లో...

వేలూరి ఉషశ్రీ

పచ్చదనాన్ని పరుచుకున్న కొండలూ లోయలూ- చలిచలిగా చల్లదనాన్ని నింపుకున్న వాతావరణం.. అంత చల్లదనమూ- ఆహ్లాదాన్నిస్తోంది ఈసారి వచ్చేటప్పుడు జానకిని తీసుకురావాలి

సార్! టీ తాగుతారా- ఇది దాటితే మనకి దార్లో ఇంకేం దొరకవు సార్- అన్నారు జీపులో ప్రక్కనే కూర్చున్న సారథి.

విశాఖలో రైలు దిగినది మొదలు వెంటనంటి ఉన్నారు తను హైదరాబాదు నుంచి తనపై అధికారిగా వచ్చానన్న గౌరవమో లేక- తనకు కొత్తైన విందయిన ఈ ప్రాంతాన్ని నాకు పరిచయం చేయాలనో- లేక- ఆరేళ్ళుగా ఆగి పోయిన ప్రమోషను ఈ విధంగా సంపాదించాలన్న తాపత్రయమో నాకు అంతుపట్టడం లేదు

"సార్! మీరూ దిగుతారా- ఇక్కడికి తీసుకు రమ్మంటారా?"

అడుగుతున్న సారథి వైపు చూసి- వద్దండీ ఇప్పుడేం తాగాలని లేదు మీరు త్రాగి రండి అన్నాను

చలికి ఆగలేని చేతులని జేబులో పెట్టుకుంటూ చుట్టూ చూశాను-

అనంత గిరికి పోవుదారి అని వ్రాసి ఉంది

రోడ్డు కటూ యిటూ చూస్తుంటే - ఆగిన జీపువైపు ఆశ్చర్యంగా చూస్తున్నారు పిల్లలు. ప్రకృతి పిల్లలు!

దీశ మొలలతో ముఖం అంతా కళ్ళు చేసుకుని వాళ్ళు చూస్తుంటే - నేనూ అప్రయత్నంగా చేయూపి హాయ్ అన్నాను

హాయ్ హాయ్ అంటూ పరిగెత్తారా పిల్లలు!

మీరు ఏం తీసుకోలేదు కూల్ డ్రింక్ తాగుతారా? -చేతులు నలుపుకుంటూ అడుగుతున్నాడు సారథి

ఒకసారి నవ్వున్న నవ్వునాపుకుంటూ పదవయ్యా వెళ్దాం అన్నాను జీపువైపు నడుస్తూ

జీపు బయల్దేరింది

ఎత్తు పల్లాల మించి- మెలికలు తిరుగుతున్న రోడ్డు మీదుగా వెళ్తున్నాం

దారిపొడవునా- పచ్చదనం

కొండల తడి గుండెలలో నుంచి - జలధారలు!

సార్! యిలా యిటు కుడి వైపు చూడండి. కాఫీ ప్లాంటేషన్ సార్ గిరిజనులకి ఉపాధి కల్పించడానికి కాఫీ ప్లాంటేషన్ ఏర్పాట్లు చేశాం! వీటితో మంచి రాబడి! ఇటునుంచి అటు అరకు వరకూ- ఉన్నాయి సార్ అటు చూడండి- అవి మలబరీలు సెరికల్చర్ కోసం పెంచు తున్నాం సార్ క్రొత్తల్లో యివేవీ వేయడానికి వీల్లేదని ప్రతిఘటించిన గిరిజను లందరూ యిప్పుడు క్రమంగా నాగరికతకు అలవాటు పడుతున్నారు సార్"

మౌనంగా వింటున్నాను

-మాట్లాడుతున్న అతడిని ఆపడానికి నేనేం ప్రయత్నం చేయడం లేదు నా మౌనాన్ని అర్ధాంగికారంగా తీసుకున్నాడు సారథి-

మీకు బోర్ కొడ్తోందా సార్! హైదరాబాదు లాంటి మహాపట్నంలో నుంచి యిక్కడికి రాగానే. చిరాగ్గానే ఉంది సార్! " చిన్నగా నవ్వుతూ అన్నాడు నాతో

నా నుంచి రిప్లయ్ రాక కాబోలు.. .. ఆగిపోయాడు ..

హైదరాబాదు!-

-ఎంత మారి పోయింది! జనంతో క్రిక్కిరిసి పోతూ నీళ్ళకి పాలకి నిత్యం వెతుక్కుంటూన్న జనంతో జనారణ్యంగా మారిపోయింది

నిత్యం - పరుగు- వేగం-

రోజులు గడపటమే గాని- జీవిస్తున్నామన్న ఆలోచన క్రమంగా దూరమయి పోతోంది!

నిజానికి - హైదరాబాదుకు దూరంగా - యింత ప్రశాంత వాతావరణం ఉన్నట్టు యిన్నాళ్ళూ తెలియలేదు విశాఖ వరకూ వచ్చాను కానీ- యిటురావడం యిదే మొదలు-

ఆఫీసర్నైతేనేం - వేలమీద వచ్చే జీతం యివ్వని తృప్తి - యిక్కడ యీ ప్రకృతి యిస్తోంది!

ఇంకొక్క గంటలో వెళ్ళిపోతాం సార్ అరకు!"

అలాగా అన్నట్టు తల ఆడించి - మూతలు పడుతున్న కళ్ళకి విశ్రాంతికోసం సీటుకి తల ఆన్చాను-

* * * * *

సార్! మనం వచ్చేశాం అన్న సారథి మాటలు జీపు ఆగిన శబ్దం - ఒక్కసారి మెలకువ తెప్పించాయ్ దిగాను

ఇదే సార్! మన గెస్ట్ హౌస్ అన్నాడు సారథి

-ఎత్తైన కొండ మీద ఒక చిన్న బంగ్లా అది- చుట్టూ గాజు తలుపులు

కొండక్రిందుగా కన్పిస్తున్న చిన్న ఊరు-

లోయలా కన్పిస్తున్న ప్రదేశం-

చుట్టూ తిరిగి చూస్తున్న నాకు-

సార్! దూరంగా కన్పించేవి హైస్కూలు బిల్డింగ్స్! అటువైపుది జూనియర్ కాలేజీ! అక్కడకు దగ్గరే మన ఆఫీసు - ఇటువైపున్న ఊరు అరకు సార్- అటు అది లోయ- అరకులోయ రెంటిని వేరు చేస్తున్న వారి అది- అటు ప్రక్కన కన్పిస్తున్నది పద్మాగార్డెన్సు ఈ రోజుకి మీరు రెస్ట్ తీసుకోండి సార్ - రేపు కల్దాం- అని

రాజా! అంటూ పిలిచాడు

"ఇక్కడి వాచ్‌మన్ ఇతను. అని పరిచయం చేశాడు- రాజా అన్న యాభై సంవత్సరాల వ్యక్తిని అతడి నమస్కారానికి జవాబుగా తల పంకించాను-

మీకోసం అన్ని ఏర్పాట్లు చేశాన్సార్ మీ కింకా ఏమైనా కావాలంటే యితను చూస్తాడు!

థాంక్యూ అంటూ కరచాలనం చేశాను సారథితో

"నేను క్రింద గెస్ట్ హౌస్‌లో ఉంటాన్సార్- నన్ను దింపి జీపు మీ కోసం వస్తుంది అవసరం అయితే కబురు చేయండి ఉదయం కలుస్తామ సార్ నమస్కారం అంటూ కదిలాడు సారథి

లోపలికి నడిచాను

స్నానానికి వేడినీళ్ళు - త్రాగడానికి నీళ్ళు బాగానే ఉన్నాయి ఏర్పాట్లన్నీ-

స్నానం ముగించుకుని జానకి నా కోసం పెట్టిన జాం సీసా బ్రెడ్- పైకి తీసి- రాజాని పిలిచాను

నేను రాత్రిపూట భోజనం చేయను! ఒకగ్లాసు పాలేమైనా దొరుకుతాయా?

పాలు కష్టం బాబూ-- దొరకవు. మీ కవసరం అని టీ తెప్పించి ఉంచమన్నారు అదే ఉందయ్యా అన్నాడు

పాలు ఊళ్ళో దొరకవంటావా- ఆవులూ గేదెలూ ఉన్నట్టున్నాయి కదా.

ఉన్నాయి కానీ యిక్కడోళ్ళకి పాలు తీయడం అలవాటు లేదండి ఒకళ్ళో యిద్దరో యిప్పుడిప్పుడే తీస్తున్నారు కాని అవ్వూ హోటళ్ళకి పోస్తారు

పాలు తీయడం అలవాటు లేదా?- వింతగా ఉందే?"

పాలు తీయడం పాపం అని వీళ్ళ నమ్మకమయ్యా.

అలాగా! అయితే వీళ్ళకి పాలూ పెరుగూ నెయ్యీ- వీటి వాడకం కూడా తెలియదా?"

లేదండి!

మరి తల్లిపాలు లేని చంటి పిల్లలకి ఏం యిస్తారు?

మద్ది కల్లండయ్యా! "

మద్ది కల్లా"?

అవునండయ్యా పులిసి పోయినా అదే పడతారండి.. బాలింతలు కూడా తాగుతారండి "

వింతగా ఉందే! ఇది వీళ్ళ సంప్రదాయమేమో

సరే పోనీలే తొమ్మిది దాటింది నువ్వూ భోజనం చేసిరా! అన్నాను రాజాతో

రాజా వెళ్ళిపోయాడు

ప్రయాణంతో ఒళ్ళంతా అలసటగా ఉంది- ప్రక్క మీద పడుకోబోతూ - వెళ్ళగానే ఉత్తరం వ్రాయండి అన్న జానకి కన్పించినట్టనిపించ

లెటర్ హెడ్ తీశాను

జానీలవ్

చల్లటి ఈ వాతావరణంలో వెచ్చటి నీ గుండెల్లో పడుకుని – ముసుగులోంచి తొంగిచూస్తున్న ఈ ఊరి గురించి కబుర్లు చెప్పుకోవాలని ఉంది ఈ ఊరెంత బాగుందో తెలుసా– నీ ఒడిలో ఉన్నంత! ఇక్కడికి రాగానే – మొదట నిన్ను గురించే అనుకున్నాను నిన్నూ తీసుకు రావలసింది అని! విశాఖపట్నంలో రైలు దిగానన్న విషయం కూడా ఘుర్తురావడం లేదు ఈ ఊళ్ళోనే కళ్ళు తెరిచినంత ఉత్తేజాన్నిస్తోంది ప్రకృతి– యీ వాతావరణం ! అంతా క్రొత్తగా ఉంది తల నెరిసిన నీ శ్రీవారికి నూత్న యవ్వనంలోలా యుండేమిటని ఆశ్చర్య పడుతున్నావా జానీ? నిజం జానీ – యాభైయేళ్ళ జీవితంలో నీతరువాత – అంతా క్రొత్తగా – నరనరాలలో పాకుతున్న చల్లదనంతో పాటు – గుండెల్లో హాయిని– మాటల్లోకి అనువదించలేక పోతున్నాను–

క్షణక్షణం నీ సాహచర్యపు లేమిని ముఖ్యంగా ఆత్మీయంగా కన్పిస్తున్న ఈ వాతావరణంలో అనుభవిస్తూ ఓక్షణం ఆగు ఎవరో తలుపు దగ్గర తచ్చాడుతున్నారు – మళ్ళీ వస్తానేం

–పెన్ని కాప్‌తో మూసి

లైట్ వేసి బయటికి వచ్చాను

రాజా లోపలికి వస్తున్నాడు– రాజా వెనక మరో మనిషి నీడ–

అయ్యగారూ మీ కోసం అంటూ బల్ల మీద సీసాలు పెడుతుంటే–

ఎందుకివి? నే నడగలేదే?

ఇక్కడ చలికదండీ మీకిమ్మన్నారండి!

–నసుగుతున్నట్లు అంటున్న రాజా మాటలతో వస్తున్న కోపాన్ని అణచుకుంటూ–

వద్దు రాజా తీసెయ్ అవి– నా కక్కర్లేదు అన్నాను

ఆశ్చర్యంగా చూశాడు నా వైపు తేలిక పరచడానికని–

వద్దు రాజా! నా కలవాటు లేదు ఎంత చలిగా ఉన్నా వీటి అవసరం నాకు లేదయ్యా తీసెయ్ అన్నాను

తలాడిస్తూ పెట్టినవి పెట్టినట్లు తీసుకుని తిరిగి వెళ్తూ రాజా చేసిన సైగకి అక్కడి నీడ కదిలింది

రాజా చీకట్లోకి వెళ్ళాడు–

వెలుతురులోకి జరిగిందా వ్యక్తి–

వెన్నెల వెలుగులో – అక్కడి సంస్కృతికి ప్రతీకగా నిల్చుంది ఒక అమ్మాయి వణుకుతూ నిలుచున్న తీరులో ఏదో భీతి కన్పించింది నాకు!

ఎవరమ్మా ఏం కావాలి?" అడిగాను

కళ్ళు ఎత్తి నా వైపు చూసిన ఆ ముఖంలో భయం కన్నీళ్ళుగా సుళ్ళు తిరుగుతోంది అదరుతున్న పెదవుల వైపు చూస్తే జాలి వేసింది నాకు

రాజూ! ఎవరీ అమ్మాయి? గట్టిగా అడిగాను

మీ కోసమని ఈ రాత్రికి చీకట్లోంచి విన్పించిన మాటలకి రూపంలేదు

ఓహ్! నాగరికత డబ్బు, పదవి హోదా– నేర్పుతున్న అలవాట్లివి! అధికారి కనీసావస రాలలో యిది పరాకాష్ఠ కాబోలు!– ఎన్ని వీళ్ళుగా సాగుతోందో– ఒక్కసారిగా పోదు!– ఇప్పుడు విడమరచి విసుక్కునే ఓపిక లేదు–

ఛ వీళ్ళు మారరింక అనుకుని–



రాజూ – యీ అమ్మాయిని పంపించెయ్ నాకవసరం లేదు! నవ్వూ పడుకో– అంటూ తలుపులు వేసుకుని లోపలికి వచ్చాను–

–ఒక్క సారిగా నిస్సత్తువ ఆవరించింది మూడ్ ఆఫ్ అయి పోయింది

పడుకున్నాను – గాలికి సగం వ్రాసిన ఉత్తరం రెపరెప లాడుతోంది–

ఉత్తరం రేపు పూర్తి చేయాలి–

ఎదురు చూస్తుంది తను– సారీ! జానీలవ్

*    *    *    *    *

కలత నిద్రతోనే తెల్లవారింది

గాజా తలుపులలోంచి– ప్రకృతి మంచు తెరలు కప్పుకుని ఉంది బయటికి వచ్చాను– చల్లగా అన్పించింది లోపలికి వచ్చి రగ్గు తీసుకుని కప్పుకుని మఫ్లరు చుట్టుకుని అలా నడవా

లన్పించి- సారధి జూనియర్ కాలేజి అని చెప్పిన వైపు కదిలాను

మంచు తెరలలో పిల్లలు యోగాసనాలు వేస్తున్నారు

పచ్చని పువ్వుల తో మొక్కలు బద్ధకంగా తలలూపు తున్నాయి నిడుపాటి చెట్లన్నీ పలుకరిస్తున్నట్లు అన్పించాయి

అలానడుస్తూ తల యెత్తితే - మెల్లిగా వస్తున్నాడు దోబూచులాడుతూ బాలభానుడు ఈ మంచులో రావడానికి తల్లి స్నానానికి పిలిస్తే - మారాం చేసే చంటి బాబులా

-కిరణాలు వెన్నంటుతుంటే - గెస్ట్ హౌస వైపు తిరిగాను

వాచ్‌మన్ తెచ్చిన టీ త్రాగి - స్నానం ముగించే సరికి ఎనిమిదయింది

సారధి వచ్చాడు- గుడ్మార్నింగ్‌సార్ అంటూ

గుడ్మార్నింగ్ అంటూ - ఇంక బయలుదేరు దామా అడిగాను- నిన్నటి ని మరిచి పోవడానికి ప్రయత్నిస్తూ

ఇన్స్పెక్షనుకి బయలు దేరాం

-మంచున తడసిన ప్రకృతి చెక్కిట మొరటుగా కన్పిస్తున్న తారురోడ్డు - దాని మీద దుమ్ము లేపుతూ పొగను వదులుతూ కలుషితం చేస్తున్న జీపులు

అరకు - అరకు దాటి సాగర బిర్లోగూడ గ్రామాలలోకి వెళ్ళాం గ్రామవాసులు చెప్పినవి విన్నాను తిరిగి వస్తుంటే - ఆనందాన్ని స్నేహాన్ని వ్యక్తం చేస్తూ వాళ్ళు ధంసా నృత్యం చేశారు గిరిజన సంస్కృతికి ప్రతీకలుగా ఆడవాళ్ళందరూ లయతో కూడిన అడుగులు వేస్తుంటే - వాళ్ళలో నిన్నటి అమ్మాయి కన్పించింది నేను చూసిన భయం స్థానే ఇప్పుడు నలుగురిలో ఉన్నాననేమో ఆనందం ఉంది

అడవి పూలలా అమాయకంగా ఉన్న ఈ పడతులకి అసలు నాగరికత - అవసరమా? స్వ స్వచ్ఛమైన వీళ్ళ జీవితాలలోకి నాగరికత పేరిట సుఖ రోగాల గుర్తులు మిగులుతున్నాయా? మనస్సు వికలమై పోయింది

అన్యమనస్కంగానే వింటూ చూస్తూ - అక్కడ్నుంచి బయల్దేరాక , వెంటనే రెండు రోజుల్లోగా రిపోర్టు తయారు చేయమన్నాను సారధితో

మీరు వారం రోజులు ఉంటానన్నారు కదసార్? అడిగాడు సారధి

జవాబు నాశించిన అతగాడికి - నా ముఖంలో ఏం కన్పించిందో తలవంచుకున్నాడు

ముందు రిపోర్టు పూర్తి చేయండి - ఎల్లుండి నేను బయలు దేరుతున్నాను- అన్నాను

గెస్ట్ హౌసకి వెళ్ళి భోజనం చేసి కూర్చున్నాను

జానకికి వ్రాయాల్సిన ఉత్తరం - అసంపూర్తిగానే ఉంది పూర్తి చేయడానికి మనః స్థిమితం లేదు

-కళ్ళు మూసుకుని కూర్చున్నా నలాగే -

# ఆ కొండ కోనల....
# గుండెలో తుళ్లో....

ఈజీచైర్లో!

-ఎంత సేపు కూర్చున్నానో తెలియదు

ఎవరో కాళ్ళదగ్గర కూర్చున్నట్లన్పించి కళ్ళు తెరిచాను

నమస్కారం సార్! మీ దయ మర్చిపోను సార్ - అన్నాడతను

ఎవరు? ఎవరయ్యా? , కాళ్ళు వదులు లే ఎవర్నువ్వు? అన్నాను ఆ కుర్రవాడ్ని దూరంగా జరుపుతూ నేను లేవబోతూ

మీరు కూర్చోండి సార్! నేను మిధుల అన్నను సార్! అన్నాడతను

మిధుల అంటే?

రాత్రి మీ దగ్గరికి వచ్చిన అమ్మాయి సార్!

-అంటే?

-ఇన్నాళ్ళకి మీ వంటి ఆఫీసర్ వచ్చి నా చెల్లెల్ని కాపాడారు సార్- ఇంటిదగ్గర నా చెల్లెలు కడువ సంబ్రమయేలాగ ఏడుస్తోంది సార్ చివరి మాటలు అంటుంటే- ఆ యువకుడి కళ్ళలో నీటి తెరలు -

ఆశ్చర్యంగా చూశాను నాకూతురు వయసున్న ఆ పిల్లని నేను నేనేం చేయలేదే?

అందుకేసార్! తన అక్కలాగ తన బతుకు అయి పోతుందని ఏడ్చి ఏడ్చి యిక్కడికి వస్తే మీరు పంపేస్తే మీ మంచి తనంతో' ఆ యువకుడి కంఠం గద్గదికంగా మారింది

నాకూ మనసు ఆర్ద్రంగా అనిపించింది

కొన్ని క్షణాల తరువాత తేరుకున్నట్లు కన్పించాడతను

నీ పేరేమిటి బాబూ?

భిల్లోదాజ్నా సార్ బికామ్ పాసయాను

ఆ అమ్మాయి నీ చెల్లెలు ?

ఏం చదువుకోలేదు సార్ కాఫీ ప్లాంటేషన్‌లో పని చేయడానికి వెళ్తుంది మా అక్క కూడా అక్కడే పని చేసేది సార్

ఇప్పుడు మీ అక్క?

లేదండీ - చచ్చి పోయింది! లేదుసార్ చంపబడ్డది రోజూ పనో్లకెళ్ళేది అప్పుడప్పుడు రాత్రుళ్ళు ఆలస్యంగా వచ్చేదట- అమాయకమైన మా అక్కను ఆ డెవడో ఆఫీసరు అన్యాయం చేశాడ్సార్! పాడు చేశాడ్సార్!- పట్నంలో చదువుకుంటున్న నాకు తెలియద్సార్- కడుపు వస్తే - నాకు తెలిస్తే తిడతానని మందులు మింగిందటస్సార్- నాలుగు నెలలు నిండిన గర్భవతి అన్యాయంగా చచ్చిపోతే మాకు శవం కూడా కుళ్ళి పోయిన స్థితిలో దొరికింది సార్ -వింటుంటే - మనసంతా వికలమై పోయింది- లేచి అతడి దగ్గరగా వెళ్ళి భుజం తట్టాను

నీ మాటలు వింటుంటే నాకూ బాధగానే ఉంది బాబూ ఇక్కడ ఆడపిల్లల అమాయకత్వం చూస్తుంటే ఎప్పటికి తెలుసుకుంటారా అని బాధగా ఉంది ఆర్థిక జీతం బాగుండాలని ప్రభుత్వం కల్పిస్తున్న ఈ పథకాలు యిక్కడ వాళ్ళకి ఉపయోగపడాలి నిజానికి యిలా జరగటం యిదంతా ఎందుకు జరుగుతోందో

అడవితల్లి యిచ్చే పండ్లూ కాయలూ తింటూ హాయిగా బ్రతుకుతున్న మాకు ఎందుకు సార్ యివన్నీ? ఇవే మా బ్రతుకుల్లో చిచ్చు పెడు తున్నాయి సార్! మాకు నాగరికత అక్కర్లేదు సార్ మా బ్రతుకు మమ్మల్ని బ్రతకనివ్వండి అంటూ హిస్టీరిక్‌గా మారి ఆ అబ్బాయి ఏడుస్తున్నాడు

వాతావరణంలో కమ్ముకు వస్తున్న మబ్బులతో పాటు నా మనసూ గుబులుగా చీకటిగా తయారయింది ఆ అబ్బాయిని ఎలా ఓదార్చాలో తెలియక తలను గోడకేసి కొట్టుకుంటుంటే ఆపడానికి విఫల ప్రయత్నం చేస్తూ ఎవరైనా వస్తారేమోనని చూశాను

రాజు వచ్చాడు బలవంతంగా ఆ యువకుడిని బయటికి తీసుకు వెళ్ళిపోయాడు



## గడుసులోకం —బాబు







సారథి వచ్చాడు కాగితాలవో పట్టుకుని

సార్ - మీకు చాలా యిబ్బంది కల్గి నట్టుందండి రాజు అంతా చెప్పాడు అన్నాడు వస్తూనే

ఊహూ లేదు వాళ్ల బాధ అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాను అనుభవిస్తే కాని తెలియదయ్యా వాళ్ల జీవితాల్లో వస్తున్న అవాంఛనీయమైన మార్పులకి తట్టుకోలేక వాళ్ళు పడుతున్న బాధ యిది! ఆఁఅన్నట్టు రిపోర్టు తయారయిందా? అంటూ అతగాడిచ్చిన కాగితా లందుకొన్నాను

నేను చూస్తుంటే చిన్న చిన్న కరెక్షన్స్ ఉన్నాయి సార్ అవి చేసేసి వైజాగ్ వెళ్లగానే టైప్ చేయిస్తాను అన్నాడు సారథి

నేను కాగితాలు మడిచేస్తుంటే మీరు యిక్కడ గార్డెన్స్ అవీ చాలా రేర్ కలెక్షన్స్ సార్ మీరు చూస్తానంటే అన్నాడతను

ప్చ్ ఏం చూడాలని లేదు సారథీ సహజమయిన ప్రకృతిని సంహరించుకుని దాని స్థానంలో కృత్రిమ ఉద్యానవనాలు పెంచుకుంటే ఆ కోల్పోయిన సౌందర్యం వీటికి అందాన్నివ్వదయ్యా!

అందుకే చూడాలనిలేదు రిపోర్టు పూర్తి చేయండి చాలు ఇంక బయలుదేరుదాం

అలాగేసార్ రేపు మీటింగు కాగానే వెళ్దాం వస్తాన్సార్ - మీరు రెస్టు తీసుకోండి!

అతడు వెళ్లగానే నిర్మలంగా కనిపిస్తున్న ప్రకృతిలో నుంచి ప్రశాంతతను పోగు చేసుకోడానికి ప్రయత్నిస్తూ నడుం వాల్చాను

* * * * * *

మర్నాడు

పది గంటలకల్లా అక్కడ సమావేశమయిన ఆరోగ్య కార్యకర్తల్ని ఆర్థికాభివృద్ధి పథకాల అధికారుల్ని ఉద్దేశిస్తూ మాట్లాడాను రోజువారి రొటీనులోలా వాళ్ల విధి నిర్వహణలో అదీ ఒక

## ఆ కొండ కోనల... గుండెలో తుల్లో....

భాగంగా విన్నారంతే ఎవరిలోనూ స్పందన నాకు కన్పించలేదు అధికారి మాట్లాడుతున్నాడు మనం ఎదురాడకూడదు అనే ధోరణే కన్పించింది మరో ముగ్గురు వాళ్లకు రావలసిన ప్రమోషన్కి రికమెండ్ చేయమని అడిగారు

ఏళ్ళుగా ఈ రకం మనుషులతో విసిగిపోయాను ఇదీ విధి నిర్వహణే ప్చ్ అనుకుంటూ ఉంటే ఆ ఊరి ప్రెసిడెంటు వచ్చాడు ఒక చిన్న సమావేశం ఏర్పాటు చేశామని రమ్మని పిలిచాడు

పది నిముషాలు మాట్లాడమన్నాడు సరే నన్నాను ..

గిరిజనులు సమావేశమయ్యారు వాళ్లలో నేను ఒంటరిగా ఉన్నప్పుడు వచ్చినప్పటి ఆ యువకుడు దొన్నొ ఆఁ భిల్లోదొన్నొ కూడా ఉన్నాడు

ఈనా పర్యటనలో నేను గమనించినది వాళ్లలో రావలసిన మార్పును గురించి మాట్లాడాను అధికార్లు వచ్చారని అన్నిటికీ తల ఊపడం కాదు ఆలోచించడం నేర్చుకోమని మోసపోవద్దని చెప్పాను

నా మాటలు చాలా శ్రద్ధగా విన్నారు మీరూ మాట్లాడండి నేను విని చేయగలిగింది చేస్తానని అంటే దొన్నొ ముందుకి వచ్చాడు నా కరచాలనాన్ని అందుకుని మీ మాటలు గుర్తుంచుకుంటాం సార్! ఇంతవరకు మీవంటి వారిని మా ఊహ తెలిశాక చూడలేదు ఇక్కడికి వచ్చిన వాళ్ళు మేం కొండల్లో అడవుల్లో తిరిగి సేకరించేవి జీపుల్లో వేసుకెళ్లేవారే కాని మాతో యిలా మాట్లాడలేదు సార్! మీరు చెప్పినట్లు మాలోనూ లోపం వుంది చదువు విజ్ఞానం నేర్చుకోకుండా అవినీతిని అన్యాయాన్ని ముందు నేర్చుకుంటున్నాం మమ్మల్ని మేమే మోసం చేసుకుంటున్నాం ఇకపైన మావంటి వాళ్లం మంచి చెడుల విచక్షణ నేర్పడానికి ప్రయత్నిస్తాం మావాళ్లకి అన్నాడు

సమావేశం ముగిశాక ఇక బయల్దేరాం

జీపు కదలబోతుంటే మిథుల ఆ అమ్మాయే దొన్నొ చెల్లెలు - ఆ రాత్రివేళ వెన్నెల రెమ్మలా కన్పించిన ఆ అమ్మాయి వచ్చి తడిపిన బియ్యపు గింజలని బొట్టుగా పెట్టి సంపెంగ పువ్వులమాలని నా మెడలో వేసింది

ఇది వాళ్ళు చేసుకొనే స్నేహపు ఒప్పందం సార్! మనమూ జవాబుగా డబ్బులు ఎంతో కొంత వాళ్ల పళ్లెంలో వేయాలి అన్నాడు సారథి

ఆ మాటలు అర్థమయినట్లు దూరంగా వెళ్లి పోతున్న మిథులని దగ్గరకు రమ్మన్నట్లు సైగ చేసి నా బాగ్‌లో నుంచి మా అమ్మాయి శిరీష కోసం కొన్న చీర పేకెట్ ఆ అమ్మాయి చేతుల్లో ఉన్న పళ్లెంలో పెట్టి ఆశీర్వదించాను

చేతులు జోడించి నమస్కరిస్తూ నిల్చుండి పోయింది మిథుల

జీపు కదిలింది

అప్పుడే వెళ్లిపోతున్నారు మళ్లీ ఎప్పుడు వస్తారని అందరూ అడుగుతున్నారు సార్ వచ్చేస్తుంటే అన్నాడు సారథి దార్లో

మళ్లీ అంటే అధికారిగా రానయ్యా! నాగరికత పేరిట వీళ్ల బ్రతుకులో విషాదాన్ని నింపే ఆఫీసరుగా రావాలన్పించటం లేదు ఒక యాత్రికుడుగా వాళ్ల ఆప్యాయత కోసం వస్తాను ఎప్పుడో!

క్రమంగా పచ్చని ప్రకృతి సహజ సౌందర్యం తడి ఆరని జలధారలు అన్నీ కనుమరుగై పోతున్నాయి!

నాగరికత బస్సుల రొదలు ఆర్తనాదాలు అలజడి చేరువవుతున్నాయి! □



# రాములన్న తెలివి

లక్ష్మయ్య పెద్దన్న రాములు కూతురు బుజ్జమ్మ పెళ్లి ఏర్పాట్ల హడావిడి జరుగుతుంటుంది అంతలోనే వెంకన్న బాబాయి అక్కడికి వస్తాడు

























R K SWAMY/NIA/2977/TL

పూర్తి వివరాలకై మీకు దగ్గరలోని న్యూ ఇండియా కార్యాలయానికి విచ్చేయండి, లేదా ఏజెంటును కలవండి

నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం — భీమా!



న్యూ ఇండియా ఎష్యూరెన్స్

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ)

సీరియల్

# ప్రత్యూష పవనాలు

డా॥ భవానీ కృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

నోటికి చెయ్యి అడ్డుపెట్టుకుని ఆవలిస్తూ తలెత్తి చూసిన ప్రత్యూష చెక్కిట చెయ్యి చేర్చుకుని పుస్తకం ముందు పెట్టుకుని చదవడం మానేసి ఆలోచిస్తున్న చెల్లెల్ని చూసి తన చేతిలో ఉన్న పుస్తకం టేబులుమీద పెట్టి వెళ్ళి ప్రఫుల్ల భుజమ్మీద కొట్టి బ్రహ్మాండంగా ఉందే చదువు అంది

ఉలిక్కిపడింది ప్రఫుల్ల

పుస్తకం చేతిలో పెట్టుకుని ఏమిటే ఆ ఆలోచన కాస్త కోపంతో రెట్టించింది

సారీ అక్కా! నా మూడ్ బాగాలేదు చదవబుద్ధికావడంలేదు పుస్తకం మూసేసి వెళ్ళి బెడ్‌మీద పడుకుంది

బాగుందే! చాలా బాగుంది చిన్నప్పుడు కాకరకాయ అని పెద్దయ్యాక కీకరకాయ అన్నాడట నీ లాంటివాడే ఒకడు నిన్న మొన్నటిదాకా పడుకోవే తల్లీ అని బ్రతిమాలితే తప్ప పుస్తకం మూసేదానివికాదు ఇప్పుడు చదువుకోవే అని బ్రతిమాలాల్సివస్తోంది ఏదో నా పోరుపడలేక పుస్తకం పట్టుకున్నా చదవడం మానేసి ఏదో ఆలోచిస్తూ కూర్చుంటున్నావు ఏమైందే! లాలనగా అడిగింది పక్కన కూర్చుని

ఏమీ కాలేదు

మరెందుకిలా ఉంటున్నావు?

నువ్వు అనవసరంగా ఎవేవో ఊహించుకుంటున్నావుగానీ నేను మామూలుగానే వున్నానక్కా

ఇలా నా మొహంలోకి చూసి చెప్పు చెల్లెలి ముఖాన్ని తనవైపు తిప్పుకుంది

సారీఅక్కా! నా కేమైందో నాకే తెలియడంలేదు ఎందుకో చదవబుద్ధి కావడంలేదు చదివినా బుర్రకి ఎక్కడంలేదు అంది దీనంగా

కాలేజీలో ఎవరితోనైనా గొడవపడ్డావా? ఎవరైనా నిన్నేమైనా అన్నారా?

కాలేజీలో అందరూ నన్నెంతో లైక్‌చేస్తారక్కా

మరి ఏదైనా ప్రేమ వ్యవహారంలో ప్రత్యూష మాటలు పూర్తికాక ముందే చచ! అదేం లేదక్కా కంగారుగా అంది ప్రఫుల్ల

జరిగిన కథ – **4** మాలతీదేవి కొడుకు ప్రహ్లాద్ ఇంజనీరు మాలతీ ఆటో మొబైల్స్ నిర్వహణ చూసుకుంటుంటాడు కోడలు వత్సల డాక్టరు పెద్ద కూతురు ప్రత్యూష చిన్న కూతురు ప్రఫుల్ల అనుకోని పరిస్థితుల్లో ప్రఫుల్లకు ధీరజ్‌తో పరిచయం అవుతుంది ప్రహ్లాద్ స్నేహితుడు మనోజ్ నెలరోజులు ఉండేందుకు వాళ్ళ ఇంటికి వస్తాడు ధీరజ్‌కు ప్రహ్లాద్ ఉద్యోగం ఇస్తాడు ధీరజ్ ధీరజ్ వదిన లక్ష్మి పాప మాలతీదేవిని కలుసుకోవడానికి వస్తారు

చిన్నీ! ఇంట్లో మా అందరికీ నువ్వు చిన్నపిల్లలాగే అనిపిస్తావుగానీ నువ్వు మరీ కొత్తగా లోకజ్ఞానం మంచిచెడ్డ తెలియని గ్రహించుకోలేనంత చిన్నపిల్లవికావు అటువంటి దేదైనా ఉంటే ధైర్యంగా చెప్పు అంతేకానీ అనవసరపు ఆలోచనలతో మనసు పాడుచేసుకోకు కళ్ళు మూసుకుని హాయిగా నిద్రపో తెల్లవారుఝామున లేపుతాను చదువుకుందువుగాని కనురెప్పలు బలవంతంగామూసి దుప్పటి కప్పింది తనకీ చదువుకోబుద్ధికాక లైటు తీసేసి వచ్చి తన బెడ్‌మీద పడుకుంది ప్రత్యూష

ఏమైందో దీనికి? రోజురోజుకీ కొరకరాని కొయ్యగా తయారౌతోంది రేపు దాని కాలేజీకి వెళ్ళి ఫ్రెండ్సుని ఎవరినైనా అడిగి చూడాలి అసలుసంగతి ఏమిటో? అనుకుని ఇక ఆలోచనలు ఆపి బలవంతంగా నిద్రకి ఉపక్రమించింది ప్రత్యూష

అంతలోనే తలుపులు తీసిన చప్పుడు వినిపించి దిగ్గున లేచి బయటికి వచ్చింది తలుపులు దగ్గరకు వేసివున్నాయి

దొంగలెవరూ రాలేదుకదా గుండె గుబగుబలాడింది కెవ్వున అరవబోయి బలవంతాన నిగ్రహించుకుంది బయట లైటువేసి తలుపు సందులోనుంచి బయటికి తొంగిచూసింది

మనోజ్ బయట నిలబడివున్నాడు

బయట లైటు వెలగడంతో ఎవరు వేశారా అని గుమ్మంవైపు చూశాడు వెనక్కి తిరిగి

అమ్మయ్యా! మీరేనా? ఏ దొంగాడైనా వచ్చాడా ఏమిటని హడలిచచ్చాను నేను ఇంకా నిద్రపోలేదా? అంటూ మనోజ్ దగ్గరగా వచ్చింది ప్రత్యూష

నిద్ర బరువుతో కిందికి వాలిపోతున్న కళ్ళు కొద్దిగా చెదిరిన జుట్టు నలిగినట్లున్న బట్టలు అలసిన ముఖంతో ప్రత్యూష మరింత అందంగా ఉన్నట్లు అనిపిస్తుంటే సమాధానం చెప్పాలన్న ధ్యాస మరచి అలాగే చూస్తూ నిలబడిపోయాడు మనోజ్

ఆ చూపుని తట్టుకోలేనట్లుగా ఆమె కళ్ళు అప్రయత్నంగా కిందికి వాలిపోయాయి

సన్నని ఎల్లా తెమ్మెర మోసుకొచ్చిన నైట్‌క్వీన్ పరిమళం ముక్కు పుటాలకి సోకి ఉక్కిరిబిక్కిరి చెయ్యడంతో ఉలిక్కిపడింది ప్రత్యూష

బాగా పొద్దుపోయింది ఇంత రాత్రివేళ బయట తిరగడం మంచిది కాదు లోపలికి వచ్చి పడుకోండి అనేసి వెనుతిరగబోయిన ప్రత్యూష మనోజ్ ఎలుపు విని కాళ్ళకి బంధాలు వేసినట్లు ఆగిపోయింది

ప్లీజ్! కాసేపు కూర్చోండి ప్రత్యూషా! మీతో ఒక విషయం మాట్లాడాలి అంటున్న అతని గొంతులోని మార్పు ఆమెని కలవరపెట్టింది

మరుక్షణంలోనే తేరుకుని చిన్నగా నవ్వుతూ అర్జంటు విషయం కాకపోతే రేపు పగలు మాట్లాడుకుందాం అంది అన్యాపదేశంగా

అర్జంటు కాదు గానీ నాలుగైదు రోజులుగా నేను మీతో చెప్పాలను

కుంటున్న ముఖ్యమైన విషయం

అరె! నాలుగైదు రోజుల నుంచీ యు నివర్సిటీకి వెళ్ళిన సమయం తప్ప మిగిలిన టైములో నేనింట్లోనే ఉన్నానుగా అంది ఆశ్చర్యంగా చూస్తూ

అవుననుకోండి తడబడ్డాడు మనోజ్

మీరేమైనా అనుకుంటారేమోనని

ఫరవాలేదు చెప్పండి

అబ్బే! మరేం లేదు నా విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?

బలే వారే! ముఖ్య విషయం అన్నారు ఇదా? మంచివారు స్నేహపాత్రులు వచ్చిన కొత్తలో సిగ్గు కాస్త మొహమాటం ఎక్కువ ఈ మనిషికి అనుకున్నాను మా చెల్లాయి అయితే ముద్ద పప్పు బుద్ధావతారం అని పేర్లు కూడా పెట్టేసింది మీకు ఇప్పుడు ఫరవాలేదనుకోండి కాస్త ఫ్రీగా మూవ్ కాగలుగు తున్నారు మా యింట్లో అంటూ నవ్వేసింది

ప్రత్యూష! నా ఉద్దేశ్యం

సారీ మనోజ్ గారూ! మీ ఉద్దేశ్యం నాకు అర్థమైంది ఆ విషయంలో మీరు మాట్లాడదల్చుకున్నదేదో అన్నయ్యతో అమ్మతో మాట్లాడండి వారిద్దరి నిర్ణయమే నా నిర్ణయం అన్నయ్య స్నేహితులుగా మీరంటే అభిమానం గౌరవం



నా కెప్పుడూ ఉంటాయి ఇంక నేను లోపలికి వెడుతున్నాను ఇంత రాత్రి వేళ ఇలా బయట ఒంటరిగా నిలబడి మాట్లాడుకోవడం బాగుండదు ఎవరైనా ఏదైనా అనుకుంటారని కాదు గానీ నాకే ఇష్టం ఉండదు, ఆ! మీరు కూడా ఇంక లోపలికి

# ప్రత్యూష పవనాలు

వచ్చి పడుకోండి సున్నితంగా స్పష్టంగా చెప్పేన సమాధానం కోసం ఎదురు చూడకుండా లోపలికి వెళ్ళిపోయింది ప్రత్యూష

*    *    *    *    *

బారమైన కడుపుతో నిదానంగా నడుచుకుంటూ వచ్చి కుర్చీలో కూర్చుంది వత్సల

సహజంగా అందమైన ఆమె నిండుగా మరింత రంగు తేలి మరింత అందంగా కళ్ళు చెదిరేలా ఉంది ముఖంలో తల్లి నవుతున్నాననే గర్వం ఒకవిదమైన తృప్తి ప్రస్ఫుటమవుతున్నాయి

అంత పొట్టతో అందరి ముందు కూర్చోడానికి సిగ్గనిపించి అసలు అటువంటి తతంగాలేవీ వద్దంది వత్సల

అదొక వేడుక సరదా కాదనకమ్మా అంటూ బలవంతం చేసి ఒప్పించింది మాలతీదేవి

ఆమెకి అలాంటి వేడుకలంటే ఎంతో సరదా

అలాంటి వేడుకలన్నీ జరిపించడానికి అమ్మలేదు అత్తగారు ఉన్నా ఊహు! తన సరదా తీరనే లేదు కోడలి ద్వారా ఆ సరదాలన్నీ తీర్చుకోవాలని ఆమె ఆరాటం

తనకి అంతగా ఇష్టం లేకపోయినా అత్తగారి సరదాని కాదనలేకపోయింది వత్సల

పరిచయస్తులని స్నేహితులని ఆటోమొబైల్స్‌లో పని చేసే వారి కుటుంబాల వారిని అందరినీ పేరంటానికి పిలిచి వచ్చారు అక్కచెల్లెళ్ళిద్దరూ కలిసి

ఆహ్వానితులంతా వచ్చారు అందరూ వత్సల శిరసున అక్షతలు జల్లి ఆశీర్వదించారు

రెండు చేతుల నిండుగా రంగురంగుల గాజులు ఎరుపు తెలుపు గళ్ళు ఎర్రజరీ అంచున్న పట్టు చీర మెడ నిండుగా బంగారు నగలు తలంటుకున్న తల కావడంతో స్వేచ్ఛావిహంగాల్లా గాలికి కదులుతూ పాల బాగాన నాట్యం చేస్తున్న ముంగురులు మల్లెలు కనకాంబరాలు కలిపి కుట్టిన పొడవాటి వాలు జడతో తనకి పాదాభివందనం చేస్తున్న కోడల్ని మధ్యలోనే ఆపి అక్కున చేర్చుకుని మనసారా ఆశీర్వదించింది మాలతీదేవి

ప్రఫుల్ల ప్రత్యూష లిద్దరూ వచ్చిన ముత్తయిదువులందరికీ పసుపు బొట్టు తాంబూలాలు ఇచ్చే హడావిడిలో ఉన్నారు లక్ష్మి వారికి సహాయం చేస్తూ అటూ ఇటూ తిరుగుతోంది ఇంట్లో మనిషిలా

స్వీటు హాటు వేసి ఎన్ చేసిన పాకెట్లు అందరికీ పంచారు

అందరూ వెళ్ళాక కోడలికి దిష్టి తీసింది మాలతీదేవి వత్సల వారిస్తున్నా వినకుండా

వదినా! ఇదంతా నీ మీది ప్రేమ కాదులే పుట్టబోయే మనవడి మీద అంది ప్రఫుల్ల నవ్వుతూ

ఇద్దరి మీదా నమ్మా మన ఇంటి దీపం వదిన నా కంటి దీపం పుట్టబోయే బాబు అంది మాలతీదేవి ప్రేమగా కోడల్ని చూస్తూ

ఇంకేం? అక్కా! అయితే లైట్లన్నీ ఆర్పెయ్యావే పవర్‌ఫుల్ లైట్ వదిన ఉందిగా ఇల్లంతా వెలుగుతో నిండిపోతుంది అంది వేళాకోళంగా

చాల్లే! నీ వేళాకోళం నువ్వూను చెల్లెల్ని కసిరి వదినా! ఈ సారి అమ్మ కోరిక ప్రకారం ముద్దుల మనవడిని కని ఆవిడకిచ్చేయ్ సెకండ్ టైము నాకొక మేనకోడల్ని ఇద్దువుగాని అంటూ మృదువుగా అభిమానంగా వదినగారి చెయ్యి నొక్కింది ప్రత్యూష

వత్సల కాస్త ముందుకి వంగి అలాగే కానీ ఈలోగా నువ్వొక కొడుకుని కంటే ఆ మేనకోడలిని కోడలుగా చేసేసుకోవచ్చుమరి అంది వత్సల చిలిపిగా నవ్వుతూ

ఛో వదినా! సిగ్గు పడింది ప్రత్యూష

ఒకసారి నర్సింగ్‌హోమ్‌లో తను చూసిన దృశ్యం గుర్తు వచ్చి అప్రయత్నంగానే ప్రఫుల్ల ఒళ్ళు జలదరించింది

ఇదో అక్కా! అమ్మ కోసం కొడుకుని నీ కోసం ఓ కూతుర్ని నా కోసం ఇంకో కూతుర్ని అన్నయ్య సరదా కోసం మరో కొడుకుని ఇలా వరసగా కంటూ పోవడానికి వదిన మనిషనుకున్నావా? యంత్ర మనుకున్నావా? వదినా! ఇప్పుడేదో అయిపోయింది ఇంకోసారి ఇలాంటి పరిస్థితి రాకుండా జాగ్రత్త పడు అంది ప్రఫుల్ల హెచ్చరిస్తున్నట్టుగా

ఏమ్మా! వదిన కష్టపడిపోతుందని భయపడుతున్నావా? అడిగింది మాలతీదేవి మెత్తగా నవ్వుతూ

ఉత్తి కష్టం కాదమ్మా మైగాడ్! అంది బయంగా గుండెల మీద చేతులుంచుకుని

అలా అంటున్నప్పుడు ఆమె కళ్ళ ముందు తాను గతంలో చూసిన దృశ్యం కనిపిస్తోంది

నేను డెలివరీ కేసుకి అటెండ్ అవుతూ ఉంటే ఒకసారి నాతో వచ్చిందత్తయ్యా అప్పటి నుంచీ ఇదే తంతు మాలతీదేవితో చెప్పు చిన్నీ! ఆవిడకి చాలా లేటుగా ఇంచుమించుగా ముట్టుడిగిపోయే సమయంలో కాన్పయింది అందుకే అంత కష్టపడింది అందరికీ ఎందుకంత కష్టం అవుతుంది?? ఈ రెండు మూడేళ్ళలో కొన్ని వందల మంది సుఖంగా ప్రసవించి పసిబిడ్డల నెత్తుకుని సంతోషంగా ఇళ్ళకి వెళ్ళారు తెలుసా? అంది వత్సల

ఏమో బాబూ! నేనయితే చచ్చినా అంత కష్టపడి ఎల్లల్ని కననుగాక కనను అంది ఖచ్చితంగా

చిన్నీ! తప్పమ్మా అలా మాట్లాడకూడదు ఎల్లలు లేని ఇల్లు అసలదొక ఇల్లేనా? అయినా ఇప్పటి నుంచీ నీకు ఆ విషయాలెందుకు? అంది మాలతీదేవి మందలింపుగా

కాసేపటికి బయటికి వెళ్ళిన ప్రహ్లాద్ మనోజ్ తిరిగి వచ్చారు

నూతన వధువులా అలంకరించుకుని ఉన్న భార్యని చూస్తూ గుమ్మంలోనే నిలబడి పోయాడు ప్రహ్లాద్

ఒరే అన్నాయ్! కాస్త రెప్ప వాల్చరా నాయనా అందరి కళ్ళూ పడి దిష్టి తగిలిందేమోనని అమ్మ ఇప్పుడే దిష్టి తీసింది వదినకి నువ్వు ఇంకా కాసేపు అలా చూస్తూ నిలబడ్డావంటే మళ్ళీ అమ్మ ఉప్పు మిరపకాయలు తీసుకొస్తుంది అంటూ వేళాకోళం చేసింది ప్రఫుల్ల

చాల్లేవే నీ వేళాకోళం నువ్వూను కూతుర్ని కసిరి ఒరే నాన్నా! అమ్మాయికి అక్షింతలు వేసి ఆశీర్వదించండి రా ఇద్దరూను అంది మాలతీదేవి

వత్సల లేచి వెళ్ళి వంగి కాళ్ళకి నమస్కరించబోతూంటే అం అనవసరంగా హైరానపడకు కాళ్ళకి దణ్ణం పెట్టకపోతే ఆశీర్వదించనేమిటి? అంటూ అక్షింతలు వత్సల నెత్తి మీద జల్లాడు ప్రహ్లాద్

ప్రత్యూష అక్షింతలు ఇస్తూంటే అబ్బెబ్బె! నా కెందుకండీ అన్నాడు మనోజ్ గాభరాగా

మీక్కాదు వదినకి వెయ్యడానికి అంది నవ్వుతూ

సిస్టర్ సిస్టర్ అంటూ ఆప్యాయంగా ఎలుస్తూ అన్నయ్యలు లేని లోటు తీరుస్తున్నారు ఆశీర్వదించండి అంటూ అతని కాళ్ళకి దణ్ణం పెట్టింది వత్సల

అరెరె! ఏంటమ్మా ఇది! కలకాలం మీరు సుఖంగా సంతోషంగా ఉండాలి అంటూ అక్షింతలు వత్సల నెత్తి మీద వేశాడు మనోజ్ ఇంకేమనాలో తెలియక

మీరిలా గాభరా పడి పోతున్నారు గానీ మా అన్నయ్య అయితే మేము కాస్త పెద్దయ్యామని ఇప్పుడు మానేశాడు గానీ మొన్నటి దాకా పది రూపాయలో పాతిక రూపాయలో లంచం ఇచ్చి మరీ కాళ్ళకి దణ్ణం పెట్టించుకుని ఆశీర్వదిస్తున్నట్టు వినిపించీ వినిపించకుండా ఏదో గొణిగేవాడు లోపల లోపలే ఏదో తిట్టుకుంటున్నాడని నేనైతే ఏడిచి గోల చేసేదాన్ననుకోండి నవ్వుతూ చెప్పింది ప్రఫుల్ల

నాకిలాంటివన్నీ అలవాటు లేదు అసలు ఇలాంటి పద్ధతులు ఆచారాలు ఉన్నాయని కూడా నాకు సరిగా తెలియదు నా పనేదో నేను చూసుకోవడం తప్పితే మిగిలిన విషయాలు నేనంతగా పట్టించుకోను మొహమాటంగా అన్నాడు మనోజ్

అమ్మా వత్సలా! వెళ్ళి ఆ బట్టలు మార్చుకుని రా పొద్దుపోతోంది భోజనాలు చేద్దాం అమ్మాయ్! మీరు కూడా వెళ్ళండమ్మా అంటూ ఆ టాపిక్ మార్చింది మాలతీదేవి

అత్తయ్యా! చాలా సేపటి నుంచి కూర్చుని ఉండడం వల్ల నడుము నొప్పిగా అలసటగా ఉంది ఆకలిగాలేదు కాసిని పాలు తాగి పడుకుంటాను మీరందరూ తినెయ్యండి అంది వత్సల గదిలోకి వెడుతూ

సరే పాలు వేడి చేసి పంపిస్తాను ఈలోగా బట్టలు మార్చుకో అంది మాలతీదేవి

గదిలోకి వెళ్ళగానే ఆమె రాక కోసమే ఎదురు చూస్తున్నట్టుగా వత్సలని చుట్టేశాడు ప్రహ్లాద్

కొత్త పెళ్ళికూతురిలా ఉన్నావు తెల్సా? అంటూ చెవిలో గుసగుస లాడాడు

అచ్చం కొత్త పెళ్ళికూతురిలాగే సిగ్గుపడింది వత్సల

అలా సిగ్గుపడి నన్ను చెడ్డవాడిని చెయ్యకోయ్ అసలు అన్నాళ్ళు ఎలా

సెన్సార్ కట్ ప్లీజ్ ప్రఫుల్ల గొంతు విని ఒక్క గెంతులో మంచం మీద నుంచి దూరంగా వెళ్ళాడు

సారీ టు డిస్టర్బ్ యూ! వదినా! అమ్మ నీకు ఈ పాలు ఇచ్చి రమ్మంటే



వచ్చాను అంటూ పాలగ్లాసు వత్సలకి ఇచ్చి అన్నగారి వైపు తిరిగి అలా మింగేసేలా చూడకురా బాబూ వెళ్ళి పోతున్నాను అంది నవ్వుతూ

కూర్చుంటే కూర్చో నాకేం నష్టమట నేను బోజనానికి వెడుతున్నాను అంటూ లుంగీ చుట్టుకుని గబగబా వెళ్ళిపోయాడు ప్రహ్లాద్

చిన్నీ! ఆ టేబులు మీదున్న ఎర్ర రంగు అట్టపెట్టెలో టాబ్లెట్స్ ఉన్నాయి ఒకటి ఇలా ఇవ్వమ్మా

టాబ్లెట్ తీసుకొచ్చి ఇచ్చి అది వేసుకొని పాలు తాగాక గ్లాసు అందుకుని వదినా! కాస్త ఓపిక చేసుకుని లేచి ఆ పట్టుచీర విప్పేసి ఈ చీర కట్టుకుని పడుకో తేలికగా ఉంటుంది అని చీర అందించి కట్టుకోవడంలో సహాయం చేసింది నల్లపూసల దండ మంగళసూత్రాలున్న గొలుసు తప్పించి మిగిలిన నగలన్నీ తీసి బీరువాలో భద్రపరిచింది

పూల జడ మీద తలలో తురిమిన పూలదండలు కూడా తీసి పక్కన పెట్టింది ప్రఫుల్ల

అమ్మయ్య! ఓపిక లేక ఇందాకా అలా పడుకున్నాను గానీ ఇప్పుడెంతో రిలీఫ్‌గా ఉంది చిన్నీ అంది హాయిగా ఊపిరి పీల్చుకుంటూ

ఉండు ఇప్పుడే వస్తా అంటూ ఒక టవల్ తడిపి తీసుకొచ్చి ముఖం అంతా అయిన కుంకుమ శుభ్రంగా తుడిచి లైట్‌గా పౌడరు రాసి ఫేను ఆన్ చేసి ఇప్పుడు పడుకో హాయిగా నిద్ర పడుతుంది అంది

# ప్రత్యూష పవనాలు

నీలాగే నీ మేనల్లుడు కూడా మహా అల్లరివాడులా ఉంది కడుపులో ఉండగానే తెగ అల్లరి చేస్తున్నాడు అంది వత్సల చిన్నగా నవ్వుతూ ఇంక నిద్రలో పడుతుంది

దట్స్ గుడ్! ఒరేయ్ బుజ్జీ అమ్మని మరీ అంత విసిగించకమ్మా వత్సల పొట్ట మీద సున్నితంగా చేత్తో రాస్తూ అని వత్సలతో భరించాలి తప్పదు మరి మనవాళ్ళు తల్లిని భూదేవితో పోలుస్తారు మరెందుకనుకున్నావ్?? అంది ప్రఫుల్ల నవ్వుతూ

మంచిదే సరేలే వాళ్ళందరూ డైనింగ్ టేబులు దగ్గర నీ కోసం ఎదురు చూస్తున్నారేమో? వెళ్ళి భోజనం చేసి రామ్మా

ఆకలి లేదు తిననని చెప్పానులే అమ్మకి నా కోసం ఎదురు చూడరు నువ్వు ఒక్కదానివీ ఉంటావని అమ్మ నీ దగ్గర ఉండమంది భోజనాలయ్యే వరకూ అన్నయ్య రాగానే నేను వెళ్ళిపోతాన్లే

మాట్లాడకుండా నిద్రపోతున్నట్టు నటిస్తూ కళ్ళు మూసుకుని పడుకుంది వత్సల

వత్సలని వారిస్తున్నా వినక అన్నగారు వచ్చే వరకూ నడుము రాస్తూ కూర్చుంది

కాసేపటికే బ్రేవ్‌మని త్రేనుస్తూ టవల్‌తో చెయ్యి తుడుచుకుంటూ వచ్చారు ప్రహ్లాద్

మహానుభావా! వచ్చావా! ఇక నేవెడుతున్నా అంటూ ప్రహ్లాద్ కూర్చోమంటున్నా వినక బయటికి వచ్చేసింది

అప్పటికి ఫోన్లో ఎవరితోనో మాట్లాడుతోంది ప్రత్యూష ప్రఫుల్లని చూడగానే చిన్నీ! నర్సింగ్‌హోము నుంచి ఫోనొచ్చిందే ఏదో సీరియస్ కేసట వదిన్ని అర్జంటుగా రమ్మంటోంది సిస్టర్ వదినకి చెప్పిరా అంది

సారీ బ్రదర్! మళ్ళీ రాక తప్పలేదు వదినా! నిద్ర పట్టిందా?

లేదులే చిన్నీ! ఏమిటి?' అంది వత్సల కళ్ళు తెరుస్తూ

ఏదో సీరియస్ కేసట నర్సింగ్‌హోము నుంచి ఫోను వచ్చింది

'ఇప్పుడు రావడానికి వీలు కాదని చెప్పేయ్ అన్నాడు ప్రహ్లాద్

వదినకి ఒంట్లో బాగా లేదని చెప్పింది అక్క వదిన్ని ఒకసారి ఫోను దగ్గరకి పిలవమంటోంది సిస్టర్

వదమ్మా ఏదో సీరియస్ కేసు అయి ఉంటుంది లేచి హాల్లోకి వచ్చింది వత్సల




రిసీవరు అందుకుని నర్సు చెప్పింది విని సరే ఉండు మళ్ళీ పది నిముషాల్లో ఫోను చేస్తాను అంటూ మరో నంబరు డయల్ చేసి హలో కరుణా! ఇంకా ఇంటికి వెళ్ళలేదా? అడిగింది స్నేహితురాలు డాక్టర్ కరుణని

ఇప్పుడే వెళ్ళబోతున్నాను ఇంకా ఫంక్షను అవలేదా? అడిగింది కరుణ

అయిందిలే ఏదో సీరియస్ కేసు అంటూ నర్సింగ్‌హోము నుంచి ఫోను వచ్చింది నాకయితే అస్సలు ఓపిక లేదు బాగా అలసటగా ఉంది నీకు అవకాశం ఉంటే ఆ కేసుకి అటెండ్ అవుతావేమోనని

ఇప్పుడా?

ప్లీజ్! నాకు బొత్తిగా ఓపిక లేదు నువ్వు సారీ అనేస్తే నేను వెళ్ళి తీరాలి ఓపికలేకపోయినా సరే

సరే

నీ కారుందా? నా కారు పంపించనా? మా డ్రైవరు ఇంకా ఇంటికి వెళ్ళలేదు

మా డ్రైవరు ఉన్నాడులే ఇప్పుడే బయలుదేరుతున్నాను

థాంక్యూ వెరీమచ్ సిస్టర్‌కి ఫోను చేసి చెప్తున్నాను నువ్వొస్తున్నావని అని మళ్ళీ నర్సింగ్‌హోముకి ఫోను చేసి డాక్టరు కరుణ వస్తోంది రిసీవ్ చేసుకుని పని పూర్తయ్యాక తను వెళ్ళే ముందు నాకు మళ్ళీ ఫోను చేసి ఏ విషయం చెప్పు' అని సిస్టర్‌కి చెప్పి భారంగా అడుగులేస్తూ తన గదిలోకి వెళ్ళింది వత్సల

*  *  *  *  *

ప్రహ్లాద్ మనోజ్ ఒకరి వెనుక ఒకరుగా రావడం చూసి చేతిలో ఉన్న భగవద్గీత మూస్తూ రండి బాబూ కూర్చోండి అంది మాలతీదేవి

అమ్మా! వచ్చిన పని అయిపోయిందట మనూ సాయంకాలం బండికి వెళ్ళిపోతానంటున్నాడు అన్నాడు ప్రహ్లాద్ తల్లి పక్కనే కూర్చుంటూ

వెళ్ళొచ్చులే బాబూ అప్పుడే తొందరేమిటి?

తొందరంటారేమిటి ఆంటీ అప్పుడే నేను వచ్చి దగ్గర దగ్గర నెల కావస్తోంది అన్నాడు మనోజ్

అయితే అయిందిలే సరదాగా మరో నాలుగు రోజులు ఉండి వెళ్ళు అంది అభిమానంగా

లేదాంటీ రేపు అక్కడ డ్యూటీలో జాయినవాలి వెళ్ళక తప్పదు

సరే తప్పదంటే నీ ఇష్టం మళ్ళీ అవకాశం ఉన్నప్పుడు ఓ సారి రా ఇంట్లో ఎల్లాడిలా మాతో కలిసిపోయావు

అసలు పొరుగూరు వచ్చినట్టే నాకు అనిపించడం లేదు ఆంటీ నాకూ మళ్ళీ రావాలనే ఉంది కానీ ఆ రావడం స్నేహధర్మంగా కాకుండా బంధుత్వం కలుపుకుని అయితే బాగుంటుందని

అమ్మా! నువ్వొప్పుకుంటే చిన్నీనో మున్నీనో పెళ్ళి చేసుకుంటానంటు న్నాడు అన్నాడు ప్రహ్లాద్

నువ్వు ఇష్టపడితే సరిపోతుందా బాబూ మీ తల్లిదండ్రులు ఇష్టపడాలి మీ నాన్నగారి పేరు అడ్రసు అవీ రాసివ్వు వీలు చూసుకుని మా వాడు మీ నాన్నగారితో మాట్లాడడానికి రావడమో లేకపోతే ఉత్తరం రాయడమో చేస్తాను అన్నీ కుదిరితే నువ్వు మా యింటి అల్లుడివి కావడం నాకూ సంతోషమే బాబూ నీ లాంటి బుద్ధిమంతుడు యోగ్యుడు అయిన కుర్రాడు ఎన్నాళ్ళు వెతికితే మాకు దొరుకుతాడు! అంది మాలతీదేవి

జేబులో నుంచి కాగితం తీసి అడ్రసు రాసి మాలతీదేవి ముందున్న భగవద్గీత మీద పెట్టాడు మనోజ్

కళ్ళజోడు సరిచేసుకుని ఆ కాగితం అందుకుని చూస్తూ

ఎం రామకృష్ణ ఎం అంటే? సందేహంగా మనోజ్ ముఖంలోకి చూసింది మాలతీదేవి

చెప్పాడు మనోజ్

మీ నాన్నగారు కొన్నాళ్ళు విజయవాడలో పని చేశారా?

అవునాంటీ అమధ్య యాక్సిడెంటు అయి రెండు కళ్ళూ పోయాయి ఉద్యోగం పోయింది నాకు ఆఫీసువాళ్ళు క్వార్టర్సు ఇచ్చారు ఇంక ఏకంగా తీసుకొచ్చి నా దగ్గరే పెట్టుకున్నాను అందరినీ

అయితే బాబూ మీ అమ్మ పేరు సావిత్రా?

# ధర్మపథం మంచివాడెవడు?




అసత్యం పలక్కుండా ఉన్నది ఉన్నట్లు చెప్పినవాడు యోగ్యుడనీ మంచివాడనీ అందరూ అతనిని ప్రశంసిస్తారు ఆ విధంగానే కటువుగాగాని అనిష్టమైన దానిని గాని చెప్పక ప్రియంగానూ ఇంపుగానూ మాటలాడే వాడున్నూ మంచి వాడనే అనిపించుకుంటాడు సత్యం చెప్పినా అది తమకు అయిష్టమైనదిగా ఉన్నప్పుడు ఎదటి వారు ఆ చెప్పిన వానిని మెచ్చుకోరు సరికదా నిందిస్తారు కూడా అప్రియంగా మాటలాడిన యదార్థ వాది మంచి పేరు తెచ్చుకోవడం అరుదు అందువల్ల మంచివాడని అందరూ అనాలంటే అప్రియంగా మాటలాడ కూడదు అప్రియమైన సత్యం చెప్పడం వల్ల అనర్థాలూ అపాయాలూ కలగడం కూడా ఉన్నది

తన ఆప్తమిత్రుడు పెద్ద అపాయ స్థితిలో ఉన్న దుర్వార్తను విన్న వాని మనస్సు ఎంతో కలతపడి కాలు సేతులు ఆడని స్థితి ఏర్పడవచ్చును వార్త తెచ్చిన వానికి కూడా అది ఎంతో బాధను కలిగిస్తుంది అత్యంత సన్నిహిత బంధువు మరణ వార్తను విని చైతన్య రహితుడు కావటం కూడా సంభవమే! ఒక్కొక్కప్పుడు ఉద్రేకంతో ప్రాణాలు పోగొట్టుకొనుటకు సిద్ధపడటం ప్రాణాలు పోవడం కూడా సంభవించవచ్చును కొన్ని సందర్భాలలో దుర్వార్త తెచ్చినవాని పయి కోపం కూడా కలుగవచ్చును కొంత ముందాలోచన కలవారు అట్టి వార్తలు చెప్పడానికి సిద్ధపడకూడదని పెద్దల హితోక్తి నబ్రూయాత్ సత్య మప్రియం (యదార్థమే అయినా అప్రియమయిన మాటను చెప్పకూడదని దీని అర్థం)

చెడ్డ వార్తలు చెప్తే నలుగురి చేతా తిట్లు తినవలసి వస్తుందని గ్రహించి విచక్షణులు, తమకు తెలిసిన ఆ వార్తలను చెప్పకుండా తూష్ణీం బావం పహించి ఉంటారు

సాదారణంగా హితవాక్యం సున్నితంగా ఉండదు సున్నితమయిన హిత వాక్యం దుర్లబమని "హితం మనోహరి చ దుర్లబం వచః అనే సుబాషితం చెప్తునే ఉన్నది ఇతరుల మంచిని కోరి ఆలాంటి హితాన్ని చెప్పితే అవతలివారు ఈ చెవిని విని ఆ చెవిని విడిచిపెడతారే కాని తమ మేలు కొరకే అలా చెప్తున్నట్లు గ్రహించరు చెప్పే వారిని ఏవగించు కుంటారు కూడా అందువల్ల అట్టి హితాన్ని విజ్ఞులు చెప్పనూ చెప్పరు చెప్పినా అవతలివారు విననూ వినరు ఈ విషయాన్నే అప్రియస్యచ సత్యస్య వక్తా శ్రోతా చ దుర్లబ అనే ఆర్యోక్తి తెలియజేస్తున్నది మంచి వాడని అనిపించుకొనుటకు తటస్థంగా ఉండుటయే సముచితం

- బులుసు వేంకటరమణయ్య

అవునాంటీ మా అమ్మ మీకు తెలుసా? ఆశ్చర్యంగా చూశాడు మనోజ్

మాలతీదేవి ముఖం క్షణంలో కఠినంగా మారిపోయింది

బాబూ! మనూ! నా కూతుర్ని పెళ్ళి చేసుకునే అర్హత నీకు లేదు నువ్వు ఎంత త్వరగా మా యింట్లో నుంచి వెళ్ళిపోతే అంతగా సంతోషిస్తాను నేను

అమ్మా ఏమైందమ్మా గాబరాగా తల్లి బుజాలు పట్టుకున్నాడు ప్రహ్లాద్

ఆంటీ! తెల్లబోయాడు మనోజ్

ఆంటీ! హఠాత్తుగా మీకు ఇంత కోపం రావడానికి కారణం ఏమిటో నాకర్థం కావడం లేదు ఇన్నాళ్లు ప్రహ్లాద్‌తో సమానంగా నన్నూ మీ కొడుకులా చూశారు నిజమైన తల్లీబిడ్డల అనురాగం వారి మద్యనున్న సన్నిహితత్వం ఎలా ఉంటుందో మీ ఇంట్లో ఉన్న ఈ కొద్ది కాలంలోనే నేను చవిచూడగలిగాను ఆనంద నిలయం లాంటి ఈ ఇంటికి దూరం కావడం ఇష్టం లేకనే ఈ ఇంటికి అల్లుణ్ణి కావాలని ఆశపడ్డాను ఆంటీ! మీ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళి చెయ్యకపోయినా ఫరవాలేదు నన్ను అలా కోపంగా అసహ్యంగా మాత్రం చూడకండి నేను మీ పట్ల ఏమైనా అనుచితంగా అసభ్యంగా ప్రవర్తించానా ఆంటీ? గద్గద స్వరంతో దీనాతిదీనంగా అడుగుతున్న మనోజ్‌ని చూసిన మాలతీదేవి హృదయం తల్లడిల్లింది

నువ్వేమీ అనుచితంగా ప్రవర్తించలేదయ్యా నిన్ను ఆ తల్లికి కొడుకుగా పుట్టించి ఆ భగవంతుడే అనుచతంగా ప్రవర్తించాడు నీ మీద నాకేమీ కోపంగా లేదు బాబూ కానీ – కానీ – నా బిడ్డని నీ కిచ్చి పెళ్ళి చేసే ప్రసక్తి మాత్రం లేదు స్పష్టంగా చెప్పేసింది

ఆంటీ! మా అమ్మ మా అమ్మ మీకు తెలుసా?

తెలుసు ఎలా తెలుసో నేను మాత్రం చెప్పను అవసరం అనుకుంటే చేతనైతే మీ అమ్మని అడిగి తెలుసుకో ఆ విషయం తెలుసుకోగలిగితే నా ఈ కోపానికి కారణం కూడా నీకు తెలుస్తుంది

మంచిదాంటీ మళ్ళీ మీ ఎదుటికి రావడం అంటూ జరిగితే ఆ విషయాలన్నీ తెలుసుకున్నాకే వస్తాను ఇన్నాళ్ళూ నన్ను ఇంత అభిమానంగా ఆదరంగా చూసినందుకు శతకోటి వందనాలు వస్తాను మాలతీదేవికి పాదాభివందనం చేసి బయటికి వచ్చేశాడు మనోజ్

వెనుకే వచ్చిన ప్రహ్లాద్ మనూ! అమ్మ ఎందుకిలా ప్రవర్తించిందో నాకు అర్థం కావడం లేదు ఏ విషయమైనా మా యింట్లో నీకు ఇంత అవమానం జరిగినందుకు బాధ పడుతున్నాను అయామ్ సారీ రా జరిగినదంతా మరచిపో మనోజ్ చేతులు పట్టుకున్నాడు

టేకిట్ ఈజీ ఆంటీ ఇలా ప్రవర్తించారంటే దానికి ఏదో బలమైన కారణం ఉండి ఉంటుంది అదేమిటో తెలుసుకోడానికి ప్రయత్నిస్తాను మా చెల్లెమ్మకి మీ చెల్లెళ్ళకీ చెప్పకుండా వెళ్ళిపోతున్నాను అర్జంటుగా వెళ్ళాల్సి వచ్చిందని ఏమీ అనుకోవద్దని చెప్పు వస్తాన్రా అంటూ గబగబా తన గదిలోకి వెళ్ళి సామాను తీసుకొని ఒకసారి ప్రహ్లాద్ వైపు చూసి వేగంగా బయటికి వెళ్ళిపోయాడు మనోజ్ దీర్ఘంగా బాదగా నిట్టూర్చాడు ప్రహ్లాద్ (ఇంకా ఉంది)

# ఒక రామబాబు కథ

రాంబాబుని అందరూ అదోరకం మనిషి అంటుంటారు

ఆ ఏమ్మనిషిలే! ఊరంతా ఓ దారైతే ఉలిఎకట్టిదో దారన్నట్టుంటాడు అని అతనిపంథా నచ్చని వాళ్ళు అంటుంటారనుకోండి!

అంతెందుకు వాళ్ళ నాన్నె మావాడు అందరిలాంటివాడు కాదోయ్ అని అనేక సందర్భాల్లో అన్నట్టు దాఖలాలున్నాయి

నిజమే మరి చిన్నప్పుడు కొనుక్కోమని డబ్బులిస్తే దాచి నెల చివర్లో తల్లి కిచ్చేసేవాడు టెన్త్‌క్లాస్ చదివేటప్పుడు అందరూ ట్యూషన్ చెప్పించుకున్నా తనుమాత్రం క్లాసులో లెక్కల మాస్టార్ని ఎవడికోసం చెబుతావన్నట్టు ఒకటికి పదిసార్లు అడిగి విసిగించి చెప్పించుకునే వాడు తండ్రి నచ్చచెప్పబోతే వీళ్ళు క్లాసులో సరిగా చెబితే ఇంక ట్యూషన్లెందుకు నాన్నా అనేవాడు

ఇంటర్‌లో క్లాసు తెచ్చుకుని కూడా ఆర్థికంగా తండ్రిపడే కష్టాన్నీ పెద్దకొడుకుగా తన బాధ్యతనీ గుర్తించి డిగ్రీకోసం పాకులాడకుండా సెకండరీ గ్రేడ్ ట్రైనింగ్ కెళ్ళాడు

ట్రైనింగ్ అయిన సంవత్సరం వరకూ రాంబాబుకి ఉద్యోగం రాలేదు అయినా అతను నిరాశపడలేదు పోనీ ఓ అయిదారువేలు ఎక్కడన్నా తెచ్చి మున్సిపాలిటీలో టీచరు ఉద్యోగం కొనిపెడతానని తండ్రి బ్రతిమాలినా వినలేదు

చస్తే లంచం ఇవ్వను ఇంక నేను కష్టపడి చదివిన ఫలితమేముంది? అని భీష్మించు కూచున్నాడు

రుద్రపురంలో ట్యుటోరియల్ కాలేజీలకు కొదవలేదు ఓ ట్యుటోరియల్ కాలేజీలో పనిచేస్తూ సాయంత్రాలు ట్యూషన్ చెబుతూ తండ్రికి సహాయపడసాగాడు ఓప్రక్క ప్రైవేటుగా బి ఎ చదువుతూ

అలాంటి అందరిలాంటి వాడు కాని రాంబాబుకి ఎలాగైతేనేం ఇప్పుడు ఉద్యోగం వచ్చేసింది జడ్ పి సెలక్షన్సులో తమ రుద్రపురం సమితిలోనే సెకండరీగ్రేడు టీచరుగా

రాంబాబు ఆనందానికి అంతేలేదు

కాదామరి! లంచం లేందే కొంచెం అప్యాయతయినా దొరకని ఈ రోజుల్లో లంచం ఇవ్వరాదు పుచ్చుకోరాదు" అనే కఠిన నియమంగల రాంబాబుకి ఉద్యోగం రావడం అంటే మాటలా!?? పైగా ఇంకో ఆరునెలల్లో తండ్రి రిటైరవబోతున్నాడు కూడాను ఇంట్లో అందరూ పండగచేసుకున్నారు

పోస్టింగ్ ఆర్డర్స్ కోసం సమితి ఆఫీసుకెళ్ళాడు రాంబాబు ఇవో (ఎడ్యుకేషన్) దగ్గర కెళ్ళి నమస్కారం పెట్టి తను వచ్చిన పని చెప్పి చేతిలోని కాగితం అందించాడు ఆయన ఆ కాగితాన్ని ఓసారి పరిశీలించి తన ప్రక్కన నిలబడివున్న ప్యూన్‌కేసి సాభిప్రాయంగా చూసి చేతిలో కాయితాన్ని తిరిగి రాంబాబు కిచ్చేసి ఎదుట కూర్చున్నవాళ్ళతో మాటలు సాగించాడు

ప్యూన్ రాంబాబుని తనతో రమ్మన్నట్టు సైగచేసి ముందుకు నడిచాడు ఈ ఆఫీసులో వాళ్ళు చాలా రిజర్వుడు టైపులా ఉన్నారే అనుకుంటూ అనుసరించాడు రాంబాబు

ప్యూన్ రాంబాబుని ఓ టేబుల్ దగ్గరకు తీసుకెళ్ళి ఆ కుర్చీలో వున్నతనితో సత్యమూర్తిగారూ! ఇవో గారు పంపిచేరండీ అని రాంబాబుని చూపించి తన దారిన వెళ్ళిపోయాడు ఆ సత్యమూర్తి అనే అతని వెనుకవైపు గోడమీద ఇ2 క్లర్క్ అని ఓ కాగితం మీద పెద్దక్షరాలతో వ్రాసి అంటించివుంది

సదరు సత్యమూర్తి ప్యూన్ మాటలకు చూస్తున్న ఫైల్లోంచి తలెత్తి రాంబాబుకేసి ఎగాదిగా చూశాడు

రాంబాబు ఆ చూపుకి కంగారుపడి చప్పున ఇదిగో నండి అంటూ తన చేతిలోని కాగితం అందించాడు

*　　*　　*

ఆ ఇప్పుడు చెప్పవయ్యా! నిన్నెక్కడ వెయ్యమంటావ్? ఏ చోటయితే నీ కనుకూలంగా ఉంటుందంటావ్?

సిగరెట్ వెలిగించుకుంటూ అడిగాడు సత్యమూర్తి

ఆఫీసు ఆవరణలోని చెట్టుక్రింద వున్న బెంచీమీద కూర్చుని ఉన్నారిద్దరూ రాంబాబు కేం మాట్లాడాలో తెలీలేదు అతనికిదంతా క్రొత్త

మళ్ళీ సత్యమూర్తే మాట్లాడేడు

వెంకటపాలెంలో ఓ ఖాళీ ఉంది కాని చాలా దూరం బస్సుదిగి మూడు మైళ్ళు నడిచి కాలవ దాటివెళ్ళాలి పైగా సింగిల్ టీచరు స్కూలు

అప్పటికి మాట్లాడేడు రాంబాబు

అవునండీ! ఆ వెంకటపాలెం ప్రయాణం ఎంత కష్టమో నా కోసారి అనుభవమైంది ఓ స్నేహితుడి పెళ్ళికి ఆ ఊరెళ్ళాల్సి వచ్చింది ఇంటికొచ్చాక రెండ్రోజులు లేవలేకపోయాను ఇంక అక్కడ ఉద్యోగమంటే నవ్వాడు సత్యమూర్తి అభయం ఇస్తున్నట్టుగా ఉందా నవ్వు

ఇకపోతే పద్మా నగర్‌లో రెండు ఖాళీలున్నాయి అక్కడైతే నీకు చాలా హాయి మెయిన్ రోడ్డు ప్రక్కనే స్కూలు బస్సుకైనా వెళ్ళచ్చు లేదా పావుగంటలో సైకిల్‌మీదయినా వెళ్ళచ్చు ఏమంటావ్? రాంబాబేమంటాడు క్రొత్తగా ఉద్యోగంలో చేరుతున్న తన మంచి చెడులు ఆలోచించి తనకు ఇబ్బంది లేకుండా చేయాలని చూస్తున్న సత్యమూర్తి పట్ల ఆ క్షణంలో ఎక్కడలేని గౌరవం కలిగిందతనికి

కంఠం పూడుకు పోతుండగా అలాగే ఇంట్లో నేను పెద్దవాడ్ని నాన్నగారికి అనారోగ్యం పైగా ప్రైవేటుగా బి ఎ చదువుతున్నాను పద్మా నగరైతే నా కెంతో సదుపాయంగా ఉంటుంది మీమేలు మరచిపోను మనస్ఫూర్తిగా అన్నాడు

ఆప్యాయంగా నవ్వాడు సత్యమూర్తి దాన్దేముంది అన్నట్టు మన సమితికి నీతో బాటు మరో ఇద్దరు కూడా ఎలాటయ్యారుగా నువ్వు వాళ్ళకంటే ఒకపూట ఆలస్యంగా జాయినయినా సీనియారిటీ తగ్గుతుంది ఈరోజే పోస్టింగ్ ఆర్డర్సు తీసుకుని రేపు జాయినైపో మరి మరి ఇక

ఏమిటిసార్?

అదే మరి ఓ రెండొందలిలా పడేయి మిగతా విషయాలు చూస్తాను

మాట్లాడవేమయ్యా

అప్పటికి షాక్‌నుండి తేరుకున్న రాంబాబు

లంచమా ?

మొహం చిట్లించాడు సత్యమూర్తి ఇందాకటి సౌమ్యత అతని మొహంలో గుర్తు తెలీకుండా మాయమైంది

లంచమేమిటి?! ఆ పద్మానగర్‌కి ఎంత పోటీ వుందో తెలుసా? అయినా ఆ రెండొందలూ నా ఒక్కడికే అనుకున్నావా? పెద్దోళ్ళకి పంచొద్దూ! నాకు మిగిలి చచ్చేదేం లేదు ఏదో పాపం బీదవాడిలా ఉన్నావని

ఈ విషయం బి డి వో కి రిపోర్టు చేద్దామా అని ఆలోచిస్తున్న రాంబాబు ఈ మాటల్తో మరింత బిత్తరపోయాడు అందరూ ఒకటే అయితే ఇంకెవరికి చెప్పుకోవాలి!

ఏమయినాసరే నేను మాత్రం డబ్బివ్వను

నిష్కర్షగా చెప్పేశాడు ఇన్నాళ్ళు ఎన్ని కష్టాలయినా ఓర్చి కాపాడుకున్న నియమాన్ని యిప్పుడు తీరా ఉద్యోగం వచ్చాక వదులుకుని ఆత్మవంచన చేసుకోడం రాంబాబుకి యిష్టం లేకపోయింది

సరే నీ యిష్టం విసురుగా లేచి వెళ్ళిపోయాడు





సత్యమూర్తి

తర్వాత ఏవేవో కారణాలవల్ల రాంబాబుకి పోస్టింగ్ ఆర్డర్సు రావడం రెండురోజులు ఆలస్యమైంది మిగిలిన ఇద్దరి కంటే రాంబాబు రెండురోజులు ఆలస్యంగా జాయినయ్యాడు వెంకటపాలెంలో

మూడేళ్ళు గడిచిపోయ్యాయి

ఈ మూడేళ్ళూ రాంబాబు పడిన కష్టాలు చెప్పనలవికాదు అందరికీ సకాలంలో వచ్చే డి ఎ ఎరియర్స్ మొదలైనవి అతను ఆఫీసు చుట్టూ ఓ యా భైసార్లన్నా తిరిగితే కానీ రావు అతను పంపించే బిల్లులు వగయిరాల్లో ఏదో ఓ తప్పు దొరుకుతూనే ఉంటుంది బిల్లులు చూసే క్లర్కుకి అతనితో పాటు అపాయింట్ అయ్యిన యిద్దరికీ ప్రొబేషన్ డిక్లేర్ అయినా ఇతనికి ఇంకా కాలేదు పైగా వెంకటపాలెంలో ఉద్యోగం అక్కడ ఉండేందుకు బొత్తిగా వీలుకాని ఊరు అలాగని రోజూ ప్రయాణం అసలే అసాధ్యం

రాంబాబులాంటి నిజాయితీగా ఉద్యోగం చెయ్యాలనుకునే ఉద్యోగికి అంతకంటే శిక్ష లేదు రాంబాబు ఈ కష్టాన్ని ఎలాగో భరించదలచుకున్నాడు కాని ఇంతలో అతనికి అనుకోని పెద్ద కష్టం వచ్చి పడింది

అతని తండ్రి హఠాత్తుగా గుండెనొప్పితో చనిపోయాడు ఇది అతనికి తట్టుకోలేని దెబ్బ కనీసం బజారు మొహం తెలీని తల్లి ఇంకా రెక్కలు రాని తమ్ముళ్ళు చెల్లెళ్ళు ఒక కొలిక్కి రాని కుటుంబ వ్యవహారాలు

రాంబాబుకి ట్రాన్స్‌ఫర్ చేయించుకోవడం తప్పనిసరైంది కానీ ఆ కాస్త ముదుపూ చెల్లించందే అది సాధ్యమయ్యేలా లేదు

ఎదురైన ప్రతి వాళ్ళు ఒకటే సలహా ఎన్నాళ్ళిలా తిప్పలు పడతావు?! ఎంతో కొంత వాళ్ళ మొహాన పడేసి గండం దాటరాదా?!

ఆ రోజు ఆదివారం తండ్రి పడుకునే ఈజీ చెయిర్లో పడుకొని దిగులుగా పై కప్పుకేసి చూస్తున్నాడు రాంబాబు

తన పరిస్థితి తలచుకున్నకొద్దీ అతనికి పిచ్చెక్కేలా ఉంది దుఃఖం తన్నుకొస్తోంది

అమ్మయ్య! ఇంట్లోనే ఉన్నావటోయ్!? అంటూ వచ్చారు సుబ్బయ్య మాస్టారు ఆయన కూడా సమితిలో టీచరే తండ్రికి స్నేహితుడు కూడా

కూర్చోండి

ఇప్పుడే నాకో విషయం తెలిసిందోయ్

నిరాసక్తంగా చూశాడు రాంబాబు

ఈ నెల పదిహేను వరకే ట్రాన్స్‌ఫర్లకి వీలుందట అంటే ఇంక వారం రోజులే ఆ తర్వాత ఏడాది వరకూ వీలు కాదుట

రాంబాబు ఏం మాట్లాడలేదు

కానీ తన మనసులోని ఆందోళనంతా అతని మొహంలో ప్రతిఫలిస్తోంది నచ్చ చెపుతున్నట్టుగా అన్నారు సుబ్బయ్య మాస్టారు నువ్వు తొందరపడక పోతే లాభం లేదోయ్ చూడు సిద్ధాంతాలతో కడుపులు నిండుతాయా!? ఒక్కసారి నీ తల్లితో బుట్టువుల మొహాలు చూడు నువు దగ్గరుండి చూసుకోకపోతే ఈ ఇల్లేమై పోతుంది?! ఎల్లలు పాడైపోరూ?! సత్యమూర్తితో నేను మాట్లాడ్తాను ఓ నాలుగొందలు నీవి కావనుకో

"పోనీ నీకు మొహమాటమైతే చెప్పు నేనే సెటిల్ చేస్తాను

మాట్లాడవేమోయ్

భారంగా నిట్టూర్చాడు రాంబాబు తర్వాత మెల్లిగా వణికే స్వరంతో అన్నాడు

అలాగే మీయిష్ట ప్రకారమే కానీండి

అంతే

ఆ తర్వాత చెప్పడానికేమి లేదు

మావాడు అందరిలాంటి వాడు కాదని చెప్పడానికి ఇప్పుడతని తండ్రి లేదు

మిగిలిన వాళ్ళెవరూ అలా అనరు

ఎందుకంటే

ఇప్పుడతను అందరిలాంటి వాడే □




### జి ఏ ఆర్ సామర్లకోట

★ కొన్ని సినిమాలలో గల అసభ్య సంబాషణలు తొలగించడానికి (తొలగడము లేదనుకొండి) ఏదో సెన్సారు బోర్డు అంటూ ఏర్పాటు చేశారు కదా అదేవిదంగా అంతకంటే అసభ్యమైన ప్రశ్నలు జవాబులు అడగండి చెబుతాను వ్యాసరచన లు కార్ట్యూనులు గల వార పక్ష నెలవారీ పత్రికలు కూడా అటువంటివి అరికట్టడానికి ప్రయత్నం చేయడానికి– చాలా అవసరం అంటాను ఏమంటారు

● నిరక్షరాస్య దేశం కనుక చూసే మీడియం మీద ఉన్న శ్రద్ధ ప్రబుత్వం చదివే మీడియం మీద కనబరచక పోవడం చాలా అన్యాయమే – ప్రెస్ కౌన్సిల్ అని ఒకటుంది మరీ దుర్భర మైన వాటిని జనం దాని దృష్టికి తేవచ్చు – కానీ అదీ మరీ మన సెన్సారులాగే గుడ్డి కంటితో చూస్తుంది ఈ మద్య అసబ్య చట్టం పెట్టారు అవసరాన్ని గుర్తించాలన్న తొనుగు దాన్ని జాగ్రత్తగా పొదిగారు అసబ్యతలో అవసరం ఏమిటి? కళకు అసబ్యతే ఆలంబన కానక్కరలేదు ఇదిగో ఇలా వుంటాయి మన చట్టాలు పోనీ చదువరులు తిరగబడతారా అంటే – అహఁ ఓహో అద్భుతం– లాంటి లేఖలు గుప్పించి అసహ్యించుకునే వాళ్లని మైనారిటీ చేస్తున్నారు ఈ లేఖల వెనుక ఎంత కుకింగ్ ఆప్ వుందో– అందరికీ తెలుసు కాని ఎల్లికి ఎవరు కట్టారు గంట? అన్న సమస్యే – యీ దరిద్రం చూసి బాదపడే వాళ్లు ఎదుర్కొంటున్నారు స్త్రీలు సహితం – ద్వంద్వార్థ బూయిష్టమైన సరస సంబాషణలు బూతుల బుంగల వంటి అతి చక్కని సుమదుర సంగీతం మెచ్చి విరగబడి చూస్తున్నారంటున్నారు సినిమాలు అలాగే పత్రికలలో బూతూ ఎవరూ దాన్నేం చెయ్యలేరు ఇష్టం లేక పోతే నాలాగే – ఆయా పత్రికలు చూడకుండా వుండడ మొక్కటే – దారి లేదా వందలూ వేలూ సంతకాలు చేసి ప్రెస్ కౌన్సిల్పై దాడి చేయడం – యింకోదారి!

### పి ఆర్ కె కోటబొమ్మాళి

★ మిమ్మల్ని సీనియర్ రచయితగా అర్ధం చేసుకొని మా సమస్యలను ప్రశ్నల మాదిరిగా అడుగుతున్నప్పుడు వాటిని మీరు మరో విదంగా బావించుకొని అర్ధం లేని సమాదానాలు యివ్వడం బాగో లేదండీ 1 కె రా గారూ యీ ప్రశ్నావళిలో ఎన్నేళ్ల నుంచి జవాబులిస్తున్నారు 2 ప్రశ్నావళిలో మొదటలేని పోటో మద్యలో ఎందుకు ప్రింటు చేయించారో చెప్తారా?

● ఇవేనా మీ సమస్యలు?? నేను అర్ధం చేసుకోలేనివి! ఎచ్చి తండ్రీ? ఈ ప్రశ్నావళి సోది కాదు! ఇది మీ ఊహకి నా ఊహల కలబోత అంతే అంతేగాని నేనో మేదావిననీ – మీ రంతా చేట చెవులు చేసుకుని యివి వినేసి తరించేయాలనీ నేను అనుకుంటే నేనుట్ట వెర్రి సన్నాసి నన్నమాట!!

### జి ఎస్ చంద్రగిరి

★ ప్రజా కవులుగా ఎలువ బడుతున్న రచయితలు తమ రచనల ద్వారా పేరు పొందడం తప్ప చేతలలో ప్రజలకు ఏమి చేశారంటారు? వ్యంగ్యంగా జవాబివ్వకండి

● చిత్తం వ్యంగ్యం మీ వంటికి పడదా? పెజల బాసలో పద్దేలూ కతలూ గీకి మన చేత చదివించడం తప్ప ఆ బాష మాట్లాడే వాళ్లు నూటికి నూరు మంది నిరక్షర కుక్షులనీ వారికివి చదివి విన్పిస్తే ఎడిశారు పొండి అంటారనీ తెలియకనా?! కాదు మనం చద్దివి జాలితో మన గుండె కరిగి – మన పనిమనిషిని మన రిక్షావాడిని మన గులాములని మనుషుల్లా చూస్తామని నిజమైన ప్రజాకవి – అదే ప్రజల మద్య ప్రజల బాషలో ప్రజలని ఊపే కవి ఒక్కడే వున్నాడని విన్నాను – గద్దర్ అతని పేరు

### జి ఆర్ బి ప్రత్తిపాడు

★ ఖడ్గాని కన్న కలమే బలమైనది అంటారు ఎందు వలన?

● ఖడ్గం ఒకేసారి చంపుతుంది కలం కుమిలి కుమిలి చచ్చేలాగా చంపకలదు ఖడ్గం వేటుకి నెప్పి తెలిసే లోగా చస్తాం– కలంతో అలాకాదు అంతే– పూర్వంలో అయితే పౌరుషం రెచ్చకొట్టడానికి మనిషికి యింగితం పెంచడానికి – ఖడ్గం కంటె కలాన్ని బలమైన ఆయుదంగా బావించే వారు ఆరోజులు పోయాయి

★ కుల మత రాజకీయాలు అంతమవ్వాలంటే?

● రాచరికం రావాలి అప్పుడింకోరకం బాద ప్రారంబం అవుతుంది ప్రజాస్వామ్యం – వుంటే– కనీసం నోరు పారేసుకునేనా ఏడవవచ్చు!–

### సి ఆర్ ఎన్ పెద్దపల్లి

★ రామలక్ష్మి గారూ! ఆడదాని మనసు మగాడు తెలుసుకోవాలంటే ఎలా? కేవలం చూపులనో పట్టి మాటను బట్టి తెలుసుకోవచ్చా?

● చూపు మాట తెలుపలేనిది మనసు చెప్తుంది అంచేత మనసుని మనసుతోనే– అర్ధం చేసుకోకల్గుతారు ఆడదే కదా అని లోలోన యీసడించుకుంటూ– తేనెపల్కులు ఒలికించినా ప్రణయ దృక్కులు పరిపించినా పలితం శూన్యం పెళ్లాం అయితే – భరిస్తుంది– నిజం తెలిసినా ప్రియురాలైతే – ప్రేమిద్దా మనుకుంటున్నది అయితే – తప్పించు కుంటుంది

### ఎ ఎస్ ఆర్ ఖర్గపూరు

★ భూమి చుట్టూ ఎలా పంచ బూతాలు ఆవరించి ఉన్నాయో అలాగే లంచ బూతాలు కూడా ఆవరించి వున్నాయి మరి మీరేమంటారు?

● ప్రత్యక్షర సత్యం తమ్ముడూ పంచ బూతాలు కనబడవు కనుక నమస్కరించి – వూరుకుంటాం కాని లంచ బూతాలు కనబడని దెయ్యాలు– ఎలా తృప్తి పరచాలో తెలియని వాళ్లని మింగుతాయి తెలిసిన వారికి వరాలిస్తాయి

### జి ఎన్ ఆర్ రామకృష్ణాపూర్

★ రామలక్ష్మిగారూ నక్సలైట్లపై మి అబిప్రాయం ఏమిటి?

● ఆవేశంతో దారి తప్పిన తమ్ముళ్లు వాళ్లు అనుకుంటూ వుంటాన్నేను హింసని ఆయుధంగా చేసుకుని శాంతి పోరాటం సాగించడం హాస్యాస్పదంగా అనిపిస్తుంది నాకు హింస హింసని రెచ్చకొట్టు తుందేగాని– ప్రశాంతతకి దారి తీయదుకదా ప్రజాస్వామ్యంలో ఓటు కున్న బలం దేనికీ లేదు అదికారం యివ్వాలన్నా లాగేయాలన్నా – ఓట్లు చాలు మరి వీరంతా ఓటర్లని ఎందుకు ప్రబావితులని చేయాలని చూడరు □

మాఅమ్మర్కి పెళ్లి చేయాల్నా లేక కొడుక్కి బ్లాకులో టెక్స్టటబుక్స్ కొనాల్నా అని ఆలోచిస్తున్నారాదినా!





వర్చస్సులు పలురకాలు !

## లాక్మే క్యాలమైన్ మాత్రమే మూడు రంగులలో దొరుకుతుంది. మీ వర్చస్సుకు సరిపోయేలా అందులో ఒకటి.

**నేచురల్**
గోధుమ ఛాయ
వారికి




**లైట్**
పసిమి ఛాయ
వారికి




**గోల్డు**
నలుపు ఛాయ
వారికి




కేవలం లాక్మే క్యాలమైన్ మాత్రమే మూడు అందమైన ఛాయలతో లభిస్తుంది— నేచురల్, లైట్, గోల్డ్.
వీటిలో ఒకటి మీ ముఖ సౌందర్యాన్ని ఇనుమడింప చేయడానికే ప్రత్యేకంగా తయారు చేశారేమో అని అన్పిస్తుంది.
లాక్మే క్యాలమైన్ మీ మోముపై సులభంగా వేసుకోవచ్చు. దీని మోహక పరిమళం మీ మదిని తోలివేస్తుంది.
దీనిలోని గుణకారక తత్వాలతో మీ మోము ఒక క్రొత్త శోభతో వెలిగి పోతుంది.

**లాక్మే**
**క్యాలమైన్**

ప్రతి వర్చస్సుకు అనువైన రంగులు.

TI

# అభిమాన తారలపై అభిప్రాయం

నటనలో నావెల్టీ, స్టెప్స్‌లో వెరైటీ కలిగిన అందాలనటుడు సుప్రీమ్ "హీరో" నట భాస్కర్ చిరంజీవి నా అభిమాన నటుడు. నవరసాలను నటనలో ఒలికించి "పున్నమి నాగు"లా సినీ నీలాకాశంలోకి ఎగప్రాకి "మగమహారాజు"లా వెలిగిపోతున్నాడు. చిరంజీవుల హృదయాలలో చిరస్థాయిగా నిలిచి పోతున్నాడు. స్వయం కృషితో



పైకి వచ్చి అనతికాలంలో అత్యధిక ప్రేక్షకుల అభిమాన నీరాజనాలు అందుకుంటున్న సినీ చక్రవర్తి "చిరంజీవి" అనే చెప్పవచ్చు. "రాక్షసుడు" అవతారం ఎత్తి "చాణక్య శపథం" చేసూ్త మన ముందుకు వచ్చిన "దొంగ మొగుడు" కి విజయభేరి మ్రోగించాము. అంచనాలకు మించి తయారు అవుతున్న "ఆరాధన" ని మనసారా ఆరాధిసా్తరని ఆశిసూ్తన్నాను డైనమిక్ హీరో అభిమానిని అయిన నేను.

—టి. శివకుమారి, అమరావతి

★ ★ ★

నటనకు భాషాబేధాల్లేవని నిరూపిసూ్త అన్ని భాషా చిత్రాలలో అత్యుత్తమ నటుడిగా ప్రేక్షకుల అభిమానాన్ని చూరగొన్న కళాహృదయుడు, కళాత్మక నటుడిగా పేరు పొందిన "కమలహాసన్" గారు నా అభిమాన నటుడు! అన్ని భాషా చిత్ర రంగాలలోను అత్యుత్తమ నటుడు అయినటువంటి కమల్ హాసన్ గారు చిత్రాల్లో తన పాత్ర పరిధి మేరకు నటిసా్తరు అనడంకంటే జీవిసా్తరు అనడం సమంజసంగా ఉంటుంది. చిత్ర పరిశ్రమలో



కమలహాసన్ గారి ప్రత్యేకత ఏమిటంటే – అతను ప్రేక్షకుల హృదయాల్లో ఒక టైపు పాత్రలకు మాత్రమే పరిమితమయినట్లు ముద్ర పడకపోవడం!. ఉదాహరణకు –"ఆకలిరాజ్యం, అమావాస్య చంద్రుడు, సాగర సంగమం, స్వాతిముత్యం, ఒక రాధ– ఇద్దరు కృష్ణులు" చిత్రాలలో ఏ చిత్రానికి ఆ చిత్రంలో విబిన్న తరహా పాత్రలను పోషించగలిగి ప్రేక్షకుల అబిమానాన్ని చూరగొని తన దర్శక నిర్మాతల ముందు తన ప్రత్యేకతను నిరూపించుకున్నాడు. చిత్ర పరిశ్రమలో ఏ నటుడి నటనా సామర్ధ్యం విషయంలో వెలెత్తి చూపడానికి అవకాశముందేమో గానీ ఈ కమలహాసన్ గారి నటనా సామర్ధ్యాన్ని వేలెత్తి చూపగల అవకాశం, అర్హత, ఎవ్వరికీ లేవేమో! కాని ఇటువంటి కళాత్మక నటుడికి తెలుగు పరిశ్రమలో ఎక్కువ సినిమాలకు నిర్మాతలు తమ సినిమాలలో స్థానం కల్పించక పోవడం శోచనీయం. నేటి సమాజంలో కళల పరిస్థితి ఏ విధంగా ఉందో అదే విధంగా మా అభిమాన నటుడికి చెప్పుకోదగ్గ మార్కెట్టు లేక పోవడం బాధాకరమైన విషయం. కావున నేటి దర్శక నిర్మాతలు తమ చిత్రాలలో మా అభిమాన నటుడి నటనను ప్రదర్శింప జేసి, మాకు సంతోషానందములు కలిగించగలరని ఆశిసు్తన్నాను.

-ఋషిశ్రీ, కమ్మపాళెం (నెల్లూరు)

★ ★ ★

సినీ కళామ తల్లి ముద్దుబిడ్డ, మహానటి సావిత్రి వారసురాలు, సినీ నీలా కాశపు అరుణ కిరణం, అందాల తార, నేటి సూపర్‌హీరోయిన్ విజయశాంతి



గారు నా అభిమాన నటి. అతి తక్కువ కాలంలోనే తన నటనా సామర్ధ్యంతో సినీ ప్రేక్షకుల హృదయాలలో ముద్ర వేసుకొన్నది. సూపర్ హీరోయిన్ విజయశాంతి సందేశాత్మక పాత్రలను, గ్లామర్ పాత్రలను పోషించి నటిగా అగ్రశ్రేణికి చేరుకుంది. సమాజంలో స్త్రీగా సమాజంలో జరిగే అన్యాయాలను, అక్రమాలను ప్రతిఘటించాలని , తమ బిడ్డలను రేపటి పౌరులుగా తీర్చి దిద్దాలని తమ పాత్రల ద్వారా సందేశాన్నిచ్చింది. నేటి భారతం, అరుణకిరణం, ప్రతిఘటన, సక్కనోడు, చాణక్య శపథం, ముద్దుల క్రిష్ణయ్య, కళ్యాణ తాంబూలం మొ. చిత్రాలలో తన పాత్రలను ఛాలెంజ్‌గా తీసుకొని అత్యద్భుతంగా నటించింది. ఆమె నటిగానే గాక దర్శకురాలిగా మారబోతున్నది. ఆమె ఎల్లప్పుడు ప్రేక్షకుల మన్ననలు పొందే, ఉన్నతమైన, సందేశాత్మక మైన చిత్రాలలో నటించాలని, అసభ్య కరమైన దుస్తులు వేయక నిండైన వస్త్ర ధారణలో నటించాలని నా మనవి. ఎక్కువ అవార్డులు గెలుచుకొని, మహానటి సావిత్రి స్థాయికి ఎదిగి, ఉన్నత కీర్తి శిఖరాలందుకొని సూపర్ హీరోయిన్‌గా నిలిచి పోవాలని నా ఆకాంక్ష

—బి శారద నర్సరావుపేట

★ ★ ★

నా అభిమాన నటుడు కృష్ణ. "అల్లూరి సీతా రామరాజు, ఈనాడు, దేవదాసు" సినిమాల [illegible] ఆయనను అభిమానించే 6 కోట్ల ఆంధ్రులలో, నేను ఒకడిగా మారితిని. ఆయన గారి నడవడిక, కనిపించే తీరు, వాక్ చాతుర్యము అంటే నాకెంతో ఇష్టం. అన్యాయాన్ని ఎదిరించి, మొహం మీదే విమర్శించడం, ఏదైనా పని తలచి దానిని



విజయవంతము చేయడం కృష్ణ గారి అలవాటు.

చిత్రపరిశ్రమలో ఎవరూ ఖర్చు పెట్ట లేనంత ఖర్చు పెట్టి, అహోరాత్రములు కష్టపడి, కనీ వినీ ఎరుగని రీతిలో, "సింహాసనాన్ని" అధిష్టించిన నట కిశోర్ మా కృష్ణ.

పద్మాలయా స్టుడియోస్ అధినేతగా, మంచి వ్యక్తిగా, తిరుగులేని హీరోగా, కేవలం తెలుగు చిత్ర పరిశ్రమలోనే కాకుండా, హిందీ చిత్ర పరిశ్రమలో కూడ, గొప్ప గుర్తింపు పొందిన నటుడు మా సూపర్‌స్టార్.

ఒక అభిమానిగా కృష్ణగారికి నేనిచ్చే సలహా– ద్వంద్వ అర్థాలు వచ్చే సినిమాలలో నటించి, ఆయన అభిమానుల్ని దూరం చేసుకోవద్దని మనవి.

—ఎ. శ్రీనివాస్, రాజోలు

★ ★ ★

మా ప్రియమయిన అభిమాన నటుడు యువ సామ్రాట్ నాగార్జున అక్కినేనిగారు. మొదటి చిత్రం "విక్రమ్"తోనే నాగార్జున నూతన శకారంభానికి నాంది పలికాడు. " అరణ్యకాండ" చిత్రంలో అతని



నటన చూచి ఆనందించాను. నాగార్జున అబిమాన ప్రేక్షకుడిగా కాగలిగాను. ముఖ్యంగా "మజ్ను చిత్రంలో చాలా అద్భుతంగా నటించారు. ఇంకా ఇటువంటి ఎన్నో మంచి చిత్రాలలో నటించి మమ్ములని ఆనందింపజేస్తారని భావిసు్తన్నాను నాగార్జున సినీనట జీవితం మూడు పువ్వులు ఆరుకాయలుగా అబివృది చెందాలని ఆకాంక్షిస్తున్నాను

మజ్జి రామారావు బొబ్బిలి □



# అభినేత్రి భానుప్రియ సమాధానాలు

**ఎం శ్రావణి, నరసరావుపేట**

ప్ర ముల్లు అరిటాకు మీద పడ్డా– అరిటాకు ముల్లు మీద పడ్డా నష్టం అరిటాకుదే అంటూ ఆడదాన్ని అరిటాకుతో పోలుస్తారెందుకండీ?

జ : అరిటాకులు ఓ నాడు ఉక్కు ఆకులుగా మారతాయి ఆవేళ ముల్లు విరుగుతుంది సామెత మారుతుంది

**సంద్ర శంకరయ్య నాయుడు, సనత్‌నగర్**

ప్ర : మీ జీవితంలో ఏం సాధించాలని అనుకుంటున్నారు! ఎలా సాదించాలనుకుంటున్నారు?

జ : ఏదో సాధించాలనీ, ఎలాగో సాధించాలనీ నేనేమీ అనుకోవడం లేదు

**వాదాడ రాజశేఖరరావు, సాలూరు**

ప్ర : సినీ పరిశ్రమలో వారసులు ఎక్కువయ్యారు దీని వల్ల నటనకు ప్రాధాన్యత తగ్గుతుంది దీనిపై మీ అభిప్రాయం?

జ ఎలా తగ్గుతుంది?

**పి సి రాఘవాచార్యులు, కాకినాడ**

ప్ర అందాన్ని మనసుతో చూస్తారా, కళ్ళతో చూస్తారా?

జ మనసుతో చూసి కళ్ళతో ఆస్వాదించాలి

**త్రిపురపు రమణా రావు, విజయనగరము**

ప్ర : ప్రస్తుత సినీపరిశ్రమపై మీ అభిప్రాయమేమిటి?

జ అంతటి అభిప్రాయం ప్రకటించే వయసూ, అనుభవం నాకు లేవు

**పి వి. సతీష్‌కుమార్, హనుమాన్‌జంక్షన్**

ప్ర : ప్రతి పనికిరానివాడూ పదవికి ఎగబడతాడెందుకని?

జ తాను ఎందుకూ పనికి రాని వాడినని అతగాడికి తెలిసి పోయింది కనుక

**మునీవర అహ్మద్, శ్రీశైలంప్రాజెక్టు**

ప్ర మీరు జీవితాంతం నటిగానే మీ జీవితాన్ని కొనసాగిస్తారా?

జ అంతా మనసనుకున్నట్లే జరుగుతుందా?

**ఎం సికిందర్, కర్నూలు**

ప్ర చట్టం, న్యాయం, ధర్మం – ఇందులో ఏది గొప్పది?

జ : చట్టబద్ధంగా, న్యాయానికి తలవంచి, ధర్మంగా బతకడం గొప్పది

**చందు రమేష్‌బాబు, చదలవాడ**

ప్ర : కుమారి భానుప్రియ శ్రీమతి భానుప్రియగా ఎప్పుడు మారుతుంది?

జ వివాహమయ్యాక

## ఉత్తమ ప్రశ్న

**సరస్వతి, వెంకటగిరి**

ప్ర వరకట్నాల రాక్షసి నుంచి స్త్రీ జాతికి విముక్తి ఉంటుందా? ఉంటే ఎప్పుడు?

జ : మీ లాంటి యువతులు తిరగబడినప్పుడు

**ఎస్. మెహబూబ్ భాషా, మచిలీపట్నం**

ప్ర : బానుగారూ! డబ్బున్న వాళ్ళు కూడా డబ్బునే కోరుకుంటారు. మరి డబ్బులేని వాళ్ళు దేన్ని కోరుకుంటారు?

జ : వాళ్ళు కూడా డబ్బునే!

**ఎన్ సత్యశాయి శ్రీనివాసరావు, కడప**

ప్ర భానుప్రియగారూ! చలన చిత్ర రంగంలో నాట్యం ఎంత వరకు ఉపయోగపడుతుందో వివరిస్తారా?

జ చాలా వరకు

**ఇనుగంటి శ్రీనివాసరావు, బొబ్బిలి**

ప్ర : అక్కా! వరకట్న దురాచారాన్ని సమూలంగా నాశనం చేయాలని కంకణం కట్టుకున్న వారికి మీ సలహా?

జ సాదించే వరకు విశ్రమించవద్దని

**జె ఉమామహేష్, ఖరగ్‌పూర్**

ప్ర ప్రియగారూ! జీవితంలో పవిత్రమైనది ప్రేమ మరి, వివాహం?

జ అది పవిత్రమైన బంధం

**బి అశోక్ కుమార్, పాట్నా**

ప్ర మీరు హిందీ చిత్రాల్లో నటిస్తున్నారు కదా? మీకు హిందీ వచ్చునా?

జ జీఁహాఁ

**టి. సుందరమ్మ, రైల్వే కొండాపురం**

ప్ర అక్కయ్యగారూ! మీరు ఎంత వరకు చదువుకున్నారు? మీ హాబీ ఏమిటి?

జ మెట్రిక్ వరకు నా హాబీ నృత్యం

**సి ఎం ప్రసాద్, పుంగనూరు**

ప్ర మిస్ బానుప్రియగారూ! లక్షలు విలువ చేసే మీ కాలాన్ని మాలాంటి వారు పంపిచ్చు ప్రశ్నలకు సమాధానాలిస్తూ కూర్చోవడం మీకు వృధా అనిపించడం లేదూ?

జ మిస్టర్! లక్షలు విలువ చేసే నా కాలాన్ని కోట్లు విలువ చేసే మీ ప్రశ్నలకు సమాధానాలివ్వడం వృదా అనిపించడం లేదు

**జి నాగేందర్, వికారాబాద్**

ప్ర నేటి సమాజంలో స్త్రీకి నిజమైన స్వాతంత్ర్యం ఎప్పుడు వస్తుందంటారు?

జ మీ లాంటి వాళ్ళందరూ నిజాయితీతో ఆలోచించినప్పుడే ☐

కూపన్

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## భానుప్రియ సమాధానాలు

ప్రశ్న : ______________________________

______________________________

______________________________

పంపిన వారి పేరు ______________________________

పూర్తి చిరునామా ______________________________

______________________________



"త్రిమూర్తులు" చిత్రంలో ఓపాట సన్నివేశంలో సమర్పకులు టి. సుబ్బరామి రెడ్డితో విజయనిర్మల. హీరో కృష్ణ. బానుప్రి ...వై విజయ, అనూ

# "త్రిమూర్తులు" విదేశాల

నాకు మాట్లాడడం రాదు నిజానికి ఈ చిత్రం కథకంటే కథనం గొప్పది ఇలాంటి సినిమాలు తియ్యడానికి ఓర్పు చాలా అవసరం నా ఓర్పుని పరీక్షిస్తోంది యీ చిత్రం ప్రతిరోజూ ప్రతి షూటింగూ ఓ పెద్ద సాహసయాత్రలాగా వుంది

గోపాలరెడ్డిగారు మిగతా టెక్నీషియన్స్ నాకు పంచప్రాణాలై నన్ను ముందుకు నడిపిస్తున్నారు ఓ కొత్త బొమ్మ గీయడం చిత్రకళ ఒకరు గీసిన బొమ్మలాగా మళ్ళీ గీయడం ఓ సర్కస్ మేం చేస్తున్న సర్కస్ జనానికి నచ్చాలి అందుకే ఈకృషి – అన్నారు దర్శకుడు శ్రీ కె మురళీమోహన రావు

## షూటింగ్ విశేషాలు

బ్యాంగ్‌కాక్‌లో హాంకాంగ్‌లో పాటలూ యాక్షన్ సన్నివేశాలూ చిత్రీకరించారు బ్యాంగ్‌కాక్‌లో పట్టయ్యా బీచ్ బౌద్ధ ఆరామాలలో పాట చిత్రీకరణ జరిగింది జేమ్స్‌బాండ్ చిత్రం మ్యాన్ విత్ గోల్డెన్ గన్ చిత్రీకరించిన పుకెట్‌దీవి లో షూటింగ్ చేశారు బ్యాంగ్‌కాక్ నుంచి విమానంలో 1300 కిలో మీటర్లు దూరంలో వున్న పుకెట్ సిటీకి వెళ్ళి అక్కడినించి 84 కిలో మీటర్లు కారులో ప్రయాణం చేసి అక్కడి నుంచి పడవలో పుకెట్ ద్వీపం వెళ్ళి వెంకటేష్ శోభనలతో ఓ పాటలో కొంత భాగం తీశారు ఒక్క రోజులో 2600 కిలోమీటర్ల ప్రయాణం చేసి తీసిన ఈ పాటలో నీళ్ళ మీద నడిచే స్కూటర్ బోటుమీద ఎగిరే పారాచూట్ వాడడం జరిగింది 100 కిలోమీటర్ల వేగంతో నడిచే బోటు మీద వెంకటేష్ దానిపైన ఎగిరే పారాచూట్

ప్రస్తుతం నటీనటుల టెక్నీషియన్స్ బిజీ చూస్తూ వుంటే పక్క వూరు వెళ్ళి షూటింగ్ చెయ్యాలంటేనే కష్టంగా వుంది విదేశాలకు వెళ్ళి షూటింగ్ చెయ్యడం అన్నది కేవలం డబ్బుతో కూడుకున్న పనికాదు హీరో మొదలు బోయ్ వరకూ పాస్ పోర్టులూ వీసాలు కావాలి ఫారిన్ కరెన్సీ కావాలి వీళ్ళందరూ అక్కడ దిగి పని చెయ్యడానికి సౌకర్యాలు కలిగించాలి మా సుబ్బరామిరెడ్డిగారు నేనూ మా చిత్రం విదేశాలలో తీస్తున్నాం అని మొదటి రోజు చెప్పేశాం కానీ బయలుదేరే వరకూ ఒకే సస్పెన్స్ మొదట్లో హాంకాంగ్ ఒక్కటే అనుకున్నాం కానీ తర్వాత మా రెడ్డిగారు బ్యాంగ్‌కాక్ కూడా వెళ్ళాలి అన్నారు బ్యాంగ్‌కాక్ వెళ్ళాలంటే వీసాలు వుండాలి అదో యజ్ఞం బొంబే టూ బ్యాంగ్‌కాక్ బ్యాంగ్‌కాక్ టూ హాంకాంగ్ ఇదీ ప్లాను ముగ్గురు హీరోలు ముగ్గురు హీరోయిన్స్‌తో పాటు టెక్నీషియన్స్ అందరూ కావాలి వారుగాకుండా స్టంట్‌మాన్‌లు చాలామంది కావాలి మొత్తం మీద అందరం కలిసి ఫిబ్రవరి 12న బయలుదేరి మార్చి ఒకటి వరకూ అక్కడే వుండి పని పూర్తి చేసుకొని హాయిగా బయటపడ్డాం ఇది ఏ ఒక్కరి ప్రతిభాకాదు మా యూనిట్‌లో ప్రతిఒక్కరూ యీ చిత్రానికి నిర్మాతగా భావించి పని చేశారు ఉదయం ఏడు గంటలు మొదలు అర్ధరాత్రి రెండు గంటల వరకూ రెండు యూనిట్లతో యీ పని చెయ్యగలిగాం శ్రమ ఎక్కువైనా అనుకున్న పని పూర్తి అయినందుకు నాకు చాలా ఆనందంగా వుంది మా రెడ్డిగారికి దైవశక్తి వుంది నాకు నా యూనిట్ ఇచ్చిన శక్తి వుంది మా చిత్రం విదేశాలలో షూటింగ్ పూర్తి అయింది రేపు చిత్రం విడుదలయిన తర్వాత మీ అందరికీ యీ చిత్రం నచ్చినప్పుడు మా కృషి శ్రమ ఫలిస్తాయి – అన్నారు త్రిమూర్తులు నిర్మాతలలో ఒకరైన శ్రీ పి శశిభూషణ్

హిందీ చిత్రం నసీబ్ కథ కొన్నప్పుడు చాలామంది నన్ను నిరుత్సాహ పరిచారు ఆ హిందీ చిత్రం ముఖ్యంగా మన్‌మోహన్ దేశాయ్ చిత్రం తిరిగి తీయడం కష్టసాధ్యం అని హితవు చెప్పారు మరి కొందరు నువ్వు తియ్యలేవు అని సవాల్ చేశారు వారు చేసిన సవాల్ నాలో ఉత్సాహాన్ని కలిగించింది ఆ ఉత్సాహంతోనే ఈ చిత్రం తీస్తున్నాను డబ్బు ఎక్కువ ఖర్చు చేస్తున్నాను అనే విమర్శ ఉంది ఇలాంటి సాహసాలు చేసేటప్పుడు డబ్బు ఖర్చుకు వెనుకాడడం మంచిదికాదు కృషి శ్రమ మనది ఫలితం ఇచ్చేది ఆ సర్వేశ్వరుడు అన్నారు చిత్రం సమర్పిస్తున్న శ్రీ టి సుబ్బరామిరెడ్డి

గుండమ్మగారి కృష్ణులు' లో రజని





యి, బాలకృష్ణ చిరంజీవి, కృష్ణంరాజు, శోభన్‌బాబు విజయశాంతి, వెంకటేష్, రాదిక, రాధ, నాగార్జున, సుమలత, శారద, జయమాలిని

# లో షూటింగ్ విశేషాలు

పట్టుకొని కెమెరామన్ గోపాలరెడ్డి ఈ పాట చిత్రీకరించారు

హాంకాంగ్‌లో ఓ చోట శోభన– వెంకటేష్‌ల పాట చిత్రీకరిస్తే మరోచోట అర్జున్ ఫైట్స్ చిత్రీకరించడం జరిగింది ఇది గాకుండా రాత్రివేళ హాంకాంగ్ వీధులలో టాపులేని డబుల్ డెక్కర్ బస్ మీద ప్రయాణం చేస్తూ కొన్ని ఫైట్స్ చిత్రీకరించారు

అదే విధంగా– రాజేంద్రప్రసాద్ అశ్వనిల పాట ఒకచోట చిత్రీకరించి చైనీస్ జూడో ఫైటర్స్‌తో అర్జున్ బోటుమీద చేసే పోరాటాలు మరోచోట చిత్రీకరించారు

15 మంది చైనా నర్తకీమణులను రకరకాల డ్రస్సులతో కుష్బూ అర్జున్‌లకు 14 రకాల దుస్తుల మార్పుతో ఒక పాట చిత్రీకరించారు

## మంచినీళ్ల సీసా ఒక డాలర్

హైదరాబాద్‌లో రోజు విడిచి రోజు నీళ్లు వస్తాయి హాంకాంగ్‌లో మంచినీళ్లు అసలు దొరకవు కొనుక్కోవాలి సీసా ఒక డాలర్ అదే హోటలీలో అయితే ఆ సీసా ఖరీదు ఆరు డాలర్లు వాళ్లకి మంచినీళ్లు చైనా నుంచి వస్తాయట అని చెప్పారు శ్రీ గారపాటి జగన్మోహన రావు

## త్రిమూర్తులు తెరమీద

వెంకటేష్ అర్జున్ రాజేంద్రప్రసాద్ శోభన కుష్బూ అశ్విని రావుగోపాలరావు సత్యనారాయణ అల్లు రామలింగయ్య సుధాకర్ బాలాజీ నూతన్‌ప్రసాద్ రాంజీ వీరభద్రరావు, రాళ్లపల్లి దమ్ కె కె శర్మ సుమిత్ర కె. విజయ, మమత అనిత అనుపమ్‌ఖేర్

## 'త్రిమూర్తులు' తెర వెనుక

మాటలు పరుచూరి సోదరులు కెమెరా: గోపాల రెడ్డి సంగీతం బప్పీలహరి కూర్పు నరసింహారావు, కళ భాస్కరరాజు ఫైట్స్ విజయన్ నృత్యాలు: శీను, ప్రొడక్షన్ ఆర్ పద్మనాభన్ ప్రెస్ పబ్లిసిటీ: గీతా, విదేశాల్లో షూటింగ్ నిర్వహణ పేకేటి శివరాం, దర్శకత్వం కె మురళీమోహన్‌రావు నిర్మాత: పి. శశిభూషణ్ సమర్పణ టి సుబ్బరామిరెడ్డి.

నవయుగ ద్వారా యీ చిత్రం జూన్ మొదటి వారంలో విడుదల కానున్నది

## అందాల అగ్రతారలు పాల్గొన్న ఓ పాట

మార్చి 22 23 24 25 తేదీలలో వాహినీలో ఒక భారీ సెట్టింగులో ఒకేబాట ఒకేమాట అనే పాట చిత్రీకరించారు

ఈ పాట చిత్రంలో వెంకటేష్ పాడతారు. ఒక అవార్డు ఉత్సవంలో హీరో పాడినట్లుగా చిత్రీకరించే ఈ సన్నివేశంలో అభిమాన తారలంతా పాల్గొనడం ఒక విశేషం– ఈ పాటను మూడు కెమెరాలతో చిత్రీకరించడం మరో విశేషం

## పాటలో పాల్గొన్న హేమా హేమీలు!! మిలమిల మెరిసిన తారామణులు!!!

జంటగా పాల్గొన్న వారు విజయనిర్మల- కృష్ణ, శోభన్‌బాబు- విజయశాంతి శారద పరుచూరి బ్రదర్స్ భానుప్రియ బాలకృష్ణ రాధ కృష్ణంరాజు, చిరంజీవి రాధిక నాగార్జున సుమలత, చంద్రమోహన్- జయమాలిని, స్మిత, అనూరాధ, మారుతీరావు- వై. విజయ, మురళీమోహన్, పద్మనాభం, మరియు దర్శకులు కోదండరామిరెడ్డి, కోడి రామకృష్ణ మొదలైన వారంతా వెంకటేష్‌తో కలిసి పాడిన ఈ పాటను ఒక చలనచిత్ర అవార్డు ఉత్సవంలా చిత్రంలో చిత్రీకరించారు.

పరిశ్రమలో అపూర్వం అయిన ఈ సన్నివేశాన్ని మూడు కెమెరాలతో గోపాలరెడ్డి, నవకాంత్, సీను చిత్రీకరించారు.

–సుధ

ఈ ప్రకటన మహిళలను విశేషంగా ఆకర్షిస్తుందనుకుంటున్నాం!

ప్రేమ

మహిళలకు గమనిక:

చెప్పబడును!!



"ముద్దాయి"లో కృష్ణ, రాధ

# సినిమా విశేషాలు

జి.వి.జి.

## విజయనిర్మల దర్శకత్వంలో విజయకృష్ణా మూవీస్ రెండు చిత్రాలు

"జూన్ 1 న సెట్స్‌కు వెళ్ళే చిత్రంలో మా నరేష్ హీరో. అతని అక్క కలెక్టర్‌గా నేను నటిస్తాను. ఒకే షెడ్యూల్లో జూన్ 30కి షూటింగ్ పూర్తవుతుంది. పాటలను ఊటీలో ఎక్స్‌రైజ్ చేస్తాం" అన్నారు విజయనిర్మల. ఆమె స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో ఎస్. రమా ఎంద్ నిర్మించె చిత్రంలో ప్రభాకరరెడ్డి, గిరిబాబు, కోట శ్రీనివాసరావు, రంగనాథ్, కాంతారావు, వేలు, జె. వి. సోమయాజులు, త్రినాథ్, అరుణ, అన్నపూర్ణ, జయవిజయ తదితరులు పాత్రధారులు. గిరిజశ్రీ భగవాన్ కథ, కొండముది శ్రీరామచంద్రమూర్తి మాటలు, రాజ్ కోటి సంగీతం, పుష్పాల గోపీకృష్ణ ఛాయ. శీను నృత్యాలు, సూపర్ సుబ్బరాయన్ సాహసాలు, అదుర్తి హరనాథ్ కూర్పు. ఎస్. రవికుమార్ నిర్వహణతో ఎస్. రఘునాథ్ సహ నిర్మాత.

ఆగస్టులో అంకురార్పణ జరిగే విజయ కృష్ణా మూవీస్ 14 వ చిత్రం "రుద్ర తాండవం"లో కృష్ణ హీరో. ఓ సుప్రసిద్ధ తార నాయికగా నటిస్తుంది. సత్యనారాయణ, కోట శ్రీనివాసరావు, జె. వి. సోమయాజులు, గిరిబాబు, ప్రభాకరరెడ్డి, గుమ్మడి, కన్నడ ప్రభాకర్, అంజలీదేవి, అన్నపూర్ణ, బేబీ శాలిని ఇతర నటవర్గం. "గిరిజశ్రీ భగవాన్ నవల 'రుద్రతాండవం' ఆధారం," అని తెలిపారు.

## కృష్ణ "చుట్టాలబ్బాయి"గా రామలింగేశ్వరరావు చిత్రం

"జూన్‌లో పాటలు రికార్డవుతాయి. జూలైలో షూటింగ్ ప్రారంభించి, సెప్టెంబర్‌లో పూర్తి చేస్తాం," అన్నారు ఎస్. రామలింగేశ్వరరావు. ఈయన నిర్మించే రాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి ఈ చిత్రంలో కృష్ణ సరసన సుహాసిని నాయిక. కోడి రామకృష్ణ దర్శకత్వంలో నందిగం దేవీప్రసాద్ సమర్పణ.



"విజేత విక్రమ్"లో వెంకటేష్, షెరా

## 'అక్షింతలు లో అసహాయురాలు

గోపి (కల్యాణ చక్రవర్తి) కారు దిగి లోనికి వస్తూ, లలిత (పూర్ణిమ)ను చూసి దిగ్భ్రాంతి చెందాడు. సోఫాలో కూర్చొనున్న ప్రభంజనరావు (గొల్లపూడి) రా అల్లుడూ! అంటూ పలకరించాడు గోపీ దృష్టి ఇంకా లలిత మీదే ఉంది అది గమనించిన ప్రభంజనరావు ఆవిడ కొత్తగా పనిలో చేరింది. పేరు లలిత పాపం! భర్త వొదిలేశాడట పసిబిడ్డను భుజాన వేసుకుని పని కోసం తిరిగి తిరిగి అల్లాడి పోతూంటే ప్రియను చూసుకుంటూ ఉంటుందిలే - అని ఇక్కడే ఉండి పొమ్మన్నాను మనమిందరం ఏం చెప్పినా వినని ప్రియ ఆ అమ్మాయి చెప్పిందంతా మంత్రం వేసినట్టు చేసేస్తోంది అన్నాడు

అయితే ఈ ఇంట్లో ఇక నాకు ఏం పనుంది, మామయ్యా! అన్నాడు గోపి

లలిత గుండెలు గుభేల్‌మన్నాయి

అమ్మాయిని చూసుకోడానికేనా నన్ను తీసుకొచ్చారు? అంటే నా మీద నమ్మకం పోయిందన్న మాట! అంతేగా? ఈ కాలం ఆడవాళ్ళ దగ్గర మంచితనం ఉంటుందనుకోవడం భ్రమే అవుతుంది అన్నాడు గోపి

మీ ఆవిడ ప్రియగారిని వీలైనంత బాగా చూసుకుంటాను నాలుగు రోజులు చూసి నచ్చకపోతే మీరే బయటకు పంపించేయండి లలిత ఎంతో దీనంగా.



గాంధీనగర్ రెండవ వీధి లో ఒక దృశ్యం

గోపి బరువుగా నిట్టూర్చాడు

కె వి వి సత్యనారాయణ సమర్పించే సత్యా మూవీ క్రియేషన్స్ వారి అక్షింతలు చిత్రంలో రమ్యకృష్ణ రాళ్ళపల్లి నగేష్ రాజా శుభలేఖ సుధాకర్ రాజ్యలక్ష్మి ఉమ మణిమాల రతిష్ తక్కిన నటవర్గం సుదర్శన్ బట్టాచార్య మాటలు జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు గీతాలు రాశారు కె వి మహదేవన్ స్వరకల్పనలో ఆత్రేయ వేటూరి కె రామ్మోహనరావు నిర్మించిన ఈ నవరసభరితమైన చిత్రానికి మౌళి కథ స్క్రీన్‌ప్లే సమకూర్చి దర్శకత్వం నెరపారు



# బైద్యనాథ్ ...............

## ఇద్దరికీ ఆరోగ్యము మరియు పెరుగుదల కొరకై

జీవితమంతా

మీరు భాగస్వాములు కనుక

మీరు శ్రద్ధవహిస్తారు కనుక

మీరు ఒకరికి మరియొకరు
ఆనందముగా ఉండుటకు
శ్రద్ధ తీసుకుంటారు.

మీకు శక్తిని, బలమును కలుగచేసి
రోజు రోజుకు సంవత్సరముల తరబడి
విటా-ఎక్స్ మిమ్ములను కాపాడును

స్త్రీ పురుషులకు బలవర్ధకమైన ఔషధము



## బైద్యనాథ్ విటా-ఎక్స్

## మొటిమలా?

మొటిమలు, మచ్చలు, ఉడుకు పొక్కులు మరియు
చర్మరోగములకు ఆదర్శమైన నివారిణి
మంచి రక్తశుద్ధికరము, చర్మమును పరిశుద్ధముగా
ఉంచును,






## బైద్యనాథ్ సురక్తా స్ట్రాంగ్

రక్తమును శుద్ధి చేయును. చర్మమును నిర్మలముగా ఉంచును



మామూలు పండ్లపొడే కాదు ఔషధము కూడా దంతక్షయము మరియు చిగుళ్ళ
వ్యాధులకు అత్యవసరమైన నివారిణి ఆరోగ్యకరమైన దంతములు బలమైన
చిగుళ్ళు ఆరోగ్యముగా చింతలు లేకుండా ఉంచును.

బైద్యనాథ్ ఎర్ర పండ్లపొడి మాత్రమే ఈ పనిచేయును

## బైద్యనాథ్ ఆయుర్వేద పండ్లపొడి

B3P 97T

## నందమూరి త్రివిక్రమరావు సమర్పణలో "రౌడీ బాబాయ్"

"ఒక స్థితిలో ఎవరికి ఎవరూ భయపడరనే నగ్నసత్యం ఆధారంగా రూపొందించబడిన కథ. 1945 లో చైనాలో జరిగిన లాంగ్ మార్చ్ ప్రేరణగా పతాక సన్నివేశాలను మద్రాసుకు 20 కిలో మీటర్ల దూరంలోని కోవూరులో అధిక వ్యయ ప్రయాసల కోర్చి చిత్రీకరించాం," అన్నారు సత్యారెడ్డి. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో తాళ్ళూరి కృష్ణ సుందరరావు నిర్మిస్తున్న కృష్ణా సినీ క్రియేషన్స్ వారి పై చిత్రంలో కల్యాణ చక్రవర్తి, అశ్విని, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, నాగేష్, మాడా, వై. విజయ, శ్రీలక్ష్మి, మమత, కల్పనారాయ్, బేబీ శాలిని, అశోక్‌కుమార్, ప్రకాష్‌రెడ్డి, బెనర్జీ పాత్రధారులు. గణేష్‌పాత్రో సంభాషణలు. ఆత్రేయ – వెన్నెలకంటి గీతాలు, రాజ్– కోటి సంగీతం, పి. లక్ష్మణ్ ఛాయ, కుదరవల్లి నాగేశ్వరరావు శిల్పం, ప్రకాష్ నృత్యాలు, హార్స్‌మన్‌బాబు సాహసాలు, పి. రామారావు నిర్వహణ, బెనర్జీ కూర్పుతో వేమూరి రామయ్య ప్రొడక్షన్ కంట్రోలర్. నందమూరి త్రివిక్రమరావు సమర్పణ.

## త్వరలో "ఇదా ప్రపంచం"

"రైల్వే స్టేషన్ బాక్‌డ్రాప్‌గా, వివిధ మనఃప్రవృత్తులు గల వ్యక్తులతో నేటి ప్రపంచం ఎలా పరిభ్రమిస్తుందో, నేటి సమాజంలో అన్యాయాలకు, అక్రమాలకు వంచితులయ్యే సామాన్యుడి ఆవేదనకు సజీవరూపకల్పన. ఎం. వి. ఎస్. హరనాథరావు నవల 'అరణ్యరోదన' ఆధారంగా ఫిబ్రవరి 15 నుంచి మార్చి 21 వరకు విజయవాడ, మంగళగిరి ప్రాంతాలలో ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తి చేశాం. ఆవేశపరుడైనా కొన్ని బాధ్యతల మూలంగా ఆవేశాన్ని అణగదొక్కుకునే పాత్రలో డాక్టర్ రాజశేఖర్, అన్యాయాలను ప్రతిఘటించే పాత్రలో శివకృష్ణ, కాలానుగుణంగా పరిస్థితులను బట్టి మెలగాలనే ఇన్‌స్పెక్టర్ పాత్రలో శరత్‌బాబు, పరిస్థితుల ప్రాబల్యం వల్ల సంఘం చేత పిచ్చిదని పించుకున్న పాత్రలో సరిత పోటీలు పడి నటించారు," అన్నారు ముత్యాల సుబ్బయ్య. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ప్రముఖ పంపిణీ దారుడు వై. హరికృష్ణ సమర్పించే పై చిత్రంలో జీవిత, వేలు, చంద్రు, సాక్షి రంగారావు, సాయికుమార్, వెంకట్రావ్, నర్రా, రమణారెడ్డి, గరగ, చిట్టిబాబు, ప్రసాద్, శ్రీదుర్గ, అన్నపూర్ణ, మమత ఇతర నటవర్గం. ఎం. వి. ఎస్. హరనాథరావు రచయిత. ఆత్రేయ, సి. నారాయణరెడ్డి, జాలాది, వంగపండు, వెన్నెలకంటి గీతాలకు చక్రవర్తి బాణీలు కూర్చారు. ఆర్. రామారావు ఛాయ, సోమనాథ్ శిల్పం, యోగి సంయుక్త దర్శకత్వం, సురేఖా – ప్రకాష్ నృత్యాలు, వై. మోహనప్రసాద్ ప్రొడక్షన్, వై చిన్నబ్బాయి నిర్వహణతో వై. అనిల్‌బాబు నిర్మాత ☐






(గత సంచిక తరువాయి)

తరువాత చదివిన పద్యం ఎంతో గొప్పగా ఉంది ఆ పద్యం చదివింది హరిశ్చంద్రుడు కాదు– అది చంద్రమతిది ఆ పద్యమంటే నేను చెవులు కోసుకుంటాను ఇలా చదువుతే బాగుండునను కుంటాను– నేనా విధంగా చదవడానికి ప్రయత్నిస్తాను ఆ పద్యం ఒక్కరే నేననుకున్న విధంగా చదవగలరు మరెవరూ చదవలేరు ఈ మగ అక్టరు ఎంత గొప్పవాడు కాకపోతే చంద్రమతి చదవ వలసిన పద్యం అంత దివ్యంగా చదవగలడు?

జలదమా!

నా కరచరణాలలో చలనంలేదు శరీరమంతా మనసయి పంచేంద్రియాలు శ్రవణేంద్రియంలో కలిసి పోయాయి అతడీ పద్యం చదువుతాడని నేను కలలో కూడా అనుకోలేదు

సుంతమార్పలికిన దోసమా!

నా హృదయంలోని వీణ తీగలను సుకుమారమైన మూర్ఛనలతో ప్రకంపింప జేస్తున్నది ఆ లలితలలిత మైన కంఠం

ఆ పద్యం పూర్తయే సరికి నేను ఎక్కడున్నానో మరచి పోయాను

కళ్ళనుండి ధారగా కారుతున్న నీళ్ళను రుమాలుతో తుడుచుకొని డగ్గుత్తికతో అన్నాను:

నాగభూషణం గారూ! నమస్కారాలు!

అతనా మాటలు విని ఈ లోకంలోకి వచ్చాడు కూర్చున్న వాడల్లా ఒక్కసారి లేచాడు ఎదురుగా వయసులో వున్న ఆడపిల్లను చూసి కంగారు

జరిగిన కథ –5 : నాగభూషణం రాజశేఖరం ఒక నాటకం సందర్భంగా మిత్రులవుతారు నాగభూషణానికి వాక్శుద్ధి నేర్పి మంచి నటుడిగా రాణింప జేస్తాడు రాజశేఖరం నాగరత్నం ప్రోత్సాహం మీద రాజశేఖరం కూడ నటుడవుతాడు నాగభూషణం అనారోగ్యం గురించి తెలిసి రాజశేఖరం అక్కడికి వెళ్తాడు నాగభూషణానికి రాజశేఖరం రాగలత వంతుల వారీగా సేవ చేస్తుంటారు రాగలత వ్రాస్తున్న అనుభవాల కథనాన్ని రాజశేఖరం చదువుతాడు

పడ్డట్టున్నాడు

అయ్యా! నాగభూషణంగారూ! ఇంతవరకూ మీ గురించి వినడమేకాని మిమ్మల్ని చూసే భాగ్యం కలగలేదు ఈ రోజు మిమ్మల్ని చూడడమే కాకుండా మీ పద్యాలని వినే అదృష్టం కలిగింది

నా ఎదుట మనిషి బెల్లం కొట్టిన రాయిలా ఏమీ మాట్లాడడు నా ముఖంలోకి చూస్తూ ఉండి పోయాడు అతని చూపులలో నా చూపులు కలిశాయని తెలుసుకోడానికి మరో పదినిమిషాలయింది బహుశా యిద్దరం కూడా ఆస్థితి లోనే ఉండేవాళ్ళమేమో ఆ పడుకున్న ఆయన కదిలిరాకపోతే!

ఓహో ఎవరా వచ్చినవారు?

నేనప్పుడు లోకంలోకి వచ్చాను

నేను రాగలతను అన్నాను

రాగలతా? ఆ వచ్చినాయన ప్రశ్నార్థకంగా పద్యాలు చదివిన మనిషి వేపు చూశాడు

రాగలతంటే రతీదేవి అన్నాడు పద్యాలు చదివిన అతను

మా అమ్మ నా పేరుకి అర్థం చెప్పింది తరువాత ఎవరూ నా పేరుకి అర్థమేమిటని అడగలేదు చాల మందికి నా పేరుకి రతీదేవి అన్న అర్థముందని తెలియదు ఎవరూ ఆ సందేహం కూడా వెలిబుచ్చలేదు

లేచి వచ్చిన ఆయన జలతారు కండువా బనీను మీంచి కప్పుకున్నాడు

మీ కెవరు కావాలి? ఆయనే ప్రశ్నించాడు

నటరత్న నాగభూషణం గారు

ఓహో అదా సంగతి! ఓ కన్యారత్నమా! నువ్వు వెతుక్కుని వచ్చిన నటరత్న నాగభూషణం వీడని తెలుసుకో!

అతను కండువా సర్దుకొని నిలబడ్డాడు

మరి వీరెవరు? పద్యాలు చదివిన అతన్ని చూపించి అడిగాను

వీడా! వీడు నా శిష్యుడు ఇంకా చెప్పాలంటే శిష్యుడికి శిష్యుడు ఈ పిల్లకాకికి బిరుదులు పొందిన నాగభూషణానికి సాటా?

మరి చాల చక్కగా పద్యాలు చదివారు! అన్నాను నేను

అది సహవాసదోషం అన్నాడు నాగభూషణం

మామూలు చెక్క పేడుంటుంది దానిని మంచి గందం చెక్క దగ్గిరుంచుతే దాని వాసన అంటుతుంది అలా చెప్తే ఇంకా బాగుంటుందేమో? అన్నాడు పద్యాలు చదివిన అతను

నాగభూషణం నవ్వాడు

సరో నువ్వు పోయి కాఫీలకు ఏర్పాటుచెయ్యి! రాగలతా! ఇక్కడ కూర్చో! నీ వచ్చిన పనిగురించి మాట్లాడదాం

పద్యాలు చదివిన అతను వెళ్ళిపోతుంటే కళ్ళప్పగించి చూస్తున్నాను అతని మాటలు కూడా ఎంత చక్కగా ఉన్నాయి– శిష్యుడికి శిష్యుడే ఇంత గొప్ప వాడయితే మరి గురువు గారు?

నేను వచ్చిన పని అతనికి చెప్పాను

మీరు చాల గొప్ప పేరున్నవాళ్ళు మీ సరసన నటించడానికి అనుభవమున్న నటీమణులు కావాలి మేమందరం విద్యార్ధినులం మాకు రంగస్థలమంటే ఇంకా కొత్తే నాలుగయిదు నాటకాలు వేస్తే అయిపోతుందా? కాలేజీతో నాకున్న సంబంధం అయిపోతుంది అయిదు సంవత్సరాలుగా నేను కల్చరల్ అసోసియేషన్‌కి సెక్రెటరీగా ఉండి చాల మార్పులు చేశాను ఇది అన్నిటి కన్న పెద్ద మార్పు కాలేజీ చరిత్రలో ఇదొకమరువరాని ఘట్టంగా ఉండిపోవాలి

నాగభూషణం వింటున్నాడు ఏవీ ప్రశ్నలు వెయ్యలేదు

దీనికి ఆహూతులైన వారు పలు రకాలైన వారు– జిల్లా జడ్జీలు లాయర్లు డాక్టర్లు సంపన్నులు వ్యాపారులు పండితులు పామరులు చిన్నవాళ్ళు పెద్దవాళ్ళు అందరినీ రంజింప జేయడం మా బోంట్లకు సాధ్యం కానిది మీకు నాటక రంగంలో ఆంధ్రదేశమంతటి లోను వ్యాపించిన పేరుంది మీ కీర్తి ప్రతిష్ఠల క్రింద మేము తలదాచుకుంటాము

నాగభూషణం నా మాటలు చాల శ్రద్ధగా వింటున్నాడు

అందరికీ అంత బాధ్యతలేదు నాకు సెక్రెటరీగా కాక మీ సరసన శకుంతలగా నటించవలసిన అవసరం ఉంది అందుకోసమే నేను చాల భయపడుతున్నాను ఒకప్పుడు నా నటనలో లోపాలు కనిపిస్తాయి వాటిని మీరు సహించాలి అదే నా మనవి

నాగభూషణం నవ్వి నా ముఖంలోకి చూచాడు

మీరు నాటకంలో వేషం వేయడానికి వేయి రూపాయలు పుచ్చుకుంటారని తెలిసింది హరిశ్చంద్ర వేషానికి రెండు వేలు తీసుకుంటారట మేము మీకు అంత డబ్బిచ్చుకోలేము మీ గౌరవానికి భంగం రాకుండా ఏదో చిన్న బహుమతి అందరిముందు చదివించుతాము దీనికి మీకు అభ్యంతరం లేదనుకుంటాను

నాగభూషణం ఒక్క పలుకైనా అడలేదు– పలుకే బంగారమాయెనా?

అంతేకాదు మీరు మీ అనుభవాల గురించి ఒక్క అరగంట ఉపన్యసించాలి అది సోదాహరణంగా ఉండాలి అంటే మీరు వేసిన నాటకాలలో ముఖ్యమైన సన్నివేశాలు పద్యాలు నటన – ఏవి మీరు ప్రేక్షకులకు అందజేయ దలచుకుంటే – వాటిని ఉదాహరణలుగా చెప్పాలి

నాగభూషణం నవ్వుతున్నాడు



## రాగలత

మీరాకవల్ల మాకాలేజీకి ఎలాను పేరువస్తుంది- మేము కూడా మాకు శక్తి ఉన్న మేరకు మీ గౌరవాన్ని పెంపొందించి మీ యశస్సుకు మరి కొంత చేర్చుతాము

నాగభూషణం నా ముఖంలోకి చూస్తున్నాడు- ఆ చూపులు నా హృదయం లోతుల వరకూ పోతున్నాయి

మౌనం అర్థాంగీకార మంటారు! మా నాటకం ఇంకా పదిరోజుల తరువాత వేస్తాము మీ అంగీకారం తెలిసిన తరువాత మిగిలిన వారిని కలిసి వారికి వీలయిన దినాలు చూసుకొని, నోటీసులు పంచి పెట్టాలి బహుశా మిమ్మల్ని మా ప్రిన్సిపాలు గారు కలిసి ఈ సంగతులన్నీ చెప్ప వలసింది వారు పరీక్షల హడావుడిలో ఉండి రాలేక పోయామని చెప్పమన్నారు

అపుడు నాగభూషణం కూర్చున్న వాడు లేచి నిలబడ్డాడు

రాగలతా! ఈ నాటకాల వ్యాపార మెటువంటిదంటే ఈరోజు పొగడుతారు రేపు మరచి పోతారు కాని నా పద్ధతివేరు ఒకసారి స్నేహం కలిసిన తరువాత కొంత కాలం మరచి పోలేను నేను కోరేది స్నేహం మాత్రమే

మే మిద్దరం మాట్లాడుతుంటే పద్యాలు చదివిన పెద్ద మనిషి రెండు కప్పులతో కాఫీలు పట్టుకొని కొంచెం దూరంలో నే నిలబడ్డాడు

చూడు! వాటినక్కడ బల్ల మీద పెట్టి అలా గోదావరి గట్టున తిరిగిరా! అన్నాడు నాగభూషణం

రెండవ అతను కాఫీ కప్పులు అక్కడుంచి వెళ్ళి పోయాడు

రాగలతా! నువ్వు చెప్పిన ప్రకారమే సోదాహరణమైన ఉపన్యాసం ఇస్తాను తరువాత దుష్యంతుడిగా నీ పక్కన నటిస్తాను నాకు మరి నాలుగు రోజులలో ఈ వూరిలో పని అయిపోతుంది మా ట్రూప్ వెళ్ళి పోతుంది నేనొక లాడ్జిలో బసచేస్తాను ఇది నా మనస్ఫూర్తిగా చేస్తున్నపని ఇంకొక ముఖ్య విషయం నీవంటి చక్కని అమ్మాయి నన్ను సాదరంగా ఆహ్వానిస్తే నేను డబ్బు పుచ్చుకుంటానా? మరేదో బహుమతిగా ఇస్తామన్నావు అది కూడా నా కవసరం లేదు మరో విషయం – నా లాడ్జి ఖర్చులు, భోజనం ఖర్చులు అవి కూడా మీ రేమి భరించనక్కరలేదు మీరు నోటీసులు వేయించే ముందు నాతో చెప్తే మీకు కొన్ని సలహాలిస్తాను

నాగభూషణం మాటలు చాల సంతోషాన్ని కలిగించాయి అతను అంత ఉదారంగా ఉంటాడని కలలో కూడా నేననుకోలేదు

నాలు గయిదు రోజుల్లో మేము రిహార్సల్సు మొదలు పెడతాము మా కాలేజీలో జరుగుతాయి సాయంకాలం వేళ మీకు ఎవరిదేనా స్టూడెంట్సు కారు గాని కాలేజి జీపుగాని పంపిస్తాము మీరు రావలసింది




రాగలతా! ఈ రిహార్సల్సు మీ బోటి వారికి- నేనటువంటి వాటికి రాను నా నటననాది దాని కనుగుణ్యంగా మీరందరూ నటించవలసిందే- దేనికేనా రాజీ పడతాను కాని ఇటువంటి విషయంలో నా నిర్ణయాన్ని కొంచెం కూడా సడలించలేను

నాగభూషణం చాల పెద్ద నటుడు ఏదో నాతో కొంచెం చనువుగా మాట్లాడుతున్నాడని అనుకోడం తప్పు అది గొప్ప వాళ్ళ లక్షణం

క్షమించండి! మీరు చెప్పినట్లే చేస్తాను మీ నియమాలను ఉల్లంఘించమని చెప్పడం లేదు- వాటిని గౌరవిస్తాము

అతని దగ్గిర సెలవు తీసుకొని వెళ్ళి పోయాను

నాటకం ఆడడంలో చాల సాధక బాధకాలున్నాయి అందులో ఆడపిల్లలు ఆడడంతో మరీ ఇబ్బందులు తలకెత్తుతాయి ఏదో విధంగా దుష్యంతుడు గారిని సంపాదించామనుకుంటే కణ్వపాత్రకు ఎవరూ దొరకలేదు దుష్యంతుడి పాత్ర ఎంత ముఖ్యమో ఈ కణ్వుడూ అంతే – నాలుగో అంకంలో అతడి పద్యాలే ముఖ్యం ఏ ఆడపిల్లా సరియైనది కుదరలేదు ఈ సమస్య గురించి ఆలోచిస్తుంటే నాగభూషణం గారి శిష్యుడు జ్ఞాపకానికి వచ్చాడు

మధ్యాహ్నం రిక్షా చేయించుకొని నాగభూషణం ఉన్న బసకి వెళ్ళాను అప్పుడే హోటలులో భోజనం చేసి గురుశిష్యులు వచ్చినట్లున్నారు

నాగభూషణం నన్ను చూడగానే శిష్యుడికేదో పని పురమాయిస్తున్నాడు

అయ్యా! నాగభూషణం గారూ! మీ శిష్యుడితో నే పనుంది మాటలయిన తరువాత అతనిని పంపించవచ్చు అన్నాను నేను దూరంనుండే

కాని నాగభూషణం నా మాటలు వినిపించు కోలేదు ఆ శిష్యుడిని ఎక్కడికో ఆయన పంపించాడు

రాగలతా? నీ కొచ్చిన యిబ్బందేదో చెప్తే నేను లక్షమంది శిష్యులను రప్పిస్తాను

మరేం కాదు మొన్న మీ శిష్యుడు శాకుంతలంలోని శ్లోకాలు పద్యాలు చదివారు మాకు కణ్వుడి పాత్రకి సరియైన మనిషి దొరకలేదు అతను వేస్తారేమో నని అడగడానికి వచ్చాను

రాగలతా! ఇది నా కిష్టంలేని పని మరెవరినేనా చూసుకోవలసింది

అతనంత నిష్కర్షగా చెప్పడంతో కొండంత ఉత్సాహం కుప్ప కూలి పోయింది

ఇంతకీ కణ్వుడిది ప్రధాన పాత్ర కాదు ఇంకెవరినో పిలుచుకు రావడం కన్న మీ శిష్యుడిని ఉపయోగిస్తే మీ గౌరవం యింకా పెరుగుతుందని నా అభిప్రాయం

రాగలతా! నేను నాశిష్యుడు వేసే నాటకంలో నటించను వాళ్ళు చేసే పొరపాట్లను నేను సహించలేను దయచేసి మరెవరినేనా చూసుకో!

నా ముఖం చిన్న బోయింది చూపులు నేలకు దించి అన్నాను-

మంచిది! నాకు సెలవియ్యండి!

ఆ మాటలు గొంతుకలోంచి రావడం కష్ట మయింది గది ద్వారం వేపు అడుగులు వేశాను- గది దాటకముందే నాగభూషణం నన్ను పిలిచాడు

రాగలతా!

వెనక్కు వెళ్ళాను

నీ ముఖం చిన్న బోయింది నీతో స్నేహం పెంచుకుందామని ప్రయత్నం చేస్తున్నాను స్నేహితుల పట్ల ఈ విధంగా ప్రవర్తించడం భావ్యం కాదు నేను మా శిష్యుడు వేషం వేయడానికి అంగీకరిస్తున్నాను కాని నా షరతుల మీద

నా ముఖం సంతోషంతో వెలిగింది

విను! మీరు కరపత్రాలు పంచుతారుకదా! వాటిలో నా కున్న బిరుదులన్నీ ఉల్లేఖన చేయాలి నేను నటించిన నాటకాల ప్రస్తావన రావాలి అంతేకాదు- నేను ఆరోజు ఉపన్యాసం కూడా యిస్తున్నట్లు వాటిలో రాయాలి

ఇది మొదటి షరతు దానికి అంగీకారం తెలుపుతూ తల ఊపాను

ఇక రెండో షరతు కణ్వపాత్ర ధారి పేరందులో ఉండకూడదు- కనీసం నాగభూషణం శిష్యుడని కూడా రాయకూడదు- కొత్తనటుడు అన్న మాట కన్న అధికంగా పేర్కొనకూడదు

అప్పటి వరకూ ఆ శిష్యనటుడి పేరు నాకు తెలియలేదు పేపరులో అచ్చు

●●ఇదుగో వచ్చింది! కొత్త వీల్
ఆకుపచ్చ బిళ్ల-
శక్తిగల డిటర్జంట్●●




కొత్త

# వీల్

ఇక మీదట, ఎవరిక్కావాలి సబ్బు? కొత్త వీల్ డిటర్జంట్ వచ్చిందిగా వీల్! ఎక్కువ బట్టల్ని ఉతుకుతుంది. సబ్బు కన్నా ఎక్కువ శక్తివంతంగా ఉతుకుతుంది. అయినా, వీల్ ధర సబ్బు కంటె తక్కువ!

**శుభ్రపరిచే శక్తి ఎక్కువ...**
**కాని ధర ఎక్కువ కాదు.**

ఎన్నిక చేసిన కొన్ని పట్టణాల్లోనే దొరుకుతుంది.

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS WL 192317 TL

## రాగలత

వేసే మిషతోనైనా తెలుసుకుందామంటే నాగభూషణం ఆ అవకాశం కూడా నాకివ్వలేదు ఇంకా మరో గొప్ప సంగతి నాగభూషణం ఆ శిష్యుడితో నేను కలియకుండా అన్ని జాగ్రత్తలు పడుతున్నాడు అదే నాకు అంతుపట్టలేదు

వార్షికోత్సవం చాల ఘనంగా జరిగింది చాల మంది పెద్ద వాళ్లను ఆహ్వానించాము విశాలంగా నున్న బహిఃప్రదేశంలో స్టేజి, ప్రేక్షకులకు కూర్చోడానికి సదుపాయాలు చేశాము

సభ సాయంకాలం ఆరు గంటలకు సంగా మొదలయింది అధ్యక్షుడి ఎన్నిక, ముఖ్యఅతిధి గారి ఉపన్యాసం అదే మన నాగభూషణంగారి ఉపన్యాసం సరియైన వేళకే మొదలుపెట్టాం నాగభూషణం ఒక గంట సేపు ఉపన్యసించాడు నాటకాలు, ఆంధ్రదేశంలో నాటకాల చరిత్ర, ఉత్తమ నటులు, తరుచు ఆడే తెలుగు నాటకాలు వీటి గురించి ఒక అరగంట వరకు చెప్పి, మిగిలిన అరగంటలో తన అనుభవాలు, తాను వేసే పాత్రలు తనకు నచ్చిన పద్యాలు చెప్పాడు సభ చాల నిశ్శబ్దంగా ఉంది అతనికి గల అపారమైన నాట్యశాస్త్రజ్ఞానానికి ప్రజలు ముగ్ధులయారు ఎంత గొప్పవాడు! అతని ఉపన్యాసం ముగిసిన పావు గంట వరకు చప్పట్లు కొడుతూనే ఉన్నారు

నాటకం సరిగా ఎనిమిదికి మొదలయింది

నాగభూషణంతో ఏ విధమైన ఇబ్బంది కలగలేదు - తన వేషం తనే వేసుకున్నాడు, రంగులు పులుముకోడం దగ్గిర నుండి - అతని శిష్యుడికి మేకప్‌మాన్ వేషం వేశాడు వాళ్ళిద్దరేమగాళ్ళు - మిగిలిన వేషాలన్నీ ఆడవాళ్లమే వేశాము

నాటకం అద్భుతంగా ఉందన్నారు

నాటకం అయిన వెంటనే పాత్రల పరిచయం జరిగింది ఒక్కొక్కరి గురించి చెప్తూ, చివరను కణ్వుడి గురించి చెప్పవలసి వచ్చినప్పుడు ఆ నాగభూషణం గారి శిష్యుడు మాయమయిపోయాడు అతని గురువుని అడిగితే, తొందరపని మీద ట్రయినులో వెళ్లిపోతున్నాడని చల్లగా చెప్పాడు

నామనసేం బాగులేదు

ఎందుచేత నంటారా?

నాగభూషణం చాల గొప్పగా నటించాడని ప్రేక్షకులు ప్రశంసించారు

శకుంతల వేషంలో నేను దివ్యంగా నటించానని మా లేడీ స్టూడెంట్లు అందరూ పొంగి పోయారు

కాని అందరూ ఏకగ్రీవంగా ఒక్కటే మాటన్నారు నాలుగో అంకంలో కణ్వుడు చదివిన నాలుగు పద్యాలేచాలు- నాటకానికవి ప్రాణమన్నారు

కాని మహానుబావుడు ఆ కణ్వుడెందుకు మాయమయాడు?

* * * * * * *

రాజమహేంద్రవరంలో మా యిల్లు గోదావరి స్టేషనుకు కొద్ది దూరంలో ఉంది నా గది మేడ మీద ఉంది కిటికీలోంచి చూస్తుంటే దగ్గిరలో నున్న పాత బ్రిడ్జి, కొంచెం దూరంలో నున్న కొత్త బ్రిడ్జి కనిపిస్తాయి పాతదాని మీద వెళ్లే ప్రతి రైలు చప్పుడు, ప్రతి యింజను కూతా నా చెవుల్లోనే ఉంటాయి

చదువయిపోయింది ఫలితాలు తెలిసేవరకు మరేది పనిలేదు సావకాశంగా ఉదయం ఎనిమిది గంటలకు లేచి స్నానం అన్నీ ముగించుకొని, గదిలో మంచంమీద పుస్తకమేదో చదువుతూ కూర్చున్నాను

పది రోజుల క్రితం ఆడిన నాటకం గురించి ఇంకా జ్ఞాపకాలు మిగిలే ఉన్నాయి నాగభూషణం స్టేజి మీద కొచ్చి దడదడలాడించాడు దుష్యంతుడి పాత్రకు అతడు తప్ప మరొకడు పనికి రాడనిపించాడు- అతని పక్కన నటించడానికి కొంచెం జంకాను అతను చాలా సమర్ధవంతంగా నన్ను దారిలోకి తీసుకొచ్చాడు మిగిలిన పాత్రలన్నిటికీ ఆ విధంగానే సహకారం చేశాడు

కాని అతని అదుపు తప్పిన వాడు అతని శిష్యుడు ఏ ఒక్క చిన్న విషయంలో కూడా అతను గురువు ననుసరించలేదు కొసవరకు తన ప్రత్యేకతను నిరూపించుకున్నాడు ఎక్కడా అనవసరంగా రాగం తీయలేదు అతిగా విరగబడలేదు ఏమీ లేదనుకున్న పాత్రలో, మరచిపోలేని కొత్త పద్ధతులు

చూపించాడు

ఎవరు బాగా నటించారు?

నా ప్రశ్నకు జవాబు దొరకలేదు, క్రింద నుండి మా అమ్మ కేక పెట్టింది ఆ వచ్చిన అతను నాగభూషణం అతనిని నా గదిలోకి తీసుకొచ్చి, వాలు కుర్చీలో కూర్చుండబెట్టాను

'మీరు విజయనగరం నుండి మళ్ళా ఎప్పుడొచ్చారు? నేనే అడిగాను

ఇంతకీ నేను విజయనగరం వెళ్తే కదా? అన్నాడతను నవ్వుతూ

ఎక్కడుంటున్నారు? ఏం జేస్తున్నారు?

ఇక్కడే లాడ్జిలో ఉంటున్నాను ఒంటరిగా కాలం గడుపుతున్నాను ఏమీ తోచకపోతే నీ గురించే ఆలోచిస్తున్నాను

నాకు మతి పోయింది

నాటకంతో అయిపోయిందనుకున్నాను– నా అనుభవాలు జ్ఞాపకాల్లోనే మిగులుతాయనుకున్నాను ఈ నటరత్న నాగభూషణం నా వెంటబడతాడని అనుకోలేదు అంత చొరవ తీసుకొని యింటికి వస్తాడని కలలో కూడా భావించలేదు

ఏదో మీరు సరదాకంటున్నారు నేను మరచిపోరానంత ప్రత్యేకమయిన వ్యక్తిని కాను' అన్నాను నేను

రాగలతా, నాకు స్త్రీ అంటే తెలియందికాదు చాలమంది ఉత్తమ




నటీమణులతో నేను నటించడమే కాకుండా అరమర అభ్యంతరాలు లేకుండా వ్యవహరించాను అన్నీ వ్యాపార పద్ధతిలో నడిచాయి చివరకు నాది అన్న స్త్రీ ఎవరూ మిగల్లేదు "

'అవునవును'

"ఎవరి మీదా నా మనసు నిలవలేదు నా హృదయం శూన్యంగా ఉండిపోయింది అందులో నువ్వు ప్రవేశించిన దగ్గర నుండీ చెప్పరాని ఆనందం నిండిపోయింది'

నాకేదో యిబ్బందిగా తోచింది అతను ముందు స్నేహమన్నాడు ఇప్పుడు హృదయంలో నేనున్నానంటున్నాడు

'నాగభూషణంగారూ' కొన్ని విషయాలు మీ దృష్టికి తేవాలనుకుంటున్నాను మొదటిది మా అమ్మ దగ్గరికి ఇంకా కాటాదార్లు వస్తూనే ఉన్నారు ఇటువంటి పిల్లను మీవంటి వారు పెళ్లాడకూడదు'

నాగభూషణం నవ్వాడు

"ఈ అభ్యంతరం నేను పాటించడం లేదు రెండవ విషయం చెప్పు'

"నేను బియ్యే పరీక్షలకు ఈ మధ్యనే వెళ్ళిన సంగతి మీకు తెలుసు నాకు ఇరవైయ్యేళ్ళు మాత్రమే ఇంకా చదువుకోవాలని నిశ్చయంతో ఉన్నాను నాకు పోస్టు గ్రాడ్యుయేట్ చదువులక్కరలేదు బియ్యీడి చదివి టీచరుగా ఉద్యోగం చేస్తాను జీవితంలో స్థిరపడిన తరువాత నా వివాహం గురించి ఆలోచిస్తాను

నీ నిశ్చయానికి చాల సంతోషిస్తున్నాను నువ్వు తప్పకుండా బియ్యీడి చదవవలసిందే నువ్వు ఉద్యోగం కూడా చెయ్యవచ్చు అంటే ఒక సంవత్సరం నీ కోసం వేచి యుండాలి దానికి నా అభ్యంతరంలేదు

అప్పుడేనా మిమ్మల్ని పెళ్లి చేసుకోవాలనే అభిప్రాయం కలుగకపోవచ్చు మీరు చూస్తే నాకంటే పదిహేను, పదిహేడేళ్ళు పెద్దవాళ్ళు నాకన్న మంచివాళ్ళు మీకెవరూ దొరకలేదా?

రాగలతా! నీకు యిష్టంలేందే బలవంతం చేయ్యను నేనేమంత వయసులో పెద్ద వాడిని కాను నా ఆరోగ్యం మంచిదే నిన్ను చూసినంతవరకు నాకు పెళ్లి మీద కోరికే లేదు నిన్ను చూడగనే నేనెందుకిలా మారిపోయానో నాకు తెలియదు దానిని అనురాగమంటారో, ప్రేమంటారో నేనెరుగను

ఈ నాగభూషణం నన్ను చాల సంకట పరిస్థితిలో ఇరికిస్తున్నాడు

మా అమ్మకు యిష్టమో లేదో తెలియదు ఆవిడ కూడా నా పెళ్లికి అభ్యంతరం తెలుపుతున్నది నాటకాలలో నేను బాగా రాణించగలనని ఆవిడకు మొన్నటి నాటకం చూసిన దగ్గర నుండి మంచి నమ్మకం కుదిరింది జీవితంలో ఏ ఒక్కడితోనో పడి ఉండటంలో సొగసు లేదని ఆవిడ చెప్తుంది ఈ శరీరంలో వయసు, లావణ్యం తగ్గక ముందే నాలుగు డబ్బులు వెనకేసుకోమంటుంది నాటకాల్లోను, ఎప్పుడేనా అవకాశం దొరికితే సినీమాల్లోను హీరోయిన్ల పాత్రలు




వేస్తే చాలామంది పెద్దవాళ్ల స్నేహం లభిస్తుందని ఆమె చెప్తుంది ఆమెకూడా నా వివాహానికి అంగీకరించడంలేదు

అతను చాలసేపు నా ముఖంలోకి చూచాడు

ఇవన్నీ మీ అమ్మగారి అభిప్రాయాలు - మరి నీ అభిప్రాయం కూడా చెప్పు

నా మనసులో ఇంతవరకూ ఎటువంటి అభిప్రాయంలేదు బియ్యీడీ అయేవరకు, ఉద్యోగంలో ప్రవేశించే వరకు ఏ అభిప్రాయానికి రాదలచుకోలేదు కాబట్టి మీరు నామీద ఆశపెంచుకోకండి

ఇన్ని చెప్పావు - నా గురించి నీ అభిప్రాయమేదో చెప్పవేం?

నేను నవ్వి వూరుకున్నాను

నాగభూషణం లేచి నిలబడ్డాడు

నా ముఖంలోకి అయిదు నిముషాలు చూచి కిందకు వెళ్ళిపోయాడు మా అమ్మను కలిసి సెలవు తీసుకున్నట్టున్నాడు

నేను అన్నీ మరచి పోదామనుకున్నాను

పరీక్షా ఫలితాలు తెలిశాయి నాకు మొదటి తరగతి వచ్చింది బి ఇ డి లో సులువుగా సీటు దొరికింది రెండు నెలల చదువు అయింది

ఉన్నట్టుండి ఒక సారి ఆదివారం ఉదయం తొమ్మిది గంటలకు నాగభూషణం ఊడిపడ్డాడు నాతో అయిదు నిమిషాలే ఉన్నాడు

చాలాసేపు మా అమ్మతో మాట్లాడి వెళ్ళిపోయాడు (ఇంకా ఉంది)

# అల్లసానివారి అగ్రహారం పెద్దనాపురం



శ్రీ వేణు గోపాలస్వామివారి గర్భాలయము



శ్రీ వేణుగోపాలస్వామి విగ్రహము

ఆంధ్ర దేశాన్ని శ్రీకృష్ణదేవరాయలు పరిపాలించిన రోజులు బంగారు రోజులు.

ఆంధ్రభోజుడైన రాయలు రసికరాజు మాత్రమే కాక, కత్తిని ఘంటాన్ని సమంగా నడిపిన సరసహృదయుడు. అష్టదిగ్గజాల పోషించి కోకొల్లలుగా కావ్యాలు వ్రాయించిన ఘనత ఆయనదే. ఆయన క్రీ. శ. 1509 నుండి 1530 వరకు మాత్రము పరిపాలించారు. నేడు 'రాయలసీమ'గా పిలువబడే ప్రాంత మానాడాయన పాలనలో నిదే. నాదీ సీమ రతనాలసీమ, బంగారు భూమి – కమ్మని కవితలల్లిన, ఆంధ్ర కవితా పితామహుడు అల్లసాని పెద్దనార్యుడీ సీమవాడే. మనుచరిత్ర కావ్యాన్ని రచించి, మహారాజు కంకితమిచ్చి, ఆయనచే గండపెండేరము తొడిగించుకున్న ఘనుడీమహాకవి.

ప్రస్తుతము కడప జిల్లా, కమలాపురం తాలూకాలోని "పెద్దనాపురము" ఈ మహాకవి స్వగ్రామము. ఇది ఎఱ్ఱగుంట్ల గ్రామమునకు ఐదు కిలో మీటర్ల దూరములో వున్నది. ఇక్కడి నేల బహుసారవంత మయిన "పాటినేల". నేడీ పెద్దనాపురం ధ్వంసమయిపోయి అక్కడకు రెండు కిలో మీటర్ల దూరములో "పెద్దనపాడు"గా పునర్నిర్మాణ మయింది.

ఈ పెద్దనాపురములో రాయలవారు ఒకే అవరణములో రెండు ఆలయాలు కట్టించాడు. మొదటిది శ్రీ విశ్వేశ్వరాలయము. ఇది షుమారిరువది అడుగుల వెడల్పు, ముప్పది అడుగుల పొడవు కలిగి చక్కని రాతి స్థంభములతో నిర్మించిన కట్టడము. ఈ గుడిపై నిర్మించిన "కట్టడము" (గోపురము కాదు) ఆంధ్ర దేశములో మరెచ్చటను కానరాదు. ఇది పల్లవ రాజులు మహాబలిపురములో నిర్మించిన కట్టడాన్ని పోలివుంది.

ఈ కట్టడము మూడు భాగములు కాల్చిన యిటుక 'గార'లతో కట్టబడివుంది. లోపలిభాగము బోలుగా వుండడమే 'శైలి'ప్రత్యేక లక్షణము. ఈ ఆలయమందు పదునారు రాతి స్థంభములపై నిర్మించారొక భవనాన్ని. గర్భగుడిలోని శివలింగము మూడడుగుల ఎత్తున స్థూపాకారంగా వుంది. శివునకి ఎదురుగా రెండున్నర అడుగుల ఎత్తున మూడున్నర అడుగుల పొడవున్న నల్లరాతి నందీశ్వరుని విగ్రహము స్థాపించారు. ఇప్పుడీ మందిరము క్షీణదశలో వుంది.

ఈ ఆలయానికి కుడిప్రక్కన ఏడడుగుల చదరములో నిర్మించిన, చిన్న ఆలయములో శ్రీ వీరభద్రస్వామి వారి నిలువెత్తు విగ్రహముంది. కుడి చేతిలో పెద్ద ఖడ్గము, ఎడమ చేతిలో విల్లు, మరో చేతిలో బాణము ధరించిన చతుర్భుజుడీ వీరభద్రుడు. ప్రసన్న వదనుడైన వీరభద్రు డిక్కడే కనిపిస్తాడు.



పెద్దనాపురములోని "శివాలయము"



శివాలయముపై పల్లవరాజుల శైలిలో నిర్మించిన గోపురము

ఈ ఆలయానికి కొంత దూరములో శ్రీ వేణుగోపాల స్వామి వారి ఆలయమున్నది ఇది విజయనగరం రాజుల శైలి ననుసరించి కట్టబడినది. వెనుక నున్న గర్భాలయము కంచెరాళ్ళ మలిచి కట్టిన గోపురము. గోపురముపై అయిదంచెలుగా కట్టిన మెట్లున్నాయి. దీనిపై మొనదేలిన ఏక కలశ గోపురము. ముందు రాతి మంటపమున్నది. ఇది కూడ శిధిలావస్థలో వున్నది

లోన నాలుగడుగుల ఎత్తుతో మలచిన నల్లరాతి వేణుగోపాల స్వామి వారి విగ్రహముంది ఇది పూర్తి వైష్ణవ సాంప్రదాయము ననుసరించి నిర్మించి నట్లు తెలుస్తోంది అలవోకగా నిలబడి రెండు చేతులతో వేణువు పట్టుకొన్న చతుర్భుజ మూర్తి' ఈ గోపాల దేవుడు

ఈ ఆలయము ప్రక్క మరోచిన్న రాతి కట్టడ మున్నది. దీని లోపల పద్మాసనిమైన స్త్రీ మూర్తి



హనుమంతుని శిల్పము

విగ్రహమున్నది. ఇప్పుడీ విగ్రహము, తల, చేతులు, ఇతర భాగాలు విరగగొట్టబడివున్నాయి. ఆ ప్రాంతీయులు ఈ విగ్రహాన్ని పార్వతీ దేవిగా అభివర్ణిస్తారు, కానీ గోపాలస్వామి ప్రక్కన పార్వతీదేవి ఆలయమెందుకున్నదో అర్థము కాదు.

ఈ ఆలయ ఆవరణములోనే తూర్పు ముఖంగా నిర్మించిన చిన్న గుడివుంది. దీనియందు శ్రీరామ భక్తుడైన వీరాంజనేయుని విగ్రహమున్నది. ఇది పదడుగుల ఎత్తున, దక్షిణాభిముఖుడై, మెలివేసిన వాలముతో, బిగగట్టిన దట్టితో కుడి చెయ్యి పైకెత్తి కనిపిస్తాడు. ఈ విగ్రహము మాత్రము చెక్కు చెదరక నేటికీ నిలిచి వుంది.

వీరభద్రాలయమునకు వెనుక ప్రక్క 'నాగప్రతిష్ఠ' చేశారు. ఆకాలములో, అనగా సుమారు 475 సంవత్సరాలకు పూర్వమే పెద్దనాపురము అన్ని హంగులు కలిగి అలరారె. రాయల వారి ఆస్థాన



శ్రీ ప్రసన్న వీరభద్రస్వామివారి విగ్రహము

కవీంద్రుడైన అల్లసాని పెద్దన, అందచందములతో ఆదర్శపురంగా పేరుకెక్కినది.

ఈ నాడీ ఆలయాలు శిథిలావస్థలో నున్నాయి. సంధ్యా దీపము వెలిగించు నాథుడు లేక, గబ్బిలాలకు నిలయమైవుంది. ధనాశాపరులైన కొందరు ఈ విగ్రహాలను పెకలించి పునాదుల త్రవ్వారు, నిధుల కోసము. నిధులు లభించాయో లేదో కాని, నిక్షేపము లాంటి విగ్రహాలు మాత్రము వికృతంగా తయారయ్యాయి. గర్భాలయాన్ని నిధుల కోసము త్రవ్వి, విగ్రహాలను విరగ గొట్టారు.

ఇప్పటికీ, ఈ ఆలయానికి పదునాలు గెకరములు సుక్షేత్రము మాన్యంగా వుంది.

ఇప్పుడిక్కడకు కొంత దూరములో "టిక్సిమో" వారి భారీ సిమెంటు కర్మాగారము స్థాపించారు. దీని అధినేతలలో నొకరైన శ్రీ 'కాంచన్'గారు దయాదాక్షిణ్యాలున్న వ్యక్తి - దైవ చింతన గలవారు. వారీ దేవాలయమును చూచి హృదయము ద్రవించి, పునరుద్ధరణకు పూను కొంటున్నట్లు తెలియవచ్చినది. నాటి పెద్దనా పురాధీశ్వరులైన పరమేశ్వర శ్రీ వేణుగోపాలురకు త్వరలో వెలుగు వెల్లువగా ప్రవహిస్తుందంటే మళ్ళీ ఈ ప్రాంతానికి మంచి రోజులు వస్తాయని పిస్తోంది. (ఈ విషయము తెలియ జేసిన శ్రీ యస్. సుబ్బరామి రెడ్డి గారికి కృతజ్ఞతలు)

వ్యాసరచన : శ్రీమతి విజయలక్ష్మిరెడ్డి,

ఫోటోలు : వి. వీరారెడ్డి

నందీశ్వరుని విగ్రహము



# లాసుగు

కె.కె.రఘునందన

బస్సుకోసం ఎదురు చూసి ఎదురుచూసి ఎసుగెత్తి పోయారంతా! అందరి అంతరంగాల్లో అసహనం చీకటిలా పరుచుకోసాగింది

ఆచుట్టు ప్రక్కల పల్లె ప్రాంతాలన్నింటికీ కూడలి అది పట్నం వెళ్ళవలసి వస్తే అంతా ఆ కూడలినే ఆశ్రయిస్తారు

అక్కడ బస్సుకోసం నిరీక్షించే వారికి నిలువ నీడలేదు కూర్చోవాలంటే దుమ్ము, దూళి అనకుండా ఏరాయో, రప్పో క్రింద పడేసుకుని వుసూరుమంటూ చతికిల బడాలి పల్లెలక్కూడా ప్రిస్టేజ్ ప్రాకిందన్నట్లు బుజావు పరుస్తూ చాలామంది కుర్రాళ్ళు నిలువు జీతం తీసుకుంటూ నడుం పీకుతున్నా నిలబడ్డారు

అందరిలాగే బస్సుకోసం నిరీక్షిస్తున్న వారిలో రాఘువ ఒకడు అతనికారోజు అతిచికాగ్గా వుంది బస్సులు రాక పోవటం ముల్లులా గుచ్చుతూంది వచ్చిన బస్సు లేవీ ఆపకుండా పోవటం అక్కసు పెంచుతూంది'

ఎవరికి వారే నిట్టూరుస్తున్నారు బూతులు తిఘుతున్నారు మరి కొందరు

అందరి అసహనానికి కారణాలు ఏమో తెలీదు కాని, రాఘువ అలా కావటానికి కారణం అతనికి ఆ రోజు వుదయం పది గంటలకి విజయనగరంలో కలెక్టరేట్‌లో ఇంటర్వ్యూ వుంది అప్పటికీ రిటిన్ టెస్టులో నెగ్గటం వలన ఇంటర్వ్యూకి ఎలాగయినా హాజరై బాగా చేయాలనుకున్నాడు

రాఘువ గోల్డ్ మెడల్ తీసుకున్నా – అది మెడలో వేసుకుని తిరగటానికి తప్ప మరెందుకూ పనికి రాలేదు నిరుద్యోగం దయ్యంలా వదిలింది కాదు ఓ మడిచెక్క పొలం తండ్రి వారసత్వంగా లభించినా ఈ గడ్డు రోజుల్లో రోజు గట్టెక్కటం అసాధ్యమౌతూంది అందుకే వుద్యోగం కోసం ఎంతో ఆశతో వున్నాడు

కాని అతని ఆశలను అణగారుస్తూ ఆటంకాలు ఎదురౌతున్నాయి

ఈ లైను మరి బాగు పడదు అన్నాడు కసిగా రాఘువ

ఔను బాబయ్యా! మీ రన్నదే కరెక్టు మన ప్రభుత్వాలెన్ని మారినా మనూల్లు యిట్టాగే తగలడుతున్నాయి ఓ ఆసుపతిర్లేదు బస్సులు సమంగా లేవు వున్నవే టయానికి రావు ఎగువన జనాల్ని ఎక్కించుకుని యిక్కడ కొచ్చాక కాలీ లేదని చేతులూపేస్తారు ఏమిటో ఈ దిక్కుమాల్ని బస్సులు అన్నాడు ఆ జనంలో నాయకుడి లాంటి ఎరుకు నాయుడు

ఔను నిజం చెప్పావు! మన ప్రాంతంలో ప్రతీ ఎలక్షన్స్‌లో నాయకుల వూకదంపుడు ప్రసంగాలకి నాగుపాముల్లా తలలూపుతూ ఓట్లేసేస్తూ వెదవల్ని గెలిపిస్తున్నాం/అంతేగాని మన ప్రాంతం అభివృద్ధి చెందటం లేదు ఎక్కడుంది లోపం? మనలో నే! అడగందీ అమ్మయినా బువ్వ పెట్టదంటారు మన ప్రజలలో చైతన్యం రావాలి నాయకులు వూర్లో అడుగు పెట్టినపుడు నిలదీసి అడగాలి అదీపద్ధతి ఈరోజు నేను ఎన్నో ఆశలతో వుద్యోగం యింటర్వ్యూకి హాజరు కావాలనుకున్నాను కానీ ఏ బస్సు అందలేదు మీరంతా కూడా ముఖ్యమైన పనులకి తిలోదకాలివ్వ వలసి వస్తోంది. కానీ యిలాకాకూడదు దీనికి ఏదైనా పరిష్కారం ఆలోచించాలి మీ రంతా మీ అభిప్రాయాలు చెప్పండి" అని తన దీర్ఘోపన్యాసం ఆవేశంగా, అనర్గళంగా ముగించాడు రాఘువ

అదే సమయంలో – అమ్మో! అమ్మో అన్న అరుపులు వినిపించి అటు తిరిగారు

ఎవరో స్త్రీని మోసు కొచ్చారు నల్గురు

ఆమె 'గర్భిణీ స్త్రీ' అని, కానుపు కావటం కష్టమౌతూందని, వూర్లో మంత్రసాని ఎటో వెళ్ళిందని వెంటనే పట్నం ఆసుపత్రిలో చేర్పించాల్సి వుందని, ఎలాగయినా బస్సు ఆపాలని చెప్పాడు రాఘువతో ఒకడు

అక్కడే చాప పరచి పడుకోబెట్టారు ఆమెని

జనం పోగయారు

వచ్చే బస్సుని ఎలాగయినా ఆపి, ఎవరినైనా బ్రతిమిలాడి దింపించి ఆమెని ఎక్కించి ఆసుపత్రిలో జాయిన్ చేయవచ్చుని చెప్పాడు రాఘువ

అందరిలో పట్టుదల బయలు దేరింది

అయిదు నిముషాలు గడిచాయి

బస్సు హారన్ వినిపించింది

రాఘువతో పాటు మరి కొందరు రోడ్డుకి అడ్డంగా నిలబడ్డారు

బస్సాపాడు

బస్సు టాపు మీంచి జనం విరిగిన పక్షి రెక్కలా ఒక వైపుకి వాలిపోయింది బస్సు

కండక్టర్ దగ్గరకి వెళ్ళి పరిస్థితి వివరించాడు రాఘువ కండక్టర్ సానుభూతి కనపరచాడే కాని – బస్సులో ఎవర్ని దిగి పొమ్మనగలం రద్దీ ఎట్లా వుందో చూసారా! మా పరిస్థితి మాది అని రోడ్డుకి అడ్డంగా లెమ్మని ప్రాధేయ పడ్డాడు

రాఘువ అందర్నీ తప్పుకో నమని సౌంజ్ఞ చేశాడు

బస్సు కదిలి పోయింది

ఏవిటి బాబూ! తమరలాగ పిరికయినారు అన్నాడు ఎరుకునాయుడు బాదగా

తప్పు కండక్టర్‌ది కాదు ఈ ప్రాంతాన్ని ఏలే ప్రజానాయకులది. మనం యింత యిబ్బందులకు గురౌతున్నా సరే – మన విజ్ఞప్తులు పంపినా సరే బుట్ట దాఖలౌతున్నాయే కాని బస్సులు పడ్డం లేదు అని రాఘువ ముందుకు నడిచి గర్భిణీ స్త్రీని ఎడ్ల బండిలో విజయనగరం తీసుకెళ్ళడానికి ఏర్పాట్లు చేసాడు

కానీ ఆమె దురదృష్టం కాబోలు నాల్గు అడుగులు వెళ్ళిందో లేదో ఘోరమైన ఆర్తనాదంతో పాటుగా ఆమె ప్రాణం అనంత వాయువుల్లో కలసి పోయింది

రాఘువతో పాటు అంతా పరిగెట్టారు జాలి పడ్డారు

వారందరిలో యిప్పుడు బాధతో పాటు ఉద్రేకం విప్లవం ఒక్కుమ్మడిగా కల్గినాయి

రాఘువలో విపరీతమైన ప్రభంజనం మొదలయింది

అందర్నీ ఉద్దేశించి – ప్రజలారా! వినండి మన కళ్ళెదుటనే జరిగింది ఘోరం చూసారా! ఊర్లో ఓ ఆసుపత్రి లేక పోవటం వల్ల, పోనీ అది లేక పోయినా బస్సు సౌకర్యాలు విరివిగా లేని కారణంగా ఓ స్త్రీ అమూల్యమైన ప్రాణం బలయింది మనలో ఆవేశం జనించినపుడే మన ప్రజానాయకుల్ని మన సమస్యలు తీర్చమని ఒత్తిడి చేయాలి అందరిలో వుడుకుతున్న ఈ వేడి నెత్తురు తోనే బయలుదేరుదాం మనం పాద యాత్రతోనే వెళ్ళి మన సమస్యలకోసం పోరాటం సాగిద్దాం పదండి' అందరి మనసుల్లో జ్వాలలా ఎగిసే విప్లవం లేపి వురికించాడు

ఏం వేళా విశేషమో కాని రాఘువ మాటలు బాగాయింజక్ట్ అయినాయి పదండంటే పదండని ఆవేశంగా అడుగు ముందుకేసారు

వారి పాదాలు వడివడిగా ఎమ్మెల్యే తిరుమలరావు యింటి వైపు సాగాయి

ప్రజావాహిని చూసి బిత్తర పోయాడు తిరుమలరావు ప్రజల గురించి అసలు ఏ ఆలోచనా

లేని అతనికి తన ఇంటి మీదకి మిడతల దండులా వాలిన వారిని చూస్తుంటే ఉక్కిరిబిక్కిరైనాడు

అందర్నీ తప్పించుకుని రాఘవ తిరుమలరావు దరికి చేరాడు

ఏమైనా దబ్బా అన్నాడు ఎమ్మెల్యే తిరుమలరావు రాఘవ కళ్ళల్లో ఎర్రటి జీరలని చూస్తూ బయంగా

ఏమైందా! మా ప్రాంతంలో ఓట్లతో అధిక మెజార్టీతో గెలిచిన ఎమ్మెల్యేవి నువ్వు కాని ప్రతి వ్యక్తికి అందుబాటులో వుండే ప్రయాణ సాధనం బస్సుల్ని ఎక్కువగా ఎందుకు వేయటంలేదు ఈ రోజు బస్సులు అందని కారణంగా వస్తుందనుకున్న వుద్యోగం నట్టేట కలిసింది ఓ ఎందు చూలాలు జీవితం బలయింది ప్రతీ మారు మూల గ్రామంలో బస్సు సౌకర్యం అని పేపర్లలో వేస్తున్నారు మీ గొంతులిప్పి అరుస్తున్నారు అంతేగాని ఆచరణలో సాధ్యం కావటం లేదు ప్రజల ఒత్తిడి లేనిదే ఏ పని అవదని తెలుసుకుని, ప్రజల తరపు మనిషిగా నేను అడుగు తున్నాను. బస్సులు వేసి మా కష్టాలు గట్టెక్కించండి." అని రాఘవ




కడలి కెరటంలా విరుచుకు పడ్డాడు

జనం అంతా గగ్గోలు

'బస్సులు వేయించాలి బస్సులు వేయించాలి నినాదాలు మొదలైనాయి ఎమ్మెల్యే తిరుమలరావు ప్రజలకి చేతులెత్తి మొక్కి – నా ప్రజలారా అందరు సల్లగుండాలని నాకు మాత్రముండదా! అయితే మీరెన్ని సార్లివివర్లు సెప్పినా బస్సులు ఏయక పోవటమన్నది కేంద్రం పన్నిన కుట్ర అన్నానమ్మకం నే సెప్పేదేమంటే మన ప్రాంతం ఎనక బడిన ప్రాంతం కాబట్టి ఎంటనే ఈరోజు జర్గిన ప్రమాదాల్ని సెప్పి – సమస్యని ప్రభుత్వం దృష్టికి తెచ్చి మీకు బోలెడు బస్సులు ఏయిస్తానని సత్తె పెమానకంగా సెపుతున్నాను" అని సవినత విదేయత వుట్టిపడేలా చెప్పాడు

అంతా చప్పట్లు కొట్టారు ఎమ్మెల్యే వాగ్దానాల విసురుకి

రాఘవ కూడా పూర్తిగా విశ్వసించాడు

ఈ విషయమై మరల కలుస్తానని చెప్పి రాఘవ ప్రజలందరితో పాటు వెళ్ళిపోయాడు

కొన్ని నెలలు గడిచి పోయాయి

జనం ఎప్పటిలాగే పాట్లు పడుతున్నారు బస్సుల యిబ్బంది కొనసాగుతూనే వుంది

అయితే ఈ మధ్యకాలంలో మాత్రం జరిగిన క్రొత్త మార్పు రాఘవ వుద్యోగస్తుడై ఓ యింటి వాడు కావటం

అతనికి వుద్యోగం రావటం గ్రామస్తులందరికీ ఎంతో ఆనందం కల్గించింది అవ్యక్తం కాని సంతోషం మాటల్లో అనేక రీతులుగా కురిపించారు

రోజూ ఆఫీసుకి బస్సులోనే వెళ్ళి వస్తున్నాడు రాఘవ

ఆరోజు కూడా అట్లాగే బస్సు కోసం నిలబడ్డాడు అతనితో పాటుగా మందలుగా జనం

ఎప్పటి లాగే బస్సులాపక పోవటం– ఆపినా ఎక్కించక పోవటం వగైరా, వగైరా జరిగాయి

బాబూ! మన ఎమ్మెల్యే గారు బస్సులిసయం ఏం జేసినారు? మన రూటు బాగు పడే యోగం లేదా! సెప్పండి తమరు ఎమ్మెల్యే బాబుని కల్సినారు గందా ఏమైనాది? ఎరుకు నాయుడు లాగా చాలామంది సందేహంగా అడిగారు

"ఇదిగో చూడండి! మన తిరుమలరావుగారి లాంటి సహృదయుడు మరెవరూ వుండరీ రాజకీయ ప్రపంచంలో ఆయన మన సమస్యను పరిష్కరిద్దామని వున్నా ప్రతిపక్షాలు అడ్డు పడుతున్నాయి బస్సులు పద్మం ఁలలో మాటలా వుంది. అప్పో సొప్పో చేసి ఎట్లాగైనా బండి కొనుక్కోవాలి రాఘవ వారికి బదులిచ్చిన జవాబు అది.

అన్నప్రకారం వారంనాడు రాఘవ రాజదూత్ కొన్నాడు. దానిపై ఆఫీసుకే కాదు బెల్లం లాంటి పెళ్ళాన్ని వెంటేసుకుని సినిమాలు 'షికార్లకి తిరుగుతున్నాడు

పాపం బస్సులు వేస్తారన్న ఆశ ఒగ్గేసి బోలెడు కర్చెట్టి, బండి కొన్నాడు రామ రామ అని జాలిగా నిట్టూర్చారు

బస్సుకోసం పెడిగాపులు పడుతున్న ప్రజలు

కాని రాఘవకి ఆ వుద్యోగం ఎలా వచ్చిందని కాని, అతనికి వాహనయోగం ఎలా పట్టిందని కాని ఆ జనానికి తెలీదు

ప్రజల్లో విప్లవం రేకెత్తించి వారిని ప్రజా నాయకుల పైకి ఎలా వుసి గొలపాలో నన్న పార్ములా రాఘవకి తెలుస్తే–

అటువంటి రాఘవలాంటి వారిని తమ రాజకీయ కిటుకులతో ఎలా లొంగతీసు కోవాలో నన్న ఫార్ములా తిరుమలరావుకి తెలుసు

ఆ రూట్‌లో తిరిగే బస్సుల్లో ఎక్కువ బాగం తిరుమలరావు అనుయాయులవే! క్రొత్త బస్సులు వేస్తే తన వారికి లాభాలు పోతాయని తెలిసిన తిరుమలరావు రాఘవకి కావలసిన ఉద్యోగం యిప్పించటమే కాకుండా – అతని ప్రయాణానికే మాత్రం యిబ్బంది లేకుండా మోటర్ బండి కొనిచ్చి – తన రూట్‌కి త్రిప్పుకున్నాడు

రాఘవకి కల్గిన సౌకర్యాల వెనుక 'లొసుగు' ఆ పల్లె ప్రజలకేం తెలుసు!

ప్చ్!! □

పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## తల్లి దండ్రులదే బాధ్యత

రవి ఆరేళ్ల పసివాడు రవి అక్క పద్మ ఎనిమిది ఏండ్ల బాలిక రవి తల్లి వనజ రవి చదవటం లేదన్న కోపంతో ఎప్పుడూ కొడుతూ వుండేది అక్కను చూసి సిగ్గు తెచ్చుకోమనేది రవి తల్లి కొట్టినా తిట్టినా సహించేవాడు ఒకరోజు రాత్రి వనజ రవిని బాగా కొట్టి నీ మొఖం నాకు చూపించకు ఎక్కడికి పోతావో పొమ్మన్నది రవి లోకం తెలియని పసివాడు ఎలా బ్రతకాలో తెలియని రవి రైల్వే ప్లాట్ ఫారమ్ మీద అడుక్కునేవాడు చివరికి రవి ఒక గజదొంగగా మారాడు

రవి బంగారు బవిష్యత్తును తల్లే నాశనం చేసింది పిల్లల మనస్తత్వం తెలుసుకొని తల్లిదండ్రులు మంచి మాటలతో మంచి కథలతో వాళ్లను



మార్చుటానికి ప్రయత్నించాల పిల్లలను అనవసరంగా నెత్తికి ఎక్కించుకోవటం కోపం వచ్చినప్పుడు చస్తాడో బ్రతుకుతాడో ఆలోచించకుండా కొడితే వాళ్ళు ఎలా మారినా ఆ తప్పు తల్లిదండ్రులదే అస్తమానూ పిల్లలను కొడితే వాళ్ళు దెబ్బలకు అలవాటు పడి బయపడరు పిల్లలను అనవసరంగా బయపెట్టి వాళ్ళను జైలులో పెట్టినట్లు పెంచితే విరికి వారుగా తయారవటమే కాకుండా కాస్త స్వేచ్ఛ దొరికితే ఇది తప్పు ఇది ఒప్పు అని తెలియకుండా ఏదో చేస్తుంటారు పిల్లలు దైవ స్వరూపులు. చిన్నప్పటి నుండి వాళ్లను తల్లిదండ్రులే మంచి మార్గంలో నడిపించాలి. వాళ్లకు అబద్ధాలు నేర్పకూడదు.

–కుమారి టి. వి. విజయకుమారి,
పెదమట్టపల్లి (ఖమ్మం)

* * *

## అజ్ఞానమే ప్రధానకారణం

చిన్నారి బాలల దీనగాథలు ప్రతి ఒక్కరూ తమ జీవితంలో ఏదో ఒక సందర్భంలో వింటూనే వుంటారు. చిన్న పిల్లల హీనస్థితికి కారణం కేవలం పేదరికం కాదు అనిపిస్తుంది. అవిద్య, నిరక్షరాస్యత ముఖ్య కారణాలు! ధనవంతుల యింట పుట్టినా మద్య తరగతి కుటుంబంలో పుట్టినా అకస్మాత్తుగా తల్లి చనిపోతే వారి బంగారు బవిష్యత్తు దీన గాథగానే మారి పోతుంది ప్రభుత్వం ఎన్ని రిజర్వేషన్లు కల్పించినా అట్టడుగు వర్గాలను పైకి తేవడం కోసం ఎన్ని స్కాలర్‌షిప్పులు ఏర్పరచినా శ్రామిక వర్గంలోని పిల్లలు అంతపైకి రాలేక పోతున్నారు. కారణం - వారి చుట్టూ



వుండే వాతావరణం, పరిస్థితులు!

రైళ్ళలో 10 ఏళ్ళ లోపు పిల్లలు రైలు కంపార్ట్ మెంట్లను చిన్న గుడ్డతో శుభ్రపరుస్తూ తలా పదిపైసలు అడుక్కుని ప్రోగు చేసుకుంటారు. ఇలాగే వీధులలో పాత గోతాములు భుజాన తగిలించు కుని చిత్తు కాగితాలు ప్లాస్టిక్ కవర్లు ఏరుకునే పిల్లలు! వారందరివీ నిజానికి దీనగాథలే వాళ్ళు మాత్రం అదే జీవితం అన్నట్లుగా ఆనందంగా గడిపి వేస్తారు కారణం? వారి తల్లిదండ్రుల అజ్ఞానం నిరక్షరాస్యత!

ముఖ్యంగా శ్రామిక వరంలో తల్లి దండ్రులు కుటుంబ నియంత్రణ పాటించరు పిల్లలకు 6 ఏళ్ళు దాటగానే ఏదో ఒక పనికో అడుక్కోడానికో పంపి అంత చిన్న పిల్లవాడి ద్వారా కూడా ఏదో రాబడి వస్తోందని చూస్తారు కాని చదివించి వృద్ధి లోకి తేవాలని వారు తెలివితో మంచి పనులు చేయాలని ఆలోచించరు ముఖ్యంగా పెద్దవాళ్ళు పనులలోకి వెళ్ళిపోతే కొద్ది మంది పిల్లలు చదవాలన్నా మిగతా పిల్లలు ఆటపాటలలో తిరుగుతూ వుంటె చదువు మీద శ్రద్ధ వారి కుండదు ఆ వాతావరణం పరిసరాలు అటువంటివి తమలోని తెలివిని వృద్ధి చేసుకుంటూ బాగా చదవాలనీ పైకి రావాలనీ మంచి తిండి, గుడ్డా సంపాదించాలనే బవిష్యత్తును గురించిన ఆలోచనలు వారిలో వుండవు కారణం? పగలంతా శ్రమించి వచ్చే పెద్దలకు పిల్లల బాద్యతలు గురించి శ్రద్ధ వహించే అవకాశమూ వుండదు ఆలోచనా వుండదు విద్యా వుండదు

అందుచేత అట్టడుగు వర్గాలలోని




పిల్లలను పైకి తేవాలంటే ప్రభుత్వం వారికి రిజర్వేషన్లు స్కాలర్‌షిప్పులూ కల్పిస్తే చాలదు విద్య అవసరం మంచి బవిష్యత్తును గురించిన ఆలోచన పిల్లలలోను పెద్దలలోను తేవాలంటే వారి గురించి బాద్యత వహించి మంచిని నైతికవిలువలను చక్కగా బోధించి ఆచరణలో పెట్టగలిగే సామర్థ్యతను పెంచే కోచింగ్ సెంటర్స్ ఉచితంగా ప్రారంభించాలి అపుడే చిన్నారి బాలల దీనగాథలు తగ్గి సమాజానికి తెలివి గల యువతరాన్ని సాధించ గల్గుతాము ఈ విధంగా దేశ ప్రగతి కూడా సాధ్యపడుతుంది

–ఎన్ సులోచన, బాపట్ల □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు

పూర్తి చిరునామా

పిన్ కోడ్


మళ్ళీ మళ్ళీ తిరిగి చూస్తారు జనం
సూపర్ రిన్‌తో తళతళలాడే
ఆ తెల్లదనం
SUPER
RIN
సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు
మరే ఇతర డిటర్జంట్ బిళ్ళ లేదా బార్ కంటే తెలుపు
హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి
LINTAS RIN 115 2720 TL

# మృగం

## వడ్లమన్నాటి కుటుంబరావు

నందనరావు ఆనందంగా ఉండటానికి కారణా లనేకం ఉన్నా కొన్ని మాత్రం చెప్పుకుంటే చాలు ఈ కథ పూర్తి చేయటానికి

అతను అందంగా హుందాగా ఉంటాడు! అమ్మాయిల గుండెల్లోనే కాదు ఆడవాళ్ళందరి లోనూ అలజడి రేపగలడు అతను – డబ్బుగల వారబ్బాయి! వాళ్ళ నాన్న పి డబ్ల్యు డి. కంట్రాక్టరు చేస్తూ లక్షలు లక్షలు సంపాయించేస్తున్నారు ఆయన కారుల్లో తిరుగుతూ ఇతనికి స్కూటరు కొనిచ్చేశారు కాస్ట్లీ దుస్తులతో మెళ్ళో బంగారు గొలుసుతో .. జేబులో పచ్చ డబ్బుతో కులాసాగా ఉంటాడు నందనరావు!

సాధారణంగా లక్ష్మీ సరస్వతులకు పడదు కానీ ఆ దేవత లిద్దరూ నందనరావు విషయంలో రాజీ కొచ్చేశారని చెప్పక తప్పదు!

ఎందుకంటే ఇంజనీరింగ్ కాలేజీలో బి టెక్ నాలుగో సంవత్సరం చదువుతున్న నందనరావుదే ఎప్పుడూ ఫస్ట్ రాంక్!

అదీగాక నందనరావు గొంతు చాలా మధురంగా ఉంటుంది అతను సినిమా పాటలు పాడుతుంటే కిషోర్ కుమార్ బాల సుబ్రమణ్యంలు ఆ పక్క నెక్కడున్నా నిల్చుని పాడుతున్నారా.. అనిపిస్తుంది ఇక ఘంటసాల రఫీ. ముఖేష్ పాటలు సరేసరి! వాళ్ళు ఇతనిలో పరకాయ ప్రవేశం చేసి పాడుతున్నారా అనిపిస్తుంది. దీనికి బాగా దోహదం చేసిన మరో అంశం.. అతనికి బాగా వచ్చిన మిమిక్రీ!

ఇంకో విశేష మేమంటే. నందనరావు చిన్న వయసులోనే ప్రఖ్యాత రచయితయి పోయి కూర్చున్నాడు అతని కథల్ని హాట్ కేకుల్లా తినేస్తారు– సాహితీప్రియులు– ఆడా మగా తేడా లేకుండా

బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన యువకిశోరం నందనరావంటే ఇష్టపడని వారంటూ ఎవరూ ఉండరు ఎవరింటి కెళ్ళినా అతనికి గజకేసరి యోగమే! పూర్ణకుంభ స్వాగతమే!

కొంత మంది అతనితో మిమిక్రీ చేయించుకుని పకాపకా నవ్వుతుంటారు వినోదంగా

ఇంకొంత మంది సినిమా పాటలు పాడించుకుని తన్మయత్వంలో మునిగి పోతారు

మరికొంత మంది అతని కథల్లోని ప్రత్యేకమైన అంశాల్ని పొగిడి ఆనందపరవశు లవుతారు

ఇంతవరకే ఉంటే ఇబ్బంది లేకపోను! అసలు చిక్కొక్కడ వచ్చిందంటే. విచ్చల విడిగా డబ్బు ఖర్చు పెట్టగల అతని మనస్తత్వాన్ని ఆసరాగా తీసుకుని మగ, ఆడ అభిమానులు అతన్ని అందంలో ఇంద్రుడనీ మెత్తని మనసుకి ఆకాశంలో చంద్రుడనీ డబ్బుకు కుబేరుడనీ దానగుణానికి అంటే ధారాళంగా ఖర్చుపెట్టటానికి కర్ణుడనీ పొగిడేశారు! మగవాళ్ళు పొగిడినందుకు అంతగా పొంగి పోలేదు గానీ "ఫెయిర్ సెక్స్ అభినందనలకి ఉబ్బిపోయాడు నందనరావు ఆ పొంగి పోవటం రాను రానూ గర్వంలోకి మారిపోయింది

అగ్నికి గాలి తోడయినట్టుగా ఒకరిద్దరు దుష్టమిత్రులు ఉచిత సలహా పారేశారు మాటో ది సన్యాసులు చన్నీటిలో మునిగి తపస్సు చేసినా ఇలాంటి తరుణీమణులు తారసపడరు కన్నె పిల్లల్లో ఆడవాళ్ళలో అందరూ పద్మినీ జాతి స్త్రీలే ఉండరు నీకేమున్నా ఇంట్రెస్టు ఉంటే నీ మీద వాళ్ళకి టేస్టు ఉండగానే చూసుకో!

ఈ సలహా బాగా నచ్చింది నందనరావుకి ఎలాంటి ఆడవాళ్ళు త్వరగా వల్లో పడతారో చెప్పమన్నాడు నందనరావు వాళ్ళకి గ్రాండ్ పార్టీ ఇచ్చి. విందు మందు సేవిస్తూ మత్తుగా గమ్మత్తుగా సూచన లిచ్చారు నందనరావుకి

తల్లిదండ్రుల కంట్రోలు లేని కన్నె పిల్లలు! అవాకారికి భార్యగా ఉన్న అందగత్తెలు! శాడిస్టు మొగుళ్ళు హింసిస్తున్న భార్యలు! వగైరాలు త్వరగా వశమవుతారని

అతనికి వెంటనే వెనక బజారు వరలక్ష్మి గుర్తొచ్చింది. ఆమె తన ఫ్రెండువాళ్ళ ఇంటి పక్క పోర్షనులో ఉంటోంది. తనక్కడ ఒకసారి పాటలు పాడుతుంటే తనంతట తనే వచ్చి పరిచయం చేసుకుంది. ఆమెకి పట్టుమని ఇరవై ఏళ్ళు కూడా ఉండవు అందంగా పొంకంగా బింకంగా ఉంటుంది. భర్త మాత్రం తుమ్మ మొద్దులా బలిసిన ఎద్దులా ఉంటాడు వరలక్ష్మి స్వయంగా తీసుకెళ్ళి స్వయంగా పరిచయం చేసినప్పుడు అతను తనని మిర్రి మిర్రి చూడలేదు ఎవడే వీడు బావకావ్?!" అంటూ భార్యని జుట్టు పట్టుకు గుంజి నాలుగు గుద్దులు వడ్డించ లేదు ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించాడు "మీ లాంటి వాళ్ళు – మా ఇంటికి రమ్మని కాళ్ళు పట్టుకుని బతిమాలితే మాత్రం వస్తారా? ఇదంతా మీ మంచి మనసు మా అదృష్టం!" అన్నాడు తనతో ఇంకో రెండు పాటలు పాడించు కున్నాడు మిమిక్రీ చేయించుకొని మృగంలా పడీపడీ నవ్వాడు తన కసవ్యం వేసినా వరలక్ష్మి కోసం భరించాడు తను వెళ్ళేప్పుడు అన్నాడు ఇదిగో బాబూ! బంగారు బాబూ! మా వరాలు సంతోషమే నా సంతోషం అది ఏం చేసినా నా కిష్టమే! నేనున్నా లేకపోయినా నువ్వెప్పుడయినా రావచ్చు మా ఇంటికి పాటలు పాడొచ్చు. మిమిక్రీ చేసి దాన్ని సంతోష పెట్టవచ్చు!

అతనేదో షెడ్డులో మెకానిక్‌గా పని చేస్తున్నాడని వరలక్ష్మి చెప్పింది మెట్రిక్ తప్పాడని కూడా చెప్పినట్టు గుర్తు తనూ తొమ్మిదో క్లాసు చదివిందని చెప్పింది

ఆ తరువాత తన ఫ్రెండువాళ్ళు సొంతంగా ఇల్లు కట్టించుకుని వెళ్ళిపోయినా తను వరలక్ష్మి ఇంటికి రాకపోకలు మానలేదు

తనని చూస్తే చాలు పొంగి పోతుంది – వరలక్ష్మి పాటలు పాడించుకున్నాక మిమిక్రీ చేయించు కున్నాక ఎన్నోసార్లు పొగిడేది తన అందాన్ని డబ్బుని ఇతర ప్రతిభా విశేషాల్ని ఎన్నో రకాల టిఫిన్లు చేసి పెట్టేది –

నాకోసం మీరు తింటారు కదూ" అంటూ ఓరగా చూస్తూ తను నాలుగయిదుసార్లు ఖరీదయిన కేకులు బుట్టల నిండా పళ్ళు తీసుకెళ్ళి ఇస్తే వద్దంటూనే తీసుకొంది

ఆమె కూర్చున్నప్పుడు లేచి నిల్చున్నప్పుడు నడుస్తున్నప్పుడు ఆ వంపులు సొంపులు చూసి పరవశిస్తుంటే ఏంటలా చూస్తున్నారు?" అనేది – కవ్విస్తున్నట్టుగా ఒకటి రెండుసార్లు తను ఆమెతో మాట్లాడుతున్నప్పుడు ఆ "మృగం గాడొచ్చాడు తనని చూసి సంతోషపడ్డాడు గానీ అనుమానించటం విసుక్కోవటం ఏమి చెయ్య లేదు

దీన్ని బట్టి తనకర్థమయ్యేదేమిటి? వరలక్ష్మి ఆ కురూపిని ఆ మృగంగాడిని అసహ్యించు కుంటోంది నాజూగ్గా అందంగా ఉన్న తన పొందు కోరుకొంటోంది ఆ మృగంగాడి క్కూడా తను వరలక్ష్మితో కులకటం అభ్యంతరంలేదు. వరలక్ష్మి అడిగిన డబ్బిస్తే చాలు గాబోలు!

ఇంకెందుకూ ఆలస్యం? తన ప్రణయకేళీ విలాసాన్ని ముందుగా వరలక్ష్మితో మొదలుపెడితే పోలా! లైన్ క్లియర్‌గా ఉందిగా అనుకున్న నందనరావు ఆనందంగా వరలక్ష్మి యింటికి పరు గెత్తించాడు స్కూటర్ని పక్క పోర్షనుకున్న తాళం తన పాలిట వరంగా భావించిన నందన రావు మృదువుగా వరలక్ష్మి వాళ్ళ పోర్షన్ తలుపుల మీద కొట్టాడు

నిద్ర లేచి వచ్చి తలుపు తీసింది వరలక్ష్మి. ఆ మృగంగారు ఈ సమయంలో ఉండరని తెలుసు నందనరావుకి

"సారీ వరలక్ష్మి! మీ బంగారంలాంటి నిద్ర పాడు చేసే అధికారం నాకు లేదు మళ్ళీ వస్తాను" అంటూ



తెచ్చిపెట్టుకున్న వినయంతో వెనుదిరగబోయా,

"భలేవారే బాబూ మీరు! మీకన్నా ఆ పాడు నిద్ర ఎక్కువా నాకు? రండి! రండి అంటూ సాదరంగా ఆహ్వానించింది కుర్చీ వేసి కూర్చోపెట్టింది

"నేనంటే అంత ఇష్టమా వరలక్ష్మి

"ఆ మాట నెమ్మదిగా అంటారేమిటి? బోలెడంత ఇష్టం!"

"ఎందుకని?"

"ఎందుకో మీకు తెలియదా?? ఉండండి కాఫీ పెడతాను పాటలు పాడతారా మిమిక్రీ చేస్తారా?"

"ఆ రెండూ చేయడానికి కాదు నేను వచ్చింది"

"మరి దేనికి?" అంటూ కిసుక్కున నవ్వింది అదోలా చూసి

నరాలు జివ్వుమన్నాయి – నందనరావుకి

"ఓ కథలు చెప్పటానికా? సరే! అలాగే కానీండి మీరేం చేసినా నాకిష్టమే!" అంటూ వంటింట్లోకి వెళ్ళింది వరలక్ష్మి

ఆమె మాటల్ని ఆహ్వానంగా తీసుకున్న నందనరావు ఇక ఆగలేకపోయాడు ఒక్కుదుటున వంటింట్లోకెళ్ళి వరలక్ష్మిని బలంగా కౌగలించుకున్నాడు ఆమెను నలిపేస్తూ బెడ్ మీదకు తీసుకురావటానికి ప్రయత్నం చేస్తున్నాడు తనకు పూర్తిగా సహకరిస్తుందనుకున్న వరలక్ష్మి "ఛీ! ఏమిటిది బాబూ! వదలండి" అంది పెనుగులాడుతూ.

ఆశ్చర్యపోయాడు నందనరావు

"నాతో రాలేస్తే ఆ మృగంగాడెందుకు పనికొస్తాడు

నేను నీకు సుఖానికి సుఖం డబ్బుకు డబ్బు – అన్నీ ఇస్తాను! రా!" అంటూ ఆమెని వశం చేసుకోటానికి ప్రయత్నిస్తున్నాడు నందనరావు

"బాబూ! మర్యాదగా చెపుతున్నాను నాకిష్టం లేదు వదులుతారా లేకపోతే అరిచి మీ పరువు బజారుపాలు చెయ్యమంటారా ?" దాదాపు గర్జిస్తున్నట్టుగా అన్న మాటలకి భయపడిపోయి వదిలేశాడు నందనరావు

కళ్ళల్లో నిప్పులు కురిపిస్తూ అంది వరలక్ష్మి

"నా మొగుడు మృగం కాదు బాబూ! మంచి మనసున్న మనిషి. అనాకారి అయినా అతనికి నేనంటే ఎంతో ఇష్టం నన్ను పువ్వుల్లో పెట్టి చూసుకొంటాడు నాకేదన్నా అయితే గిలగిలలాడిపోతాడు తప్పు చెయ్యను అని ఎంత గాఢ నమ్మకం లేకపోతే తన భార్యని తనకన్నా అన్నింటిలో అధికుడయిన మగాడితో ఒంటరిగా వదిలి వెళ్తాడు?"

"కానీ .. మీరేం చేశారు? నా చనువుని . మా ఆయన మంచితనాన్ని అలుసుగా తీసుకున్నారు అపార్థం చేసుకున్నారు. మీరు డబ్బున్నవాళ్ళు అందగాళ్ళు .. అయినంత మాత్రాన పాటలు పాడి మిమిక్రీ చేసి కథలు చెప్పినంత మాత్రాన ప్రతి ఆడదీ మీకు లొంగిపోతుందని మీ నమ్మకం ఇది మనుషులకు రావలసిన ఆలోచనకాదు మృగాలకు రావలసింది!! నేను గానీ మా ఆయనగానీ అభిమానించింది మీలోని కళాకారుణ్ని అంతేగానీ డబ్బున్న అందమయిన మృగాన్ని కాదు ఇప్పుడు చెప్పండి బాబూ! అసలయిన మృగం ఎవరో ?!"

తొలిసారిగా వచ్చిన అపజయం చవిచూసిన నందనరావు తలదించుకున్నాడు

"ఈ విషయం మనిద్దరి మధ్యనే మర్చిపోదాం కళాకారుడిగా ప్రతిభావంతుడిగా మీకు మా యింటికి ఎప్పుడూ స్వాగతమే! మృగంగా గనక వస్తే మా ఆయన మీ పాలిట ఈటిగా మారవలసి వస్తుంది జాగ్రత్త!" అంటున్న వరలక్ష్మి తనకన్నా వెయ్యి రెట్లు విద్యాధికురాలిగాను సంస్కారవంతురాలిగాను కన్పించింది నందనరావుకి

ఆమెకి ముఖం చూపించలేక నీరసంగా కాళ్ళీడ్చుకుంటూ స్కూటర్ దగ్గరకు నడిచాడు □

ఇమామి
కేర్ టాల్క్




మూడు క్రొత్త ఫ్రెంచ్ సువాసనలలో

అవేమనగా—'కూల్ ఏజ్ స్ప్రింగ్', 'వైల్డ్ ఏజ్ ఫారెస్ట్', 'ఫ్రెష్ ఏజ్ ఫ్లవర్స్' సరిపోల్చేందుకు సాటిలేని మూడు క్రొత్త ఫ్రెంచ్ సువాసనలు. అదొక నూతన [illegible]ం. అదొక క్రొత్త లాలన, సున్నితం, పట్టుమృదుత్వం, చక్కదనం. ఎంతో ప్రేమ పూరితం, మరెంత జాగ్రత్త తీసుకొనేది. క్రొత్త ఇమామి కేర్ టాల్క్. కేవలం రు 8.40కే, ప్రేమతో అర్పించిన కానుక.



## పదవీచ్యుతుడైన ప్రేమికుడు!

అలనాడు ఇంగ్లండు నేలిన ఎనిమిదవ ఎడ్వర్డు వో వివాహిత స్త్రీని చూసి ప్రేమించి ఆమెను పరిణయ మాడారట అకారణంగా అకారణంగా ఆయనను ప్రజలు రాజ్యాంగమూ కలసి పదవీ చ్యుతుణ్ణి చేశాయట అయినా తన ప్రేయసీ భార్య కోసం ఆయన అదంతా ఆనందంగా స్వీకరించారట- ఆవిడ ఆనందించిందో లేదో మరి!

## వేదికపై ముద్దు!

అనంతపూర్‌లో ప్రముఖ సినీ నటుడు నందమూరి బాలకృష్ణ తన తండ్రి తరఫున తెలుగు దేశం పార్టీ ఎన్నికల ప్రచారంలో ఓ సభలో మాట్లాడుతూండగా 33 ఏళ్ళ మునెమ్మ అనే వో వనిత ఒక పూలహారంతో వేదిక మీదికి వెళ్ళి అది ఆయన మెడలో వేసి కరచాలనం చేసి ఆయన రెండు పెదవులూ పట్టుకుని ఎదురు చూడని ఫక్కీలో చుపుక్కున వో ముద్దు పెట్టేసుకుందట- అహో!

## భార్యను అమ్మిన భర్త!

విజయవాడకు చెందిన ఓ రిక్షాలాగి జీవితం చేసుకునే వ్యక్తి నలుగురు పిల్లల తల్లయిన తన భార్యను బొంబాయి వ్యభిచార గృహానికి మూడు వేల రూపాయలకు అమ్మేశాడట తమ కూతురు కనబడ్డం లేదని ఆమె తలిదండ్రులు పోలీసుకు చేసిన ఫిర్యాదులో యీ విషయం బయట పడ్డదట

## శాంతి కోసం ఖర్చు!

శాంతి శాంతి అంటూ శాంతి కోసం శాంతి భద్రతల కోసం శాంతి రక్షణ కోసం ప్రపంచంలోని ప్రపంచ దేశాలు ఏటికి ఒక ట్రిలియను డాలర్లు ఖర్చు పెడుతున్నాయట ఈ విషయం ప్రకటించిన




మహాత్ములే ట్రిలియను అనగా వెయ్యి బిలియన్లు అనీ బిలియను అనగా పది లక్షల మిలియనులనీ లెక్కలు చెప్పారట- అంటే ఎంత సొమ్మో! లెక్క కుదరటం లేదా?



## విద్యార్థిని మేధాశక్తి!

తూర్పు ఆఫ్రికాకు చెందిన కెన్యా జిల్లా నెయిరిలో ఎనిమిదవ తరగతి చదువుతున్న 14 ఏళ్ళ బ్లిజబెత్ గబిరు అనే విద్యార్థినికి అఖండమైన మేధా శక్తి వున్నదట ఆమె రేడియోలోని వార్తలు చదవడం సాంతం విని టేపురికార్డర్లా తిరిగి ఆ వార్తల నన్నిటినీ తూచ తప్పకుండా పొల్లు పోకుండా ఏదీ చూడకుండా చెప్పగలదట

## 2000వ సంవత్సరానికి ప్రపంచ జనాభా!

ఇంకా పదమూడేళ్ళలో రానున్న 2000వ సంవత్సరానికి మెక్సికో సిటీ జనాభా 26 3 మిలియనులై ఆ నగరం ప్రపంచ ప్రథమ నగర మవుతుందట బ్రెజిల్ సయోపాలో జనాభా 24 మిలియను లవుతుందట అలాగే మూడో స్థానం టోక్యో యోకహామాది నాలుగో స్థానం 16 6 మిలియనులతో కలకత్తాది ఆ తరువాతి స్థానం పది మిలియనులతో బొంబాయిదీ అట!

## రైలులో శరీర భాగాలు!

పర్లి వైద్యనాథ్ పాసింజరు సికిందరాబాదు వచ్చి ఆగాక, జనమందరూ దిగి వెళ్ళి పోయాక బోగీలు శుభ్రం చేస్తున్న సిబ్బందికి వో బోగీలో ఓ బెర్తు మీద రెండు పాలిథిన్ సంచులు కనుపించాయట ఆ సంచులలోని ఒక సంచిలో ఓ మానవుని తల చేతులూ రెండో సంచిలో మొండెమూ కాళ్ళూ వున్నాయట. ఇది మొన్న శుక్రవారం ఆరవ తేదీ సంఘటన

## తండ్రి జీతం తీసుకున్న తనయుడు!

నందిగామకు చెందిన వందర్లపాడు గ్రామంలో మోహనరావు అనే వో యువకుడు చాణక్యుడు అయిదు నెలల క్రితం మరణించిన తన తండ్రి (స్కూలు ఉపాధ్యాయుడు) జీతం తీసుకుంటూ స్థానిక బ్యాంకులో పట్టుబడ్డాడట అంత క్రితం అతడు అదే బ్యాంకు నుంచి తన తండ్రి దొంగసంతకం పెట్టి రెండు సార్లు జీతం తీసుకున్నాడట

## యవ్వన మంతా నిద్రలో గడిపిన స్త్రీ!

రష్యాకు చెందిన నదెజ్డ ఆర్మోవెనల్ లిబిడినా అనే 33 ఏళ్ళ ఆమె వో మానసిక సంఘర్షణలోని చికాకుతో నిద్రలోకి జారి పోయిందట ఆ నిద్ర సుమారు 20 సంవత్సరాల కాలం జరిగిందట ఇటీవల ఆమె తల్లి మరణించిన నాడు వున్నట్టుండి ఉలిక్కి పడ్డట్టామె లేచిందట పడుకున్నపుడు 33 ఏళ్ళ యవ్వనంలో వున్న ఆమె లేచేటప్పటికి 53 ఏళ్ళ వృద్ధురాలయ్యిందట

## ప్రార్థనలో కన్ను మూసిన వానరం!

చిత్రకూట ధామ అనే చోట వో ఆంజనేయ స్వామి కోవెలలో భక్తులతో పాటు చేతులు జోడించి నమస్కరించి కూర్చున్న వో వానరం అలానే ఆ ప్రార్థనలో కన్ను మూసిందట భక్తులూ ఆ వూరి పెద్దలూ కలసి ఆ వానరాన్ని పసుపు కుంకుమలతో పూజచేసి చిత్ర కూటం పక్కనున్న మైస్వాని నది వొడ్డున ఖననం చేశారట

## పందుల మందలో పసిపిల్ల!

చైనాలో ఓ కుటుంబంలోని ఒక పిల్లను ఆమె తలిదండ్రులు తాము పెంచే పందుల మందలో మందగా పెంచారట తత్ఫలితంగా ఆ పిల్ల పంది వలెనే పాకడం అరవడం ఆహారం తినడం చేస్తోందట ఈ అమ్మాయికి యిపుడు పదకొండేళ్ళట ఆ పిల్ల మెదడు రెండేళ్ళ పిల్ల మెదడంత తెలివిలో ఎదిగిందని ఆమెను పరీక్షించిన డాక్టర్లన్నారట

## ప్రేయసి పెళ్ళి-ప్రియుని ఆత్మహత్య

మద్రాసుకు చెందిన పెన్నలూరులో 30 ఏళ్ళ గోపాల్ అనే అతను గాయత్రి అనే వో అమ్మాయిని ప్రేమించాడట కానీ కుటుంబ వ్యవహారాల వల్ల మహాదేవి అనే వో అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడట పెళ్ళయ్యాక కూడా ఆ గాయత్రిని మరచిపోలేక ఆమెను కలుసుకోడానికి వెళ్తే ఆమె అది తప్పని వారించిందట మరోసారి వెళ్ళేసరికి ఆమె తన పెళ్ళి




నిశ్చయమయిందని చెప్పిందట ఈ వార్త భరించలేక ఆ గోపాల్ విషం త్రాగి ఆత్మహత్య చేసుకున్నాడట అతనికి పెళ్ళయి ఆరు నెలలే అయ్యిందట. □

సీరియల్

# ప్రతిస్పందన

అన్నపూర్ణ




(గత సంచిక తరువాయి)

ఇంకా రవికిరణ్‌ను తీసుకొని శేషాద్రిగారు యమునాదేవి తమ వూరు రాలేదు.

ఈలోగా ఎంట్రన్స్ పరీక్షా ఫలితాలు తెలిశాయి పి జి సెంటర్‌లో సౌందర్యకు సీటు వచ్చింది

ఇంట్లో డబ్బుకు కొదవలేదు కట్టవలసిన ఫీజులు కట్టేసింది

సరిగ్గా తను కాలేజీలో ఫీజు కట్టి వచ్చిన ఆ రోజే ఇంటికి వచ్చి తలుపు తాళం తీసి లోపల అడుగు పెట్టేసరికి ఒక కవరు కనిపించింది పోస్ట్‌మాన్ తలుపు సందులోంచి లోపలికి వేసినట్టున్నాడు తీసి చూస్తే ఫ్రం అడ్రసు కనిపించలేదు

డాడీ రాశారేమో అనుకొని కవరు చించింది సౌందర్య

చిరంజీవి రవికిరణ్‌కు

ఆశీర్వాదాలతో

మీరు నాకంటే వయసులో చిన్నవారై వుంటారన్న ఉద్దేశ్యంతో నే ఆశీర్వాదాలు తెలుపుతున్నాను

రచనలకు సంబంధించి పొగుడుతూ వేలాదిమంది ఉత్తరాలు వ్రాస్తుంటారు నాకు అంతమందికీ తిరుగు జవాబులు వ్రాయాలంటే అది జరిగే పనికాదు,

ప్రతిస్పందనతో పాఠకులకు ఉత్తరాలు వ్రాయడం నాకు అలవాటు కూడా లేదు

మీ వుత్తరం చదివాక మాత్రం నేను తిరుగు జవాబు వ్రాయకుండా వుండలేకపోతున్నాను

మీకు వుత్తరం వ్రాయటం నా విధి కర్తవ్యం కూడా

నేనలా భావించటానికి కారణం మీ అమాయకత్వం!

నవల సినిమా కాలక్షేపానికి చదువుకోటానికి వినోదానికి చూడటానికేనని భావించుకోవాలి

పొరబాటున వాటిలో చూపిన విధంగా చెప్పిన విధంగా ఆచరించటానికి ప్రయత్నిస్తే ఆత్మవంచనే మిగులుతుంది

మిస్టర్ రవికిరణ్! మీరు ఒక అమ్మాయిని గాఢంగా ప్రేమించినట్టు ఆ అమ్మాయి మాత్రం మిమ్మల్ని ఘోరంగా తిరస్కరించినట్టు తెలిపారు అయినా మీ మనసు ఆ అమ్మాయి మీదే వున్నట్టు ఆమె తనకు తానుగా వచ్చి మీ కాళ్ళ మీద పడాలని మీరు వాంఛిస్తున్నట్టు అందుకు సంబంధించి బ్రబక్ భద్రకాళి నవలలో హీరో ఎలా చేశాడో అలాగే మీరూ బ్రబక్ విద్యను ప్రాక్టికల్‌గా చేసి మీ ప్రేయసి మీద ప్రయోగించినట్టూ కానీ ఆ ప్రయోగం విఫలమయినట్టు వ్రాశారు

నవలలో మీరు సూచించిన అదే రోజుల్లో అదే వేళల్లో చేసినా బ్రబక్ ప్రయోగం విఫలమైందేమిటి? ఆ ప్రయోగం సఫలం కావాలంటే నవలలో పేర్కొనని మరేమైనా మెలికలు వున్నయ్యా? తెలుపండి అని అడిగారు

మీ ప్రశ్నలన్నింటికీ నా సమాధానం బ్రబక్ భద్రకాళి లో గాని ఛూ ఛూ చాముండి లో గాని మిగతా నా నవల దేనిలోగాని హీరో హీరోయిన్లు ఏ ప్రయోగాలు చేసినా అవి కేవలం కథ కోసం పాత్రలు నడవటం కోసమే అంతేగాని జనం ప్రాక్టికల్‌గా వాట్ని ఆచరించటం కోసం కాదు

బ్రబక్ విద్య ప్రయోగానికి మీరు ఎన్ని తిప్పలు పడిందీ కూడా తెలిపారు అవన్నీ చదువుతుంటే నాకు నవ్వు ఆగటంలేదు

ఇందును గురించి మిమ్మల్ని అవమానించిన మీప్రేయసితో స్నేహం నటించటం మొదలు పెట్టారు ఆమె తల వెంట్రుకలు సంపాదించటం కోసం అర్ధరాత్రి దొంగతనానికి వెళ్ళారు చివరికి పార్టీ పేరిట మత్తు మందు యిచ్చి ఆమె మత్తులో వుండగా కేశ దళాన్ని సంపాదించారు ఊరి బయట నిర్జన ప్రదేశంలో మీరు ప్రయోగం చేసి వస్తూండగా పోలీసులు ఎదురుపడటం పరువుకు ఝడిసి వాళ్ళనుంచీ తప్పించుకోవటం కోసం రైలు కట్ట వెంట పరుగెత్తటం, అప్పుడు కాలిలో ఏదో ఇనుప వస్తువు దిగబడటం ప్రస్తుతం కాలి నొప్పితో బాధపడుతూండటం అన్నీ వ్రాశారు

నా నవలలు వాటిల్లోని పాత్రలు మిమ్మల్ని అపమార్గం పట్టించాయి ఓ మనసున్న రచయితగా అందును గురించి ఎంతో బాధపడుతున్నాను మీకు మంచి జరగాలని మీ కాలి నొప్పి తగ్గాలని నేను కోరుకుంటున్నాను

మరెప్పుడూ అనవసర విషయాలు ఆచరించటానికి ప్రయత్నించి అభాసుపాలు కాకండి నవలలు చదివినా సినిమాలు చూసినా కేవలం అవి

**జరిగిన కథ –7** : సాకేత మీద వశీకరణ మంత్రాన్ని ప్రయోగించడానికి ప్రయత్నించి కాలులో మేకు దిగబడిన రవికిరణ్ ఆ గాయాన్ని నిర్లక్ష్యం చేస్తాడు చివరికి పాదం తీసివెయ్యవలసి వస్తుంది, అనిరుధ్ తన గురించి తన అభిప్రాయాల గురించి వివరించడంతో సాకేతకు ఆయన మీద దురభిప్రాయాలు తొలగిపోతాయి చంద్రిక పట్ల అనిరుధ్‌కు ప్రేమ కలగడం ప్రారంభమవుతుంది సౌందర్య పి జి ఎ ట్రన్స్ వ్రాస్తుంది

కాలక్షేపం కోసమే అనుకోండి ఉంటాను

ఇట్లు
మీ అభిమాన రచయిత
భవంతప్రసాద్

ఆ వుత్తరం చదివిన సౌందర్యకు క్రింది నేల కదిలినట్లనిపించింది

ఎంత పిచ్చి పని చేశారు అన్నయ్యా! సాకేత మీద గుడ్డి ప్రేమతో కాలు కూడా పోగొట్టుకున్నారు పాపం! ఎంత ప్రయత్నించినా కళ్ల నీళ్లు ఆగలేదు ఆమెకు

సాకేత వాళ్ల యింటికి వెళ్లినా రచయిత భవంతప్రసాద్ తన అన్నయ్యకు వ్రాసిన వుత్తరం గురించి ప్రస్తావించనే లేదు సౌందర్య నిష్ప్రయోజనం అనుకొని

******

ఆ రోజు సాకేత వాళ్ల యింటికి వస్తూ వెంట ఒక దినపత్రికను తీసుకు వచ్చింది సౌందర్య

హైదరాబాద్‌లో రవి కిరణ్ హాస్పటల్‌నుండి డిశ్చార్జి అయ్యాడు యమునాదేవి ఇంటికి వచ్చేసింది శేషాద్రిగారు మాత్రం రాలేదు ఎవరో యిచ్చిన సలహా మేరకు ఆయన కొడుకును రాజస్థాన్ తీసుకువెళ్లారు అక్కడ ఓ ప్రసిద్ధుడైన డాక్టర్ అవిటితనం బయట పడనీయకుండా కృత్రిమ అవయవాలు అమరుస్తారుట అమర్చిన అవయవాలతో నడపటంలాంటి వాటిల్లో కూడా వాళ్లే తర్ఫీదు యిస్తారుట

శేషాద్రిగారు వెళ్లి పది రోజులైంది తాము బయలుదేరి రావటానికి మరో పదిహేను రోజులు పట్టవచ్చని ఆయన వుత్తరం వ్రాసాడు నిన్ననే అందింది

ఏమిటీ దినపత్రికతో సహా వచ్చావ్? ఏదయినా ముఖ్య విషయం వుందా? అడిగింది సాకేత

ఆఁ ముఖ్య విషయమే మంచి ఎడ్వర్టైజ్‌మెంట్ పడింది ఉద్యోగ ప్రయత్నం చేద్దామనుకుంటున్నాను అంది సౌందర్య జోక్‌గా

ఉద్యోగానికి సంబంధించి ఎడ్వర్టైజ్‌మెంట్ పడిందా? ఏది ఇటు తే సౌందర్య చేతిలోని పేపర్‌ను గబుక్కున లాగేసుకుంది సాకేత

సాకేత ప్రక్కనే మంచం మీద కూర్చుంది సౌందర్య

ఒక ప్రముఖ ట్రేడింగ్ కంపెనీకి స్టెనోగ్రాఫర్ వెంటనే కావలయును టైపు షార్టుహాండ్ వచ్చి గ్రాడ్యుయేట్ అయివుండి అందమూ చురుకుదనము గలిగిన యువతులు ఈ ప్రకటన వెలువడిన వారం రోజులలోగా పూర్తి బయోడేటాతో అప్లయ్ చేయండి వయసు పాతిక సంవత్సరాలకు మించరాదు అంటూ పోస్ట్ బాక్స్ నెంబర్ యిచ్చారు ఆ నెంబర్‌తో కేరాఫ్ దినపత్రికకు మాత్రమే అప్లికేషన్స్ పంపాలి ఎవరైనా

బాగానే వుంది అప్లయ్ చేస్తే నాకీ ఉద్యోగం వస్తుందంటావా సౌందర్యా? ఎడ్వర్టైజ్‌మెంట్ చదివి సందేహం వ్యక్తం చేసింది సాకేత

నీకేం? వాళ్లు పేర్కొన్న అన్ని అర్హతలూ ఎలాగో వున్నయ్ ఇక రేపు నిన్ను ఇంటర్వ్యూ చేసేది యువకుడైతే నీ అందం చూసి అతడే మెలికలు తిరిగిపోవచ్చు అంది సాకేత

ఎద్దేవా చేస్తున్నావా?

లేదు యథార్థమే చెబుతున్నాను



## ప్రతిస్పందన

యథార్థానికి సాకేత అందంగానే వుంటుంది నలుగురు యువతులతో కలిసి నిలబడితే ఏ సగటు యువకుడి దృష్టయినా వచ్చి టక్కున సాకేత దగ్గరే ఆగిపోతుంది

మా పెద్దమ్మాయి ఈ పేదవాడి ఇంట్లో పొరబాటున పుట్టింది కొన్నిసార్లు పరిచయస్తుల ముందు స్వయానా నిరంజనరావే కూతురి అందచందాల్ని ఒప్పేసుకున్నాడు

నువ్వు చాలా అందంగా వుంటావని చిన్నతనం నుంచీ ఎంతో మంది నోటినుంచీ విన్న సాకేతకు తాను అందంగా వుంటుందన్న నమ్మకం ఏర్పడింది ఆ నమ్మకం ఏర్పడింది మొదలు అహంకారం చోటు చేసుకుంది ఆమెలో

ఆ అహంకారంతోనే కొంచెం అందం తక్కువగా వున్న అనిరుద్ధ్‌ను వెంటనే తిరస్కరించేసింది

రవికిరణ్‌కు ఆస్తిపాస్తులున్నా వట్టి తెలివిహీనుడు దానికి తోడు మూర్ఖపు పట్టుదల వుందట అందుకే అతణ్ణి యిష్టపడలేదు

సరే సౌందర్యా! నీ మాట ప్రకారమే ఈ వుద్యోగానికి అప్లయ్ చేస్తాను ఒక నిర్ణయానికి వచ్చినట్లు చెప్పింది సాకేత

* * * * * *

రోడ్డు వెంట నడిచి వస్తున్నాడు అనిరుద్ధ్ సిటీబస్‌లోంచి దిగింది సౌందర్య

హలో అనిరుద్ధ్‌గారూ అంది సౌందర్య చొరవగా

హలో హలో పరధ్యానంగా నడుస్తున్న అనిరుద్ధ్ తల ఎత్తి చూశాడు

ఆఫీసు నుంచా?

అవునండీ ఓ ఫ్రెండు నేను కలిసి సెంటర్‌దాకా వచ్చాం అక్కడ అతడు విడిపోయాడు

మీరు ఆలోచించుకుంటూ నడిచి వస్తున్నారు సరేగాని మీ నవల ఏమైంది

పూర్తయింది నేను రెండు నెలలు వ్రాసినదాన్ని నాలుగు రోజుల్లో ఫెయిర్ చేసేసిందండీ చంద్రిక ఆలోచిస్తుంటే నేను అన్ని విధాలా ఆమెకు ఋణపడి పోతున్నానేమో అనిపిస్తోందండీ

చంద్రికకు ఒకవేళ మీరు రుణపడిపోతుంటే దాన్ని తీర్చుకోవటానికి మార్గం లేదంటారా?

మీ మాటలను నేను అర్థం చేసుకోగలను ఆలోచిస్తుంటే నాకూ అంతే అనిపిస్తోందండీ నేనొక రచయితను అన్న వుద్దేశ్యంతోనో లేక బంధుప్రీతి గల మనస్తత్వం చేతనో తెలియదుగానీండి నేనంటే చాలా ఆసక్తి ప్రదర్శిస్తోంది




చంద్రిక అయితే ఆమె మనసులో అసలు వుద్దేశం మాత్రం నాకు తెలియదు నేనూ అడగలేదు ఓ రచయితగా చంద్రికలా అన్నివిధాలా సహకరించగల వ్యక్తినే చేసుకోవాలని నేను మొదట్నించీ కోరుకొంటున్నాను

చంద్రిక సరే అంటే చేసుకోవటానికి మీకు అభ్యంతరం లేదంటారు

అంతేనండీ

చంద్రిక చాలా తెలివి కలదండీ సాకేత మనసు మీ మీద లేదని తెలియగానే తను ఇష్టం పెంచుకొంది మిమ్మల్ని అన్ని విధాలా ఆకర్షించటానికి ప్రయత్నం చేసింది నా అంచనా ప్రకారం మీ అభిప్రాయం తనకు అనుకూలంగ వుందని తెలిస్తే ఎగిరి గంతేసి వప్పుకుంటుంది పోనీలెండి బడుగు జీవి నిరంజనరావుగారి గుండెల మీద వున్న రెండు కుంపట్లలో ఒకదాన్ని తీసెయ్యాలనుకుంటున్నారు చాలా థాంక్సండీ చంద్రిక అభిప్రాయం తెలుసుకుని నేను మీకు చెబుతాను

ఓ కె

మీకు తెలిసిందో లేదోగానీండి సాకేతఉద్యోగ ప్రయత్నంలో పడింది పత్రికలో ఎడ్వర్టైజ్‌మెంట్ ఒకటి పడింది దానికి అప్లయ్ చేస్తోంది

పోనీలేండి అసలే కరువు రోజుల్లో కుటుంబ పోషణ చేయలేక మామయ్య సతమతమై పోతున్నాడు సాకేత ఏదయినా వుద్యోగంలో చేరితే ఆయనకు చేదోడువాదోడు అవుతుంది సరేగానీండి మీ నాన్నగారు ఉత్తరం వ్రాశారా?

వ్రాశారండీ తిరిగి రావటానికి మరో పదిహేను రోజులు పడుతుందట

పాపం మీ అన్నయ్య విషయం తలుచుకొంటే నాకు చాలా బాధనిపిస్తోందండీ

నాకు మాత్రం అన్నయ్యను తలుచుకుంటే జాలి అనిపిస్తోందండీ

?

అనిరుద్ధ్‌గారూ! మీరు మనసులోనే దాచుకుంటానంటే ఒక విషయం చెబుతాను

నేను ఎవరితోనూ అనను చెప్పండి

సాకేతను గురించి రవికిరణ్ చేసిన ప్రయత్నాలు పడిన తిప్పలు ఆఖరికి రచయిత బసవంతప్రసాద్ నుంచీ వచ్చిన వుత్తరం అన్నీ పూస గుచ్చినట్లు చెప్పేసింది సౌందర్య

అరే ఎంత అమాయకు లండీ మీ అన్నయ్య అయినా సాకేత మనస్తత్వం ఏమిటండీ? నేనంటే అందం లేనివాణ్ణి ఐశ్వర్యవంతుణ్ణి కాదు మరి రవికిరణ్‌గారి కేమండీ? అందంగానే ఉంటారు ఆస్తిపాస్తులూ పుష్కలంగానే వున్నాయి! మరి అతణ్ణి ఎందుకు తిరస్కరించింది సాకేత?

వస్తుతః అన్నయ్య చదువులో కొంచెం మందంలెండి డిగ్రీ నాలుగోసారి పరీక్ష వ్రాసి ప్యాసయ్యాడు సాకేత దృష్టిలో అతడు తెలివిలేని వాడు అమాయకుడు అందుకే అన్నయ్యను తిరస్కరించింది మనస్తత్వం తెలిసీ మా అన్నయ్యను చేసుకో అని నేను సాకేతకు ఎలా చెబుతానండీ? నీ ఆలోచన కరక్ట్ అన్నాను ఏమిటో పిచ్చి సాకేత మీద భ్రమలకు పోయి తన జీవితాన్నే అంధకారం చేసుకున్నాడు అన్నయ్య

ఎంత పని జరిగిందండీ? ఏదైనా ఒక విషయం చెప్పగలనండీ మనిషికి అందం వుండొచ్చు కానీ అహంకారం వుండకూడదు దివి నుంచీ భువికేగిన దేవతల ప్రవర్తించాలంటే నేటి సమాజంలో ఎవరికీ చెల్లుబడికాదు

ఏదైనా ఓ స్నేహితురాలిగా నేను ఇప్పటికీ సాకేతను నిందించటంలేదు ఎవరి జీవితం వాళ్ల యిష్టం నిర్బంధం మీద ఏర్పడే అనుబంధం తాత్కాలికంగానే వుంటుంది సాకేత మనస్తత్వం తెలిసి మీరు దూరంగా జరిగారు ఆమెకు అలాగే అన్నయ్యా తన పట్ల తిరస్కార భావం వుందని తెలిశాక సాకేతను మరిచిపోయి వుంటే బాగుండేది

అందరి ఆలోచనలూ ఒకే రీతిలో ఎలా వుంటయిలెండి సరేగాని సౌందర్యగారూ! మీకు చెప్పటం మరిచిపోయాను నేను ఇల్లు మారుతున్నాను రేపు చంద్రిక వాళ్ల యిల్లు దాటాక మూడో యిల్లు రెండు గదులు వరండా పోర్షను బావుంది చెప్పాడు అనిరుద్ధ్ మాట్లాడుకొంటూ వచ్చి అనిరుద్ధ్ వాళ్ల యింటి సందు దగ్గర విడిపోయారు ఇద్దరూ

* * * * * *

నేను వెళ్ళి వస్తాను నాన్నా ఇంటి నుంచి బయలుదేరబోతూ తండ్రికి చెప్పింది సాకేత

ఆమె వెళ్ళేది వుద్యోగపు ఇంటర్వ్యూకు

'అలాగేనమ్మా బస్‌లు వేళకు దొరుకుతయ్యో లేదో రిక్షామీద వెళ్ళు జేబులో ంచి పది రూపాయలు తీసి సాకేతకు యిచ్చాడు నిరంజనరావు

ఇంటర్వ్యూ పది గంటలకు ఇంకాగంట టైముంది బస్‌లో నే వెళ్తాను

సరేనమ్మా కొత్త వాతావరణం తెలియని మనుషులు తోడు రమ్మంటే వస్తాను

అక్కరలేదు నువ్వు ఆఫీసుకు వెళ్ళు నాన్నా

తండ్రికి చెప్పి అవసరమయిన కాగితాలున్న ఫైలు తీసుకొని రోడ్డు మీదికి వచ్చింది సాకేత

వెళ్తున్న కూతురు వైపు చూస్తూ కాస్సేపు వరండాలో నే నిలబడిపోయాడు నిరంజనరావు

డిగ్రీ టైపు షార్టుహాండ్ అర్హతలున్నయి కాబట్టి కూతురికి వుద్యోగం రావచ్చుని ఆయన అంతరాత్మకు గట్టి నమ్మిక కలుగుతోంది

సాకేతకు వుద్యోగం వస్తే తమ సంసారంలోని ఆర్థిక ఇబ్బందులు చాలా వరకు తగ్గిపోవచ్చు

అంతలో నే తర్క వితర్కాలు

సెంటిమెంట్లకు పోవద్దు ఇక నా బ్రతుకంటారా అది నా యిష్టం పరిస్థితులు తలిసి వస్తే నేనూ పెళ్ళి చేసుకుంటాను అంటూ వచ్చు జెండా పూపింది సాకేత

లాంఛనంగా పెళ్ళి ముహూర్తం పెట్టుకోవటానికి అనిరుద్ధ వాళ్ల అమ్మకు వుత్తరం వ్రాసినట్టు తెలిసింది

సత్తెమ్మక్క ఈవేళో రేపో వచ్చేస్తుంది

ఖర్చు పెద్దగా లేకుండా నిరాడంబరంగా ఏ గుళ్ళోనో పెళ్ళి చేసెయ్యాలని మామయ్యకు చెప్పాలి అని సౌందర్యతో అన్నాట్ట అనిరుద్ధ

ఈ బడుగు జీవి మీద అతడికెంత సానుభూతో!

చిన్న కూతురు పెళ్ళి కట్న కానుకలతో నిమిత్తం లేకుండా జరిగిపోతోంది పెద్ద కూతురు వుద్యోగం చేయబోతోంది కష్టాల కడలిలోంచీ తను ఒక ఒడ్డున పడబోతున్నాడు మగ పిల్లలు వాళ్ళు కోరుకున్నంత వరకూ చదువుసంధ్యలు చెప్పిస్తే ఈ జన్మకు తను కృతార్థుడై పోయినట్టే అలో చిస్తున్నకొద్దీ సంతృప్తి

ఏమిటి అక్కడే నిలబడిపోయారు? భోజనం చేసి ఆఫీసుకు వెళ్ళేది లేదా?

భార్య రేణుకమ్మ మాటలతో ఈ లోకంలోకి వచ్చాడు నిరంజనరావు

"వచ్చేస్తున్నా వడ్డించు అన్నాడు పైకి

* * * * * *







ఆడపిల్ల వుద్యోగం చేసి సంపాదిస్తే ఆ డబ్బుతో కుటుంబఅవసరాలు తీర్చుకోవచ్చు అన్న స్థితికి దిగజారిపోయాడు తను

సాకేత మాత్రం చేసిందేమిటి? పెళ్ళి చేద్దామని తను ప్రయత్నిస్తే నిక్షేపంలాంటి అనిరుద్ధను తిరస్కరించింది నా జీవితం నా యిష్టం అంది వుద్యోగం చేసి ఇంట్లో సహాయపడతానంది ఇందులో స్వార్థం కొంత వుంటే వుండొచ్చుగాని తన నేరం ఏమాత్రం లేదు

అలా సరిపెట్టుకున్నాడు చివరికి

తర్వాత రెండో కూతురు చంద్రిక మీద మళ్ళిందాతడి దృష్టి

అది ఎంతో అదృష్టవంతురాలు తన ప్రమేయం లేకుండానే అనిరుద్ధను ఆకట్టుకొంది

చంద్రిక మనస్ఫూర్తిగా యిష్టపడితే పెళ్ళి చేసుకోవటానికి ఎలాంటి అభ్యంతరం లేదని సౌందర్యకు చెప్పాట్ట అనిరుద్ధ

సౌందర్య చంద్రికను అడిగితే బావను భర్తగా పొందగలగటం ఓ వరంగా భావించుకుంటాను సౌందర్యక్కా! అంటూ తన అంగీకారం తెలిపింది అది

పెద్దదానికి పెళ్ళి కాకుండా చిన్నదానికి చేయడమేమిటి? అనేదే ప్రస్తుత ప్రశ్న ఈ సంగతి గ్రహించిన పెద్ద కూతురు–

నన్ను గురించి చెల్లెలి పెళ్ళి ఆపకండి నాన్నా అనిరుద్ధ బావ, చంద్రిక ఒకరంటే ఒకరు యిష్టపడుతున్నారు ఒకటి చేసెయ్యండి వాళ్ళను నలుగురూ ఏదో అంటారని అనుకుంటారనీ అనవ సరమయిన

అంతస్తుల మీద అంతస్తులు కట్టిన పెద్ద మేడ

ఇంటర్వ్యూ జరిగేది సెకండ్ ఫ్లోర్‌లో అని తెలిసి అక్కడికి వెళ్ళింది సాకేత

అంతా సినిమా సెట్టింగ్‌లా వుంది ఎక్కడి కక్కడ నీట్‌నెస్ కనిపిస్తోంది అత్యాధునిక పద్ధతిలో ఫర్నీచర్ అమర్చారు గోడలకు రకరకాల పెయింటింగ్స్ వ్రేలాడ దీసి వున్నయి అక్కడి వాతావరణం ఆ కంపెనీ యజమాని కళాహృదయాన్ని విప్పి చెబుతోంది. తనతో పాటు మరి కొంతమంది యువతులు కూడా ఇంటర్వ్యూకు వచ్చారు. వచ్చిన వాళ్ళను వచ్చినట్టు – వరుస క్రమంలో కూర్చో బెడుతున్నాడు అటెండర్

అయిదుగురి తర్వాత ఆరో సీటు సాకేతది

ప్రొప్రైటర్ గారు రాలేదు వచ్చే టైమయిందని చెబుతున్నాడు అటెండర్

నవనిశ్చల ట్రేడింగ్ కంపెనీ – పేరు బావుంది మేడలావుంది మేడలోని ప్రతి అంగుళం బావుంది

వాతావరణాన్ని బట్టి ఈ కంపెనీ యజమాని ఓ యు... అయివుంటాడు

అంటే రంజితాదేవి నవలల్లో దర్శనమిచ్చే ఆరడుగుల అందగాడు ... వ్యక్తే నేమో ఇతడూను? ఇలాంటి వాళ్ళు వుండబట్టేనేమో రంజితాదేవి అలా నవలలు రాస్తుంది?

ఐశ్వర్యం అందంతో పాటు అర్థంచేసుకోగల మనసు సౌందర్యారాధన– అదిగాగల అన్ని సద్గుణాల్నూ– ఈ కంపెనీ ప్రొప్రైటరకూ వుంటే? అప్పుడు







# ప్రతిస్పందన

కారుదిగి మేడమీదికి వచ్చి తనగది ముందు వరుసగా కూర్చొని వున్న అందరు యువతులను – నిశితమైన ఒక్క చూపుతో పరిశీలించేస లోపలికి వెళ్ళి పోతాడు

అతడు గదిలోకి వెళ్ళిన కొద్ది సేపటికే అటెండర్ బయటికి వచ్చి సరాసరి సాకేత దగ్గిరికి వెళ్ళి మిమ్మల్ని రమ్మంటున్నారు అయ్యగారు అని పిలుస్తాడు

ప్రొప్రైటర్ సాకేతకు ప్రిఫరెన్స్ యిచ్చి లోపలికి పిలిపించు కోవటంతో ఇంటర్వ్యూకు వచ్చిన మిగతా యువతులందరూ అసూయ చెందుతారు పైకి వినిపించకుండా పెదవులు కదులుస్తూ తిడుతూంటారు

వాళ్ళందరి వైపు గర్వంగా చూస్తూ చలాకీగా లోపలికి వెళ్తుంది సాకేత

గుడ్‌మార్నింగ్ సర్!

వెరీ గుడ్ మార్నింగ్! టేక్ యువర్ సీట్

థ్యాంక్యూ సర్!

మిస్ సాకేతా, మీకు వుద్యోగం అవసరమా?

సూటిగా సాకేత ముఖంలోకి చూశాడు అతడు ఆ చూపులకు తట్టుకో లేక పోయింది సాకేత

అవసరమే నండీ – సిగ్గుతో మెలికలు తిరిగి పోతూ సమాధానం చెప్పింది

మీ నాన్నగారు ఏం చేస్తూంటారు?

చెప్పింది

మీరేం చదువుకున్నారు?

చేతిలో వున్న ఫైలు అతడికిచ్చింది

గుడ్! అర్హతలు అన్నీ వున్నయి కాబట్టి మీకే వుద్యోగం యిస్తున్నాను

కృతజ్ఞురాలినండీ

కాలింగ్ బెల్ నొక్కాడు అతడు

అటెండర్ వచ్చాడు,

మిగతా అందర్నీ వెళ్ళి పొమ్మను

చిత్తం బాబూ

అటెండర్ వెళ్ళాడు

మీరు మొదటి చూపులోనే నన్ను ఆకర్షించారు మీది ఒరిజినల్ అందం మిగతా అందరివీ పైపై మెరుగులు పౌడర్లు, స్నోలు లిప్‌స్టిక్‌లు- కావాలంటే మాత్రం అసలైన అందాన్ని తెచ్చి పెడతయ్యా?

సమాధానానికి బదులు నవ్వి వూరుకుంది సాకేత

మిమ్మల్ని స్టెనో గ్రాఫర్‌గానే కాదు నా పర్సనల్ అసిస్టెంట్‌గా కూడా నియమిస్తున్నాను ఎంత జీతం కావాలంటే అంత తీసుకోవచ్చు మీ విషయంలో లిమిటేషన్ అంటూ లేదు ఈ విషయం మేనేజర్‌కు చెబుతాను

ప్రయత్నించినా మాట్లాడ లేక పోతోంది సాకేత

బ్యూటిఫుల్ సాకేతా! నన్ను మొట్ట మొదట అమితంగా ఆకర్షించిన అందమైన యువతివి నువ్వే!

సిగ్గుతో సాకేత బుగ్గలు ఎరుపెక్కి పోయాయి

ఇప్పుడు తనంటే ఇష్టపడుతున్నట్లు చెబుతున్న అతడు భవిష్యత్తులో నిన్ను నా అర్ధాంగిని చేసుకోవాలను కుంటున్నాను అందుకు అభ్యంతరమా? అని ఏదో ఒకరోజు అడిగెయ్యను కూడా అడిగెయ్యవచ్చు

అప్పుడు తను ఒక పేదరాలినైన నేను మీకు తగుదునంటారా? అని ఎదురు ప్రశ్న వేస్తుంది

కులం మతం ఉన్నవాడు లేనివాడు- ఇవన్నీ మనకు మనం కలిపించుకున్నవే సాకేతా సెంటి మెంట్సంటే నాకు ఎలర్జీ నా దృష్టిలో మనుషులంతా సమానమే ఎవరికి నచ్చిన వాళ్ళను వాళ్ళు చేసుకొంటుంటే అభ్యంతర పెట్టే హక్కు – ఆఖరికి ఆ భగవంతుడికి కూడా లేదు నేను మెచ్చింది నిన్నుగాని మీ కుటుంబ పరిస్థితులను కాదు ఒకవేళ రేపు నువ్వు నా అర్ధాంగి వైన తర్వాత – లేమితో బాధపడుతున్న మీ కుటుంబాన్ని ఆదుకుంటానన్నా నిన్ను అభ్యంతర పెట్టను –

అతడు అన్ని విధాలా అవకాశం యిచ్చి మాట్లాడు తుంటే కాదని ఎలా అంటుంది?

మీ విశాల హృదయం ముందు నేను తలవంచు తున్నానండీ మీ వంటి వార్ని భర్తగా పొందగలగటం నా గొప్ప అదృష్టంగా భావిస్తున్నాను అంటూ వెళ్ళి అతడి గుండెల మీద తల వాలుస్తుంది సాకేత

ప్రొప్రైటర్ గారు వచ్చేస్తున్నారు – అటెండర్ హెచ్చరించటంతో ఈ లోకంలోకి వచ్చింది సాకేత

మొదట తల నెరిసిన వ్యక్తి అయన వెనక హుందాతనం మూర్తీభవించిన ఓ నడి వయస్కురాలు వచ్చారు స్టాఫ్ అందరూ లేచి వినయంగా నమస్కరించారు ఆ యిద్దరికీ

వాళ్ళిద్దరూ భార్యా భర్తలు ఆ ట్రేడింగ్ కంపెనీ నిర్వాహకులూను

ఇంటర్వ్యూకు వచ్చిన అందరితో పాటే సాకేత కూడా కూర్చున్న దల్లా లేచి వాళ్ళకు నమస్కారాలు తెలిపింది

కొద్ది సేపటికే ఇంటర్వ్యూ మొదలైంది

సీరియల్‌గా ఒకరి తర్వాత ఒకర్ని లోపలికి పంపిస్తున్నాడు అటెండర్

సాకేతను ఆ భార్యా భర్తలిద్దరూ కలిసి ఇంటర్వ్యూ చేశారు

ఆర్థిక పరిస్థితులు అడిగారు ఉద్యోగ అవసరం తెలుసుకున్నారు అర్హతలను బట్టి వుద్యోగం సాకేతకే ఇస్తామన్న – సూచన కూడా చేశారు కాకపోతే ప్రస్తుతం ఏడువందల యాభై రూపాయలు జీతం యిస్తామన్నారు వర్క్ నచ్చితే ఫ్యూచర్‌లో జీతం పెంపు చేసే అవకాశం కూడా వుందన్నారు

కంపెనీ ప్రొప్రైటర్‌గా తాను వూహించుకున్న అరడుగుల అందగాడు వేరు ఇపుడు తను చూస్తున్న వీళ్ళు వేరు అంతా తారు మారు

ఒకవిధమైన అసంతృప్తి మనసును అలుముకున్నా కుటుంబ అవసరాన్ని బట్టి ఆ వుద్యోగం చేయటానికి అంగీకరించింది సాకేత (ఇంకా ఉంది)

# ఉక్కుతో దీటైన శక్తినిచ్చే...

# విష్ణు సిమెంట్

**ప్రత్యేకమైన హైగ్రేడ్ లైమ్‌స్టోన్‌తో తయారై**
**మరేయితర సిమెంటుకన్నా**
**అత్యధిక ధృడమైనది**




శ్రీ విష్ణు సిమెంట్ లిమిటెడ్

గుల్‌మొహర్ ఎవెన్యూ రాజ్‌భవన్ రోడ్ హైదరాబాద్ 500 482




MARS SVCL 15/86

# శ్రీమతి సౌమ్య

మంత్రవాది మహేశ్వర్

ప్లాట్‌ఫారం అంతా హడావిడిగా వుంది

గోదావరి ఎక్స్‌ప్రెస్ బయలుదేరడానికి ఇంకా పావుగంట టైముంది రిజర్వేషన్ చార్ట్‌లో పేరు–సీటూ చూసుకుని కంపార్ట్‌మెంట్ దగ్గరికి వచ్చి నిలబడ్డాను

నేను లోపలికి వెళ్ళిపోయి కూర్చుంటే కుమార్ వెతుక్కోవలసి వస్తుందని అక్కడే నిలబడ్డాను

బండీ బయలు దేరబోతోందన్న అనౌన్స్ మెంట్ వినగానే నా స్థలం చూసుకుని కూర్చున్నాను సింగిల్ సీటు – లోవర్ బెర్త్ బ్రీఫ్ కేస్ సీటు క్రిందికి తోసేశాను

నా ముందు ఓ పాతికేళ్ళ యువతి

కాళ్ళను సీటు పైకి పెట్టుకుని దానిపైన ముఖం వాల్చుకుని కూర్చుంది ఒక చిన్న పెట్టి ఆమె సీటుక్రింద వుంది

గార్డ్ విజిల్ వేశాడు

బండీ కదిలింది కిటికీ అవతల వున్న వాళ్ళు వాళ్ళవాళ్ళకు చేతులూపుతున్నారు కొందరు ప్లాట్‌ఫారం మీది తమ వారిని వదల్లేక వదల్లేక పోతున్నట్టు ఎంట్రన్స్ దగ్గర గుంపుగా వున్నారు

అనకాపల్లి ఎలమంచిలి అన్నవరం వచ్చే సరికి సమయం ఆరూనలభై అయిదు

ఆమెలో చలనం లేదు

తలైనా ఎత్తకుండా అలా కూర్చుందేమిటబ్బా నా మనసులో ఒకటే ఆలోచన

నా ఆలోచనలు అలా వుండగానే ఆమె తలెత్తింది

కళ్ళెర్రగా వున్నాయి అయినా ముఖం చాలా కళగా వుంది కిటికీ ప్రక్క సీటు కావడంతో గాలికి ముంగురులు ముఖం మీద పడుతున్నాయి

లేత ఆకుపచ్చరంగు చీర అదే రంగు జాకెట్టు

నా వైపు చూసిందో లేదో అంతలోనే కిటికీలోంచి బయటకు తన దృష్టిని మరల్చింది

నాలో ఆమెను పలకరించాలన్న ఆతృత ఎక్కువైంది

కానీ ఏమనుకుంటుందో?

ప్రక్కసీట్లకేసి చూశాను ఎవరో బెంగాలీ వాళ్ళలా వున్నారు పెళ్ళిజనమేమో వాళ్ళ హడావిడిలో వాళ్ళున్నారు అసలు ఎవరినీ పట్టించుకునే స్థితిలో కూడా లేరు వాళ్ళు

బ్రీఫ్ కేసును బయటకు లాగి అందులో వున్న వారపత్రికను బయటకు తీశాను

ఓ పావుగంట పేజీలు త్రిప్పాను

చేతిలో పుస్తకం వుందన్న మాటే గానీ మనసుదాని మీద లేదు ఆమె మీదే వుంది

మాట్లాడాలని వుంది

ఏమనుకుంటుందో – మరోసారి అనిపించింది

పుస్తకం మూసేస్తూ చూస్తారా అనడిగాను

వద్దండీ థ్యాంక్స్ ముక్తసరిగా అంది

కాసేపు మౌనం తరువాత కాళ్ళులేని ఓ కుర్రాడు దేక్కుంటూ వచ్చి కంపార్ట్‌మెంట్ అంతా ఓ గుడ్డతో శుభ్రం చేసి డబ్బులడుగు తున్నాడు లేదనగానే పీడించకుండా వెళ్ళిపోతున్నాడు మా దగ్గరికొచ్చి చేయి చాచాడు నా దగ్గర చిల్లర లేదు

ఆమె పర్స్ తీసి అందులోంచి ఓ పావలా బిళ్ళ ఆ కుర్రాడికి అందించింది

నా పర్స్ తీశాను రూపాయి నోటిచ్చాను వాడికి ఆమె చూస్తుందనుకున్నాను కానీ పట్టించుకున్నట్టు లేదు

పిఠాపురం వచ్చే సరికి ఏడుంపావు

మరి కాసేపు మా మధ్య మౌనం రాజ్యమేలేక హైదరాబాదు వెళ్ళేటప్పటికి ఉదయం ఎంతవుతుంది ఆమే అడిగింది

నన్నే–

ఆరున్నరవుతుంది సికింద్రాబాద్ చేరేసరికి ఆ తరువాత ఎంత టైమ్ అవుతుందో ఆ భగవంతుడు కూడా చెప్పలేడు అన్నాను

హైదరాబాద్ సికింద్రాబాద్ ప్రక్కప్రక్కనేగా అందామె

అటువైపు ప్రయాణం ఇదే మొదటిసారి కాబోలు అనుకున్నాను

మీ వాళ్ళెవరైనా వున్నారా అక్కడ అడిగాను

ఊఁ– ఇష్టం లేనట్టు –పైగా అలస్యంగా వచ్చిందా సమాధానం

మీది విశాఖపట్నమేనా

అవును

అడిగిన దానికి అంత ఖచ్చితంగా చెప్పేసరికి ఆ విధానానికి మరో ప్రశ్న వేసే ధైర్యం చాల లేదు నాకు

ఇంతలో టి టి ఇ వచ్చి టికెట్స్ అడిగాడు

అప్పుడు షీట్లో పేరు చూశాను– సౌమ్య కుమారో శ్రీమతో తెలుసుకుందామనుకునే లోపల టి టి ఇ పేపరు త్రిప్పేశాడు లేచి వెళ్ళిపోయాడు

మీరెక్కడైనా జాబ్ చేస్తున్నారా

చేస్తే బాగానే వుండేదేమో– ఆమె సమాధానం ఆమెలోని అసంతృప్తిని తెలియ జేసింది

ఇప్పుడు చేయచ్చుగా అంతగా చేయాలనుంటే అన్నాను

ఒక పొడినవ్వు నవ్విందామె

ఆ నవ్వులో – నీకేం నువ్వెన్నైనా చెప్పగలవు ఏమైనా చెప్పగలవు అన్న భావం వుంది ఎవరి కోసం చేయను అన్న ప్రశ్న వుంది

కిటికీలోంచి లోనికి వచ్చే గాలికి ఆమె పైట కాస్త ప్రక్కకు జరిగింది

మెడలోని మంగళసూత్రాలపైన నా దృష్టి పడింది

పెళ్ళయిందన్న మాట మనసులో అనుకున్నాను

భర్తతో దెబ్బలాట గానీ జరిగిందా లేకపోతే వాళ్ళ వాళ్ళెవరికైనా ఒంట్లో బాగులేదా – రకరకాల ఆలోచనలు అంతుపట్టలేదు ఆమె ముభావంగా వుండటంతో నా సరదా చచ్చిపోయింది పోనీలే– ఆమె మనసు బాగులేనప్పుడు మనం ఏం మాట్లాడినా విసిగించడమే అవుతుందనిపించింది

రైలు వేగంగా పరిగెడుతోంది

సామర్లకోట వచ్చేసింది

మేడమ్ మీరు టిఫిన్ చేస్తారా

ష్ వద్దండి

మీరు ట్రైన్‌లో ఏం తీసుకోరా

ఇప్పుడేం తీసుకోను

అయితే నన్ను కూడా మానేయమంటారా

మీరెందుకు మానటం

ప్రక్కన మీరేం తినకుండా–

మరేం ఫరవాలేదు మీ దారి మీదే

కాస్త బాధనిపించింది ట్రైన్ దిగి వెళ్ళి టిఫిన్ చేసి ఫ్రూట్స్ తీసుకొచ్చాను ఆమె కోసం ఒక ఆపిల్ ఓ నాలుగు అరటి పండ్లు పట్టుకొచ్చాను –

తీసుకోండి

వద్దన్నాను కదండి

టిఫిన్ వద్దన్నారు ఇవి ఫ్రూట్స్

ఎంతకీ తీసుకోక పోయేసరికి ప్లీజ్ ఏమనుకోనంటే ఒక విషయం అడుగుతాను ఎందుకంత బాధగా వున్నారు

ఏం లేదండీ బానే వున్నాను

చూస్తున్న నా కళ్ళు చెప్తున్న మీ ముఖం అబద్ధం ఆడుతున్నాయంటారా

మీరు సైకాలజీ చదివారా

లేదు ఎకనామిక్స్ అయితే మనుషుల్ని చదవగలను

—————— ఆమె మౌనంగా వుండి పోయింది

బెంగాలీ వాళ్ళు కబుర్లు చెప్పుకుంటున్నారు గలగలా నవ్వుకుంటున్నారు

మీది లోవర్ బెర్తా అడిగింది

అవుననుకోండి మరేం ఫరవాలేదు మీరిక్కడే వుండండి నేను పై బెర్త్ మీదికి వెడతాను

థాంక్స్ నేనడక్కుండానే హెల్ప్ చేస్తున్నారు

"ఇందులో పెద్ద హెల్ప్ ఏముందండి".

వాచీ చూసుకున్నాను.... తొమ్మిది దాటుతోంది. నేను పీక్లో తీసుకుని అప్పర్ బెర్త్ మీదకి వెళ్ళిపోయాను.

సగం రాత్రి వరకూ నిద్రే పట్టలేదు..... ఎప్పుడో నిద్రపట్టేసింది.

మెలుకువ వచ్చే సరికి రైలు కాజీపేట స్టేషను దాటేసింది.



క్రింద బెర్త్ మీదకు చూశాను.

ఆమె లేదు-

ఆమె సూట్‌కేస్ లేదు-

కాజీపేటలో దిగిపోయినట్టుంది. హైదరాబాద్ అనుకున్నాను. కనీసం చెప్పనైనా చెప్పలేదు. ఏం బాధలో వుందో ఏమో పాపం.

అయినా ఎందుకో నాకు ఆమె మీద ఒక పవిత్రమైన భావం ఏర్పడింది ఏదో తెలియని అభిమానం ఎదలో తుల్తోంచి

పెళ్ళయిన రెండేళ్ళకే ఆత్మహత్య చేసుకుని ఈ లోకం వదిలేసిన అక్క గుర్తొచ్చింది

ఖాళీగా వున్న క్రింది బెర్త్ పైన టవల్ కనిపించింది

ఆమె మరచిపోయినట్టుంది - తీశాను

టవల్‌లో డైరీ డైరీ పైన సౌమ్య బి ఎ లోపల

# ఇ•వేమన•పద్యాలు




దొంగతనము రంకు దొరసియుండు జగతి
రంకులాడికైన శంకబుట్టు
ఎంతవారినైన కంతుడు బాధించు
విశ్వదాభిరామ వినురవేమ

## శ్రీమతి సౌమ్య

చూశాను

–ఆమెకు పెళ్ళయి ఎనిమిది మాసాలవుతోంది కట్నం కోసమే వాళ్ళు ఆ పెళ్ళికి యస్ అన్నారు భర్తకు నోరులేదు తల్లి ఎంత చెబితే అంత అంతేకాదు త్రాగుబోతు బయటసుఖాలను కొనుక్కుంటున్నాడని తెలిసింది తనకి ఎల్లలు కలగకుండా భయపెట్టి బలవంతంగా ఆపరేషన్ చేయించేసింది అత్త ఆ విషయం లోకం దృష్టిలో పడకుండా దాచి కొడుక్కి మళ్ళీ కట్నం కోసం పెళ్ళి సన్నాహాలు ప్రారంభించింది మరో ఆడదాని జీవితం తన జీవితంలా నాశనం కాకూడదని పెళ్ళి వారికి ఉత్తరం వ్రాసినట్లు తెలియడంతో తనని కిరసనాయిలు పోసి అంటించేయటానికి ప్రయత్నం కూడా చేసింది

జనవరి పదికి ఓ వారం ముందునుంచీ ఏం వ్రాసివుందో లేదు ఆ డైరీలో –

డైరీ అటూ ఇటూ త్రిప్ప చూశాను అందులో సౌమ్య భర్త వాళ్ళ అమ్మ సౌమ్యను చంపడానికి చేస్తున్న ప్రయత్నాలు పెళ్ళి సంబంధాల వివరాలూ వున్నాయి మరో ఉత్తరంలో తను ఊర్లో లేని సమయంలో సౌమ్యను చంపి ఓ ప్రమాద సంఘటనగా తీర్చి దిద్దమని వ్రాసిన ఉత్తరం సౌమ్య ఫొటో చూపించినట్లు అమ్మితే కొనడానికి బొంబాయిలో ఓ వ్యక్తి రడీగా వున్నాడని పదివేల దాకా ఇవ్వచ్చునని వ్రాసిన ఇంకో ఉత్తరం

–డైరీ ద్వారా ఉత్తరాల ద్వారా పరిస్థితి అర్థమైంది

★ ★ ★ ★ ★

సికింద్రాబాదు స్టేషను

పేపర్ చూడగానే షాకింగ్ న్యూస్

అత్తను చంపిన కోడలు హెడ్డింగ్ క్రింద ఫొటో

ఫొటోను సులభంగా గుర్తుపట్టడానికి కారణం ముందు రోజునే సౌమ్యను చూడటం

పోలీసులు దర్యాప్తు జరుపుతున్నారని ఆమె కనిపించటం లేదని న్యూస్ స్పష్టం చేసింది

సౌమ్య హత్య చేసే వుంటుంది నాకూ అనిపించింది

అయినా తప్పేం కనిపించలేదు నాకు అయితే చట్టం దృష్టిలో ఆమె నేరస్థురాలే ఆమె ధైర్యం చేసి అత్తగారి ఆగడాలకు ఈ రకంగా చరమగీతం పాడింది మరెందరో అటువంటి అత్తలు భయపడేలా చేసింది

అత్తగారి అక్రమాలు భర్త దుర్మార్గం చట్టం దృష్టికి తేవడానికి తగిన సాక్ష్యాలు ఆధారాలు అన్నింటినీ మించి ఆలోచన అవకాశం ఆమెకు లేకపోవచ్చు ఉన్నవి చాలవనే భయం కావచ్చు పలుకుబడి డబ్బు లతో తనకు న్యాయం జరగదేమోనన్న సంశయం అయివుండచ్చు.

తనతో పెళ్ళినాడు ప్రమాణాలు చేసిన భర్తే తనని అమ్మి సొమ్ము చేసుకునే పథకాలు వేస్తున్నప్పుడు ఎక్కడుంది రక్షణ?

ఆ రక్షణ లేక ధైర్యం లేకనే అక్క స్వప్న ఆత్మహత్య చేసుకుంది

సౌమ్య మరో స్వప్న కాలేదు అదే నాకు సంతోషం కలిగించింది

పరిస్థితుల్ని చక్కబరచుకోవాలంటే ధైర్యం కావాలి

అయితే సౌమ్య దోషి–

పైగా ఆమెను కాపాడ గలిగే సాక్ష్యాలు – డైరీ ఉత్తరాలు షాటిని మర్చిపోయింది

ఆమె కాజీపేటలో నే వుండి వుండాలి

ఎలాగైనా సరే అడ్వకేట్ ఫ్రండ్ బలరామ్‌తో ఈ ఆధారాలతో ఆమెను ఈ కేసునుంచి తప్పించి నిర్దోషిత్వాన్ని రుజువు చేయాలి ఖచ్చిత మైన నిర్ణయం తీసుకున్నాను

ఎందరో అత్తలకు సౌమ్య జీవితం గుణపాఠం కావాలి–

ధైర్యంతో ప్రవర్తించిన సౌమ్యకు మనశ్శాంతిని కలగజేయాలని టాక్సీ మీద కాజీపేట బయలు దేరాను స్టేషన్‌కు రిసీవ్ చేసుకోవడానికి వచ్చిన బలరామ్ తోనే □



# దూరదర్శనం

లత

## చక్రవర్తి

అక్షింతల రూబెన్ మిత్రుడు జేమ్స్ అనే కొత్త పాత్ర ప్రవేశించింది- డిటెక్టివ్‌ట అతన్ని దయ్యం వేషంలో వచ్చి చంపుదామని అతని శత్రువు ప్రయత్నించి తనే చిక్కిపోయాడు ఇంత అకటా వికటపు అర్థాన్నపు దిక్కుమాలిన శ్రార్ధ యోగ్యమైన దబ్బింగు చండాలపు నాటిక ఇక ఎక్కడా చూడం-

## శుబహ్

శివశంకరి రచించిన తమిళ నవల ఆధారంగా వస్తున్న సీరియల్ నాటిక అద్భుతమైన సక్సెస్ ఇది- దర్శకత్వం బరత్ రంగాచార్య

ప్రేమ్- అతని స్నేహితుడూ పూర్తిగా డ్రగ్ ఎడిక్ట్స్ అయారు ప్రేమ్ ఆ నిషాలో తనే దేవుడనని అనుస్తాడు సముద్ర తరంగాల్ని చాకుతో సరిదిద్దుతున్నానని భ్రమిస్తాడు ఈ క్షణం ఈ మడియ మాత్రమే జీవితం అంటాడు డాక్టర్ కోలుకొన్న తన పేషంటుతో నీ స్నేహితులు డ్రగ్ ఎడిక్ట్స్ అయారని చెపుతాడు పోలీసులు మీ ఇద్దర్నీ గుర్తించుకుంటారని ప్రేమ్‌కి వార్నింగిస్తాడు అంతవరకు అయింది కథ ఈ తడవ ఆ మత్తు మందుల గుడిసెలో ఒక ఆడపిల్లని కూడా చూపించారు గతంలో నేను మార్చుయానా అని ఒక చిన్న నవల ఇరవయి ఏళ్ళ క్రితం వ్రాసినప్పుడు పరిస్థితులు ఇంత ఘోరంగా లేవు గాని అవుతాయని వ్రాశాను నా జోస్యం నిజమవటం నాకు అపార దుఃఖాన్ని కలిగిస్తున్నది

## సెలవు దొరికింది

రచన కస్తూరీ ప్రసాద్ ఈ మధ్య పాము బాబోయ్ పాము ట్రాన్స్‌ఫర్లు ఒస్తున్నాయి జాగ్రత్త ఇప్పుడు సెలవు దొరికింది అన్నీ ఆఫీసు సబ్జక్టులే అందుకే సెట్టు కూడా మారకుండా తీసిన ఈ నాటకం ఎలా ఉంటుందో వచ్చే వారం చూద్దాం సినిమా పాటలు వస్తుండగా మళ్ళీ కరెంటు పోయింది కరెంటు ఎందుకు పోతోందో అర్థం కాదు గత ప్రభుత్వంలో మీటరు చూసి నెల కింత అని కట్టించుకునే వారు ఇప్పుడు నెల వారీ బిల్లులు పెరిగినయ్ అదికాక సంవత్సరానికి నాకు వెయ్యి రూపాయలు వేరే అందరికీ అంతే అయినా సుఖం లేదు కరెంటు పోతుంది

## స్వయం సిద్ధ

రచన విజయ తెందూల్కర్ విడాకులు తీసుకున్న స్త్రీలు ఒక చోట చేరి వారి భర్తలు ఏ కారణం చేత విడిచి పెట్టారో చెప్పి నిర్మలని నీ భర్త ఎందుకు విడిచి పెట్టాడు? చెడ్డవాడా? కాదు! త్రాగుతాడా? లేదు! కొడతాడా? కొట్టడు ఏ విధంగానయినా హింసిస్తాడా? లేదు మరి విడాకు లెందుకు? అన్న ప్రశ్నకి ఏ సమాధానం చెప్పలేదు కూరగాయల మార్కెట్లో కనిపించిన మరో స్త్రీ నీ భర్త నీకు కావాలని ఉందా? లేదు! అయితే మంగళసూత్రా లెందుకు?

ఇంటికొచ్చి మంగళసూత్రాలు తీసి పెట్టెలో పడేసింది స్వయంసిద్ధ ఏమిటో గోల!

## రామాయణం

ఈ వారం సీతా కల్యాణం అయింది విమర్శనాపూర్వకంగా చూస్తే తప్పులుండ వచ్చును కాని ఈ మాత్రం రామాయణం మనం టి వి లో చూడటమే గొప్ప విషయం ఉదాహరణకు శంకరాచార్య విరచితమైన శివేసర్వార్థ సాదకే అనే శ్లోకం సీతాకల్యాణ సందర్భంగా వాడటం శంకరుడు పది పన్నెండు శతాబ్దాల మధ్య ఉన్న మహనీయుడు జనకుడు రాముడి కాళ్ళు అరిగేదాకా కడగటం బాగా లేదు డిగ్నిటీ అనే పేరుతో స్లోగా నడిపించడం లాటివి అవసరం లేదు సీతని పట్టుకుని మత్తకుంజరగామినీ అనటం అర్థం మదించిన ఏనుగు నడక అని అర్థం ఇది రాముడికి వాడవలసిన పదం ఆ లెక్కన స్త్రీ సౌందర్య వర్ణన వాల్మీకి అనౌచిత్యంగా ఎక్కడా వాడలేదు రాముడిని కూడా పుంసాంమోహన రూపాయ- అన్నాడు- సుబగలాటి పదాలు అనంతర ప్రక్షిప్తాలు- ఇది మన బాపూగారో విశ్వనాధ్‌గారో తియ్యవలసిన చిత్రం రామానంద సాగర్‌జీ కొంచెం తబ్బిబ్బు పడుతున్నారు ఉత్తర రామాయణం మనకి ఇస్తే బాగుండును

## ఏక్ కహానీ

ఒప్పు- రచన మధు మంగేశ్‌కర్ని కొంకణి కథ- ఒక తల్లికి ముగ్గురు పిల్లలు పాలు ఇవ్వాలని కలలు గంటుంది- ఆవుపాలు అమ్మకుండా పిల్లలకే ఇవ్వాలి ఆవుపాలు ఆ తల్లి యశోద కలలవి కాని పట్నంలో హర్తాళ్ అవటం వలన నెల నెలా వచ్చే మనియార్డరు రాదు పాలు అమ్ముకోక తప్పదు గోపాల్ అతని తమ్ముడు క్రిష్ణ పాలు హోటలుకి పోయటానికి బయలు దేరతారు దారిలో కాసిని పాలు తమ్ముడి కిచ్చి నీళ్ళు కలుపుతాడు గోపాల్ ఇంటి కొచ్చేసరికి క్రిష్ణ మూతి నిండా పాలు అంటుకుని ఉంటాయి నువ్వు పాలు తాగావా? అంటుంది తల్లి అంతే కథ డైరెక్షన్ బాగుంది

షేక్స్‌పియర్ మహాకవి వ్రాసిన ప్రఖ్యాత నాటకల్లో జూలియస్ సీజర్ ఒకటి మొదటి భాగం ఈ రోజు చూపించారు సీజరు మీద ప్రజాస్వామ్య విరుద్ధంగా రాజులాగా ప్రవర్తిస్తున్నాడనీ రాజవుతాడనీ కాషియస్ బ్రూటస్‌కి నూరిపోసి సెనెటర్లందరిచేతా హత్య చేయడానికి ఒప్పిస్తాడు-

జాన్ గిగిల్స్- జేమ్సుమాసన్ లూయీ శేల్ హర్స్- మార్లిన్ బ్రాండోల నటన లాగా ఈ నటుల నటన లేకపోయినా గతంలో అట్ట ముక్కల సెట్ల డైలాగుల కన్న ఇది బాగానే ఉంది □

రామాయణంలో రాముడు సీతగా అరుణ్‌గోవిల్ దీపిక





అమరజీవి పొట్టి శ్రీరాములు మెమోరియల్ సొసైటీ ఆధ్వర్యాన మదరాసులో మార్చి 16వ అమరజీవి 87వ జయంతి ఉత్సవం జరిగింది డాక్టర్ మోటూరి సత్యనారాయణగారు సత్యాగ్రహం ద్వారా సామాజిక పరివర్తన అనే అంశంపై అమరజీవి స్మారక ఉపన్యాసం చేశారు



మచిలీపట్నం లయనెస్ క్లబ్‌నకు డిస్ట్రిక్ట్ ప్రెసిడెంట్ అధికార పర్యటన సందర్భంగా నిర్వహించిన కార్యక్రమంలో వికలాంగురాలైన పేద బాలికకి చక్రాల కుర్చీని వారి ద్వారా అందజేస్తున్న దృశ్యం లయనెస్ ప్రెసిడెంటు శ్రీమతి టి ఎ హెచ్ సూర్యకుమారి డిస్ట్రిక్ట్ ప్రెసిడెంటు శ్రీమతి బి సీతాకుమారి లయనెస్ సెక్రటరీ శ్రీమతి ఎం నాగలక్ష్మిగార్లని చిత్రంలో చూడవచ్చు

# అవీ-ఇవీ-అన్నీ

## రామరాజు జానపద విజ్ఞాన బహుమతి

జానపద సాహిత్యానికి ఆచార్య బిరుదురాజు రామరాజు చేసిన విశేష కృషిని పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు ఒక వార్షిక బహుమతిని ప్రకటిస్తున్నదని ఆ సంస్థ అధ్యక్షులు ప్రొఫెసర్ నాయని కృష్ణకుమారి తెలియజేశారు

రచయితలు జానపద విజ్ఞానంలోని ఏ అంశం మీదనైనా ఫుల్‌స్కేప్ సైజులో 150 పుటలకు తక్కువ గాకుండా 200 పుటలకు ఎక్కువ కాకుండా వ్రాసిన వ్రాత ప్రతి మూడు ప్రతులు పరిషత్తుకు పంపించాలి వ్యాసకర్త ఒక్కరే అయి ఉండాలి ఉత్తమ గ్రంథానికి వెయినూట పదహారు రూపాయల నగదు బహుమతి రామరాజు జానపద విజ్ఞాన బహుమతి పురస్కారం ఉంటాయి బహుమతి గ్రహీత పుస్తకాన్ని ప్రచురించుకోవచ్చును ఎంఫిల్ పిహెచ్ డి సిద్ధాంత వ్యాసాలు ఈ బహుమతి పరిధిలోకి రావు ముగ్గురు విద్వాంసులు పరిశీలించే ఈ పోటీలో పరిషత్తుదే తుది నిర్ణయం వ్రాతప్రతులను 1987 సెప్టెంబర్ 30 లోగా ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు ఉస్మానియా విశ్వవిద్యాలయం హైదరాబాదు 500007 అనే చిరునామాకు పంపించాలి □

## ఉత్తరాలు

( 7 వ పేజీ తరువాయి)

### కథలు

గంగుల నరసింహారెడ్డి గారి ఈ సమాజం ఏం చేస్తోంది? కథ వాస్తవానికి దగ్గరగా వుంది తమ కొచ్చే జీతాన్నంతా త్రాగుడికే తగలేస్తూ భార్యా పిల్లల్ని హింసిస్తూ శారీరకంగానూ మానసికంగానూ నాశనమైపోతూ చీడ పురుగుల్లా బ్రతికే సుబ్బారావు లాంటి వాళ్ళు ఈ సమాజంలో కోకొల్లలు కథాంతంలో కాలనీ వాళ్ళందరూ సుబ్బారావుకి బుద్ధి చెప్పిన తీరు అపూర్వం- రచయితకు అభినందనలు

– మోదేకుర్తి సత్యనారాయణ అన్నవరం □

## న్యూఢిల్లీ లేఖ

( 4 వ పేజీ తరువాయి)

చెప్పారంటే దానిని అతి తక్కువమందే నమ్మారను కోండి రక్షణ శాఖ చాలా ముఖ్యమైన బాధ్యతగలది కనుక ఈ మార్పు జరిగిందని అది ప్రధాన కారణం కాదని ఇప్పుడు తేలుతున్నది

గురుమూర్తి వ్యవహారం చాలా అనుమానాస్పద పరిణామాల గురించి వాస్తవాలను వెలికి తెచ్చింది పాలక రాజకీయ వర్గానికి చెందిన వారని చెప్పబడుతున్న పురుషుల బహుభార్యత్వాల సంబంధాలను ఈ వ్యవహారం బైటికి తెచ్చింది స్విట్జర్లాండ్‌లో గుప్త నిధుల గురించి న్యూయార్క్‌లోని పరిశోధక సంస్థల గురించి ఇటాలియన్లు భాగస్వాములుగా ఉన్న బోగస్ కంపెనీల గురించీ ఎన్నో కథలున్నాయి ప్రధాన మంత్రి స్నేహితులైన వారితో కలసి ఇంకెక్కడా చోటు లేనట్టు స్విట్జర్లాండులో కంపెనీ పెట్టి అక్కడ బ్యాంకు అకౌంట్లు తెరుస్తున్న ఈ ఇటాలియన్లు ఎవరు? వాళ్లు వీళ్లతో ఎందుకు పొత్తు కుదుర్చుకున్నారు? ఈ వ్యవహారంలో ఎక్కువ రహస్యాలు తెలిసిపోయే సమయం దగ్గరలో ఉన్నందు వల్లనే విశ్వనాధ్ ప్రతాప్ సింగ్‌ను అక్కడి నుంచి మార్చారా? రామనాథ్‌గోయెంకా ఇల్లూ కార్యాలయమూ సోదా చేసినది ఆ కారణంతో నేనా బహుశా ఆ వృద్ధుడు అవసరమైన దానికంటే ఎక్కువ తెలుసుకున్నాడనేనా?

గోయెంకాకు ఇలాంటి వాటితో తల పండి పోయింది గనుక ఆయన పట్టుబడలేదు గురుమూర్తి పట్టుబడిపోయాడు రాజ్యాంగంలోని 78వ అధికరణం అనే సాంకేతికమైన అంశం కన్నా రాష్ట్రపతి ప్రధాని మధ్యనే రాజీవ్ ప్రభుత్వానికి అంతిమంగా ఎక్కువ నష్టదాయకంగా పరిణమిస్తున్నది

ఇటువంటి పరిణామాల పట్ల నాకేమీ ఆశ్చర్యం లేదు ఎందుకంటే ఇటువంటిదేదో జరుగుతుందని మేము ఎన్నో నెలలుగా చెపుతూనే వస్తున్నాం ఈ మాట చెప్పడానికి నేను విచారిస్తున్నప్పటికీ ఒకటి మాత్రం చెప్పాలి సవ్యమైన రాజకీయ క్రమం కొనసాగకుండా ప్రధానమంత్రిగా రాజీవ్‌గాంధీని నియమించడం ద్వారా జ్ఞానీ జైల్‌సింగ్ తప్పటడుగు వేశారు మొట్టమొదటిగా ఉల్లంఘించబడిన నియమం అదే ఆ ఉల్లంఘన చేసినది రాజీవ్‌గాంధీ కాదు జ్ఞానీ జైల్‌సింగ్ ఆయన ఆ పని ఎందుకు చేశారు? మనకు తెలియదు తమ మీద రాజకీయ వత్తిడులు ఏమి ఉన్నప్పటికీ ఆయన నిబంధనల ప్రకారం ప్రవర్తించి ఉండవలసింది ఒక చైనీస్ సామెత ప్రకారం ప్రపంచంలోకెల్లా సుదీర్ఘమైనటువంటి యాత్ర కూడా మామూలుగానే మొట్ట మొదటి అడుగుతోనే మొదలవుతుంది ఆ అడుగు తప్పటడుగు అయితే మొత్తం ప్రయాణం తప్పు దిశలో సాగుతుంది భారతదేశం వంటి సువిశాల వివిధ సంస్కృతులు గల దేశం చట్టబద్ధంగా తప్ప మరొక రకంగా పాలించబడటానికి వీలులేదు అందులో సాంప్రదాయాలు నియమాలు ముఖ్యమైన భాగాలు 1984 అక్టోబర్ 31న రాష్ట్రపతి ఒక పొరపాటు చేస్తున్నారని ఆయనకు ఎవరూ సలహా ఇవ్వక పోవడం దురదృష్టకరం ఆ రోజున ఆయన కుట్రదారులైన ఒక వర్గం ప్రతిపాదించిన ఒక వ్యక్తికి ప్రభుత్వాధికారాన్ని అప్పగించారు అందులో పార్టీకేమీ ప్రమేయంలేదు ప్రతి విషయంలో లాగే జీవితంలో కూడా కర్మని బట్టే ఫలితం ఉంటుంది □

# హైదరాబాద్ నోట్‌బుక్

## వోటర్లు చెప్పిన పాఠాలు

మన రాష్ట్రంలోని మండలాదుల ఎన్నికలు పొరుగు రాష్ట్రాలయిన పశ్చిమ బెంగాల్ కేరళ రాష్ట్రాలలోను కాశ్మీర్‌లోను జరిగిన విధాన సభ ఎన్నికలు పరిశీలించగా వోటర్లు రాజకీయ నాయకులకు పెక్కు గుణపాఠాలు చెప్పారనే తోస్తుంది నాకు చూడగా అస్సాం నుంచి ప్రారంభించి రాజస్థాన్ వరకు కాంగ్రెస్సేతర ప్రభుత్వాలు భారత మాతను తోమాలగా అలంకరిస్తాయేమో నని అనిపిస్తుంది అస్సాం త్రిపురాలు ఆ కొననుంచి పిదప పశ్చిమ బెంగాల్ ఒరిస్సాలో ఎన్నికలు పెడితే- అక్కడ కాంగ్రెస్ లోని లుక లుకలను బట్టి- కాంగ్రెస్సేతర పక్షాలే గెలిచే అవకాశం వుంది పిదప మన రాష్ట్రం పొరుగున వున్న తమిళనాడు కర్నాటకాలు ఇప్పుడు కాంగ్రెస్సేతర రాష్ట్రాలకు కేరళ కూడ తోడయింది వచ్చే ఎన్నికలలో గుజరాత్ కాంగ్రెస్సేతర పక్షాలకు పోవచ్చు హరియాణా హిమాచల్ ప్రదేశాలు కూడ మారే సూచన లున్నాయని ఎన్నికల పండితులు అంటున్నారు ఈ ఎన్నికలలో వోటర్లు చెప్పిన పాఠాలు నాకు చూడగా ఇవి వాగ్దానాలకు వోటర్లు మోసపోరు ఇంతవరకు ప్రతి రాజకీయ పక్షమూ అధికారంలో వున్నా లేక పోయినా వాగ్దానాల పరంపరను ప్రతి సారీ ఇచ్చేది ఎన్నికల తర్వాత ఆ పరంపర పరపరా గాలికి ఎగిరి పోయేది జనం ఈ వాగ్దానాలకు విసిగి పోయారు వారికి కావలసింది పని పని ఏ కొంచెం చేసినా సంతోషించి వోట్లు వేసినట్లు తెలుస్తుంది పరిశుభ్ర మైన ప్రభుత్వం నెలకొల్పుతామనే మాటలూ ఎవరూ విన్నట్టులేదు రాజకీయాలలో పరిశుభ్రత గాంధీజీతో నే పోయింది అధికారం హస్తగతం అయ్యే వరకు ప్రతి పార్టీ పరిశుద్ధంగా నిప్పులాగే వుంటుంది అధికారమనే నివురు కప్పగానే దాని వేడి వాడి తగ్గి క్రమంగా నివురయిపోతుంది ప్రచారానికి పార్టీ గొప్పతనాన్నో నాయకుల పరంపరా వైభవాన్నో ని ర ంతరం ఏకరువు పెట్టే ప్రచారానికి వోటర్లు మోసపోలేదని స్పష్టమవుతుంది తమ ఇష్టం వచ్చిన వారికి వోటు వేశారు ఇకతిట్లకు అభాండాలకు జనం చెవి చెవుడు పట్టి పోయిందనుకుంటాను ఈ ఎన్నికలలో ఉదయించిన దూషణ సాహిత్యంతో వేయి చంద్ర రేఖా విలాపాలు (వేయి రావణదమ్మీయాలు) మరెన్నో కావ్యాలు మలచవచ్చు వాటిని ప్రజలు శ్రద్ధగా వింటే ఏమిచేసేవారో! నాకు చూడగా వినలేదనే అనిపిస్తుంది వింటే కొంతకు కొంత ఫలితం వుండేదేమో! వెనుకటి ఎన్నికలలో విదేశీ బూచిని చూపేవారు ఈసారీ చూపారు దానితో పాటు మరొక నినాదం దేశాన్ని రక్షించండి- అనేది దేశం ఎక్కడికీ పోదు కొన్ని వేల ఏళ్ళుగా అచలగా పడివుంది ఇకఇప్పుడు ఎక్కడికో లేచిపోయే ప్రసక్తి లేదు తనకు అధికారం వుంటే దేశం బాగున్నట్లు లేకపోతే నాశనమైపోయినట్టు- అనే కాంప్లెక్స్‌ను ప్రతిరాజకీయపక్షమూ విడనాడాలి మనకు అధికారం రాగానే దేశంలోని జనమంతా మనమాట వింటారా? ఇంతకూ మనకింకా ప్రజాస్వామ్య దృక్పథమే అలవడలేదు మనపార్టీ అధికారంలో వుంటే ప్రజాస్వామ్యం ఇతర పక్షాలదైతే నియంతృత్వం అనే ధోరణి ఏమీ మారలేదు ప్రజాస్వామ్యంలో ఏదో పార్టీ ఉన్నదున్నట్లుగా పుట్టుకొని వచ్చి అధికారానికి వస్తుంది దానికి గింజాకుంటే ఎట్లా? ప్రజాస్వామ్య పద్ధతులతో ప్రజలను తమ వైపు తిప్పుకొనే పద్ధతిని అవలంబించాలి గాని కోర్టులు తిట్లు పితూరీలు దుండగాలు పని చేయవు

ఇప్పుడు దేశంలో వున్న పరిస్థితి చూడగా ద్విపక్ష విధానం పట్ల ప్రజలు మొగ్గుతున్నట్లు తోస్తుంది ద్విపక్ష విధానం మన దేశానికి శ్రేయోదాయకమనిపిస్తుంది ఏ పార్టీ లయినా సరే రెండు –లేక కొన్ని కొన్ని పార్టీల సమాఖ్యల రెండు వర్గాలు- ఉత్తమ స్థిర న్యాయ పరిపాలనను ప్రసాదించగలవేమో నని అనిపిస్తుంది ఈ ద్విపక్ష ప్రభుత్వ పద్ధతిని లో గడ కొందరు నాయకులు సమర్ధించారు గాని అది ఎందుకో రూపు దిద్దుకోలేదు ఈ రెండు పార్టీలు లేక వర్గాలు పోటాపోటీలతో దేశానికి హృదయ పూర్వకంగా సేవ చేసే అవకాశం వుంది మనదేశం వృత్తి ప్రధాన మైన వర్ణ వ్యవస్థ గలదేశం ఆ వృత్తులు మారినా వర్ణాలు ఇంకా అంతగా మారలేదు- క్రమంగా మారవచ్చు సామ్యవాదం వంటిది వచ్చినా మన ఉపశ్లోకాలవు లఘు ఉన్నత స్థాయి సామ్యవాదం – వర్ణాదులకు అతీతమైన జ్ఞాన శ్రేయః ప్రధాన మైన సామ్య వాదం – వస్తుందే కాని మరొక విదేశీ సామ్య వాదం రాదని నా దృఢ విశ్వాసం మన మనస్తత్వం అటువంటిది నిజానికి సామాన్య భారతీయుని వంటి ఉదార హృదయుడు ప్రపంచంలో లేడు అతని హృదయానికి దగ్గరగా విశ్వాసాలకు సమీపంగా ఏ సిద్ధాంతం తటస్థ పడినా ఆకర్షితు డవుతాడు ఈ పనిని ఇంత వరకు పెద్ద రాజకీయ పక్షాలు చేయలేదు ఇక మీద రాజకీయ పక్షాలు సమాఖ్యలుగా చేరి దేశ సంక్షేమ కార్య క్రమం ప్రాతిపదికగా ఏక సూత్రం పై నడిచి రెండు వర్గాలుగా చేరి దేశంలో ద్విపక్ష పరిపాలన నెల కొనడానికి ప్రయత్నిస్తే

## ఉపశ్రుతి –

ఉగాది నాడు రవీంద్రభారతిలో ప్రభుత్వ సన్మానం అందుకోడానికి కళాకారులు పండితులు రచయితలు రచయిత్రులు వేదిక మీద బారులు తీరి కూర్చున్నారు కవి సార్వభౌమ శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి టోపీ పెట్టుకొని వచ్చారు ఏం శాస్త్రిగారూ టోపీ వేశారే? – అన్నాను ఇతరులకు కాదు గదా! – అన్నారు ఆయన తనకు టోపీ పెట్టుకొనే వారు ఇతరులకు పెట్టలేరు – అని సోదరి కుమారి వాసిరెడ్డి సీతాదేవి (జవహర్ బాల్ భవన్ డైరెక్టర్) చలోక్తి విసిరారు

–తిరుమల రామచంద్ర

ఇటీవల హైదరాబాద్‌లో సార్వత్రిక విశ్వవిద్యాలయ ప్రథమ స్నాతకోత్సవ సందర్భంలో మిమిక్రీ ప్రదర్శనానంతరం ఛీఫ్ జస్టిస్ ఆఫ్ ఇండియా శ్రీ పాఠక్ నుంచి మెమెంటో స్వీకరిస్తున్న శ్రీ నేరెళ్ళ వేణుమాధవ్



# రంజీ ట్రాఫీ విజేతలు హైదరాబాద్

హైదరాబాద్ క్రికెట్ జట్టు యీ ఏడు రంజీ ట్రాఫీ కైవసం చేసుకొన్నది 49 ఏళ్ళ తర్వాత రెండవ సారి హైదరాబాద్ క్రికెట్ జట్టు యీ విజయం పొందినది 1937 – 38 సీజన్ రంజీ ఫైనల్సు బొంబాయిలో జరిగినప్పుడు హైదరాబాద్ జట్టు నావానగర్ జట్టును ఓడించి మొట్ట మొదటి సారి రంజీ ట్రాఫీ గెల్చినది అప్పటికి యున్న సంస్థానములు మంచి క్రికెట్ క్రీడాకారులను పోషించి ఆడించేవి ఆ తర్వాత రెండు సార్లు ఫైనల్సునకు చేరినది కాని విజయం పొందలేదు 1942–43లో బరోడా సంస్థాన జట్టుచే ఓడించబడగా 1964–65లో బొంబాయి జట్టు హైదరాబాద్‌పై గెల్చినది

ఢిల్లీ ఫిరోజ్ షా కోట్లా క్రీడాంగణములో జరిగిన ఫైనలు పోటీలో హైదరాబాద్ ఢిల్లీ జట్టు తమ తమ జోన్ లలో విజయాలు సాధించి ఫైనల్సుకు చేరాయి ఫైనలు పోటీలో హైదరాబాద్ బ్యాటింగ్ ప్రారంభించి మొదటి యిన్నింగులో 457 పరుగులు చేయగా ఢిల్లీ 433 పరుగులు చేసినది రెండవ యిన్నింగులో 480 పరుగులు ఏడు వికెట్ల నష్టానికి హైదరాబాద్ చేసినది హైదరాబాద్ ఆటగాడు 615 నిమిషాలు ఆడి అవుట్ కాకుండా యిన్నింగు ముగియు సమయానికి 211 పరుగులు చేసి మైదన్ డబుల్ సెంచరీ" చేసి ప్రశంసలు పొందాడు అప్పటికి 14–5 ఓవర్లు కాబడి ఆట ఆపి వేయబడినది హైదరాబాద్ జట్టు రెండవ యిన్నింగులో నరసింహరావు అయూబ్‌లు అద్భుతమైన ప్రతిభ కనపరిచారు నరసింహరావు 38 అయూబ్ 80 పరుగులు చేసారు ఆట ఒక పరిస్థితిలో హైదరాబాద్‌ను ఢిల్లీ అధిగమించ గల అవకాశము కనిపించినది రెండవ యిన్నింగులో వరుసగా ఒకదాని తర్వాత మరొకటి – వి మనోహర్ విహరముద్దీన్‌లు అవుట్ అగుటతో మలుపు కనిపించినది మోహన్‌రాజ్ నరసింహరావు జంటను ఓడించుటకు ఢిల్లీ బౌలర్సు చేసిన ప్రయత్నములు ఫలించలేదు హైదరాబాద్ జట్టు సారథి నరసింహరావు లంచ్ సమయమునకు ముందు 38 పరుగులకు శశికాంత్ క్యాచ్ తో అవుట్ అయాడు వివేకజయసింహ 18 ఖయ్యూమ్ 17 లు అవుట్ అగుటతో కొంత వెనుకంజ కనిపించినది అర్షద్ అయూబ్ ప్రవేశించి 80 పరుగులు చేయగలిగాడు మొదటి యిన్నింగులో అర్షద్ అయూబ్ 174 పరుగులు చేసి యున్నాడు ప్రతిభగా ఆడినందుకు మాన్ ఆఫ్ది మ్యాచ్ ప్రశంస పొందాడు

హైదరాబాద్ జట్టు అఖండ విజయానికి కారకుడు మోహన్ రాజ్ అనవచ్చును ఇతని అద్భుత బ్యాటింగ్ నైపుణ్యము ఎంతో సహకరించినది రెండవ యిన్నింగులో మోహన్‌రాజ్ ఎక్కువ పరుగులు చేయకుండా అవుట్ అయి యున్నచో పరిస్థితులు మారియుండేవి పది ఫోర్స్ చేసిన మోహన్ రాజ్ 615 నిమిషాలలో ఒక్క సిక్సర్ సాధించ లేక పోవుట విచిత్రము

అయిదు రోజులు జరిగిన ఫైనలు పోటీ స్థానిక ప్రజలను అంతగా ఆకర్షించలేదు. ఎందరో అగ్రగాములు పాల్గొన్న ఫిరోజ్ షా 'కోట్లా క్రీడాంగణము 'చార్మినార్ ఛాలెంజ్ రంజీ ట్రాఫీ' ఫైనలు పోటీ స్థానికులకు రుచించలేదు. కొన్ని వందల మంది మాత్రము వచ్చారు రెండు జట్లలో జాతీయస్థాయి ఆటగాళ్ళు యుండియు వారు పాకిస్తాన్ పర్యటన పోటీలలో పాల్గొనుట వలన రంజీ ఫైనల్సులో ఆడలేక పోయారు ఢిల్లీ జట్టులో మదన్‌లాల్ మహీంధర్‌సింగ్ మనోజ్ ప్రభాకర్ లేని లోటు కనిపించినది వారు ఆడిన ఢిల్లీకి కొంత లాభించేది హైదరాబాద్ జట్టులో దిస్సు ఆటగాడు శివలాల్ యాదవ్ ·అతని సోదరుడు రాజేష్ యాదవ్ బౌలింగ్ ప్రతిభతో వికెట్లు పడగొట్టారు ఢిల్లీ మొదటి యిన్నింగులో కె వి భాస్కర్ 160 పరుగులు చేసి అవుట్ కాలేదు మొహిందర్ అమర్‌నాథ్ 85 పరుగులు చేసారు హైదరాబాద్ జట్టులో అజారుద్దీన్ పాల్గొనలేదు

## రంజీ పోటీలలో రికార్డులు

1964–65 పోటీ హైదరాబాద్ – బెంగాల్ మధ్య హైదరాబాద్‌లు జరిగినప్పుడు ఎం. ఎల్. జయసింహ 259 పరుగులో ఒకే యిన్నింగులో చేసి వ్యక్తిగత రికార్డు నెలకొల్పాడు.

హైదరాబాద్ గర్వించ తగిన ఆటగాడు గులాం అహమ్మద్

రంజీ పోటీలలో హైదరాబాద్ అతి ఎక్కువ పరుగులు 1965లో బెంగాల్‌తో ఆడినప్పుడు సాధించినది 635 పరుగుల రికార్డు అతి తక్కువ పరుగులు 1959లో మైసూరుతో ఆడినప్పుడు 69 పరుగులు చేసినది

–ముకరమ్

ఢిల్లీ జట్టుని వోడించి రంజీ ట్రోఫీని గెలుచుకున్న హైదరాబాద్ జట్టు



Printed and Published for Nageswara Rao Estates Private Ltd by S Nageswara Rao at the Andhra Patrika Press Gandhinagar Vijayawada _ 520 003 Acting Editor M Madhava Rao Chief Editor S Radhakrishna
Phones Business 61247 61248 75569 Editorial 75667

# ఆపిల్‌తో నారింజను పోల్చగలమా?

## సాటిలేని మేటి ఆల్విన్

చూసేందుకు ముచ్చటగా, సాంకేతిక పరిజ్ఞానంలోనూ, పనితనంలోనూ సాటిలేని మేటి వాడుకలో ప్రతి ఆల్విన్ రిఫ్రిజిరేటర్ ఒక మణిపూస

మా రిఫ్రిజిరేటర్ల తయారీలో 30 ఏళ్ళ నిరంతర శ్రమ, అనుభవం ప్రతిచోటా ప్రతిబింబిస్తుంది

ప్రత్యేక లక్షణములు -

- హిటాచీ కంపెనీ వారిచే నిర్మించబడిన కంప్రెసర్
- త్వరితగతిని చల్లబరిచే సమర్థనీయమైన ' రోల్ బాండ్‌ఫ్రీజర్
- స్టెబిలైజర్ అవసరము లేకుండా 170 నుండి 250 వోల్టుల వరకు పని చేయు శక్తిగలది
- కేవలము మీట నొక్కితే చాలు దానంతటదే మంచు కరిగిపోవును
- వీటన్నిటితో బాటు ఏడు సంవత్సరముల గ్యారంటీ
- ఇంకా దేశవ్యాప్తంగా సాంకేతిక సర్వీసు సౌకర్యం

మీకు పసందైన రంగులలో 165 మరియు 300 లీటర్లలో సింగిల్‌డోర్ డబుల్ డోర్‌లలో లభ్యమవుతుంది ఆల్విన్ రిఫ్రిజిరేటర్



7 సంవత్సరాలు గ్యారంటీ

IS 1476



ఆల్విన్




**అన్ని వేళలందు ఆల్విన్**

MAA(S) AWN 1A TEL